# అనర్ఘరాఘవము

(అయిదు అంకములు.)

భట్టమురారి

సంస్కృతనాటకమునకనువాదము.

[సమూలము.]

కిర్లమపూడి సంస్థానకవీశ్వరులు

## సత్యవోలు కామేశ్వరరాయకవి

కృతము.

మొదటి కూర్పు.
1,000 ప్రతులు.

కాకినాడ:
రంగా అండ్ కో., ముద్రాక్షరశాల.
1937.

 [రు. 1-0-0.

తే. గీ. పూర్వనృపులుండు కిర్లంపురాది పురము
నందె బాలురవిద్యకు ననువులేకఁ
గష్టపడుచుండు ప్రజలకుఁ గఱవు దీఱ
బాఠశాలను స్థాపించి వఱలు కృతికి !. 5

తే. గీ. శ్రీయుతునకు సీతారామకృష్ణ పూర్వ
రాయడప్ప రంగారాయ రాజవర్య
పౌత్రునకు, మఱియును సార్వభౌమువలన
విదితముగ 'జి. సి. ఐ. ఇ.' బిరుదము గనిన, 6

కం. స్వేతాచలకీర్తికిని
స్వేతాచలపతియు శేముషీశతధృతికా
స్వేతాచలపతి రంగ
జ్యోత్స్నావిభు పుత్రునకు సుజనమిత్రునకున్ !. 7

తే. గీ. అంకితమొసంగు నాకృతి, నాకృతిజిత
రతిపతి కహార్యధృతి కతిరమ్యగుణ న
సతికిఁ గిర్లంపురాది సంస్థాన విభుత
నలరు శ్రీరామకృష్ణ రంగాధిపతికి !. 8



# ఆశీర్వాదము



సీ. శ్రీసతి సత మురస్సీను నిల్వఁగ నెల

విచ్చునాఁడాపదల్ విచ్చువాఁడు

నాశ్రితుల కన్న నన్నింటికన్న ము

దరుగువాఁడ సురాళిఁ దఱుఁగువాఁడు

నరుల కన్నులు గొల్చు భక్తుల మిగులఁ జే)

మించువాఁడెదఁ గృప మించువాఁడు

ఘనకృపామతి నెవ్వ మునిమనోవీథుల

నడచువాఁ డఘపాళినడఁచువాఁడు

తే. గీ. నైన నారాయణుం డధికాయువమిత

భవ్యసుఖములితోధికైశ్వర్య మిచ్చి

కృతిపతిని రావు శ్రీరామకృష్ణ రంగ

రాయనృపు నేలుఁగాత! నిరంతరంబు!.

సీ. ఉదితప్రపంచకాస్పదతాతివిస్ఫూర్తి
నేని నాభీకుశేశయంబుఁ బెంపు
సంతత సురుచిర స్వర్ణదీప్రస్ఫూర్తి
నేని పాదపటంబు లేపుఁ జూపు
సుకరానేక పావనగుణ ప్రస్ఫూర్తి
నేని నైజాఖండకృప తెనఁగు
మహితాదిఘన తతమూలాంశ విస్ఫూర్తి
దనర నెవ్వని తనూదనము లమరు

తే. గీ. అట్టి నారాయణుం డతికాయుఁ డనిశ
భవ్యసుఖము లితోఁ గ నైశ్వర్య మిచ్చి
కృతిపతిని రావు శ్రీరామకృష్ణ రంగ
రాయనృపు నేలుఁగాత ! నిరంతరంబు !. 10

సీ. హరియయ్యుఁ గరుణతోఁ గరిఁ గాపు గావించి
యబ్బురంబగు జాడ నలరు ప్రోడ
గరుడధ్వజుండయ్యు నురగంబు శయ్యగా
వించి హాయిగఁ బవ్వళించువాఁడు
మాధవుండయ్యును మార్గశీర్షాత్మక

తే. గీ నై మెలంగెడు రావు శ్రీరామకృష్ణ
రంగరాయ మహీపాలు రమ్యశీలు
నర్థిసుగపాలుఁ గవివిద్వదవనలోలు
భూరిగుణజాలు శ్రీనేత బ్రోచుఁగాత!. 12



"HAVAMAHAL"
BEACH ROAD,
VIZAGAPATAM.
28-1-1936.

# ఆశయము.

కిల్లంపూడి యాస్థానకవీశ్వరులు, 'ఋతుసంహార' 'రతిమన్మథ నాటకా'నువాదులు, 'శ్రుతికంఠోపాఖ్యా'నాది గ్రంథరచయితలు, నగు శ్రీయుత సత్యవోలు కామేశ్వరరాయకవిగారిచేఁ దెలిఁగింపఁబడిన "అనర్ఘరాఘవనాటకము" నందలి కొంతభాగము వింటిని. ఆ నాటకము నింతకుమున్నె కీర్తిశేషులైన ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులు గారు తెలిఁగించియుండిరి. శాస్త్రిగారి కవిత్వము నిర్దుష్టమైనను, శైలినిబట్టి వారి యనువాదము 'మూలోఽపి టీకాయతే' యనునట్లున్నది. అందుమూలమున మురారినాటకము తెలుఁగులోనికిఁ వచ్చిన ననుటకు వీలులేదు. శ్రీకామేశ్వరరాయకవిగారి కవిత్వము మృదుమధురపదభరితమై సుబోధమై మూలమునకు వన్నెపెట్టినట్లున్నది. వార్ధక్యము కతమున నాటకమంతయు వీరు తెలిఁగింపలేకుండుట శోచనీయము. గ్రంథము సమూలముగా ముద్రింపఁబడుట ప్రశంసనీయము.

శ్రీ విక్రమదేవవర్మ.
సాహిత్యసమ్రాట్టు, డీ. లిట్టు;
శ్రీ శ్రీ శ్రీ జయపురమహారాజు.

# ప్రకాశకుని విజ్ఞప్తి.

మా నాయనగారు మొదట నీగ్రంథము నాలుగంకములవఱకు మాత్రమే ప్రచురింపదలఁచి, విశేషకాలము ముద్రణలోనున్న సమయమున పంచమాంకమునుగూడ ననువదించి యిందు జేర్చు నుద్దేశ్యముతో గ్రంథారంభమున తాము చేసిన 'విజ్ఞప్తి' యందుఁ చివర నట్లనే వ్రాసియుండిరి. కాని యందువలన గ్రంథము ప్రచురించుట మఱింత జాలమగునేమోయని నేను మిగుల సంశయించితిని. 1936 సెప్టెంబరు నెలలో వారికి దేహాస్వస్థతచెంది క్రమముగా ననారోగ్యస్థితి హెచ్చగుటచే నెట్లయినను మొదటియభిప్రాయము ననుసరించియే నాలుగంకములవఱకు మాత్రము పూర్తిచేసి ప్రచురింపదలఁచి యెంతో ప్రయత్నించినను నదియు మాదురదృష్టవశమున సాధ్యమయినది కాదు.

ఆంధ్రీకరించిన పంచమాంకమును సమూలముగా ముద్రణమునకు స్వయముగా తామే వ్రాసి సిద్ధపఱచి ఆరోగ్యములేని సమయమందుఁ గూడఁ తదేకదృష్టితో శ్రమపడుటవలన దేహస్థితి బొత్తిగాఁ జెడి తుదకు అక్టోబరు నెల 8వ తేదిని మమ్ములను దుఃఖమున ముంచి వారు పరలోకగతులైరి. వారు వయోవృద్ధులైనను నీగ్రంథమాంధ్రలోకమున వెల్లడియగువఱకును, కృతిపతులగు రంగరాట్ప్రభువులకు తాము స్వయముగా కృతిని సమర్పించువఱకును, మఱి కొన్నిమాసములైనను వారు జీవించియుండినచో మిక్కిలి సంతోషదాయకముగా నుండెడిది. కాని విధినిర్ణయ మట్టులలేదు! ఆయన స్వర్గస్థులైన పిదప ప్రూఫులు దిద్దుట మొదలగు పనుల నేనే చూడవలసి వచ్చిన తరి కన్నుల నశ్రువులనింపుచు తమవారిగ్రంథము నెట్లనో యచ్చు పూర్తి చేయించితిని.

కామేశ్వరరాయకవిగారి జీవితచరిత్ర సంగ్రహముగా నైనను నిందు జేర్చి ప్రకటింపఁదగునని మిత్రులనేకులు కోరినను నిప్పటికే గ్రంథవిస్తరమును కాలవిలంబనమును యగుటం జేసియు, కవిగారిచే రచింపబడిన 'కుచేలాభ్యుదయ' నాటకమునకు విద్వాన్ శ్రీ కాశీ చయనులుగారు వ్రాసిన పీఠికయం దది కొంత వ్రాయఁబడియుండుట చేతను, స్థలాంతరమున వారి జీవితచరిత్ర కొంచెము విపులముగా వ్రాయించి ప్రకటింపఁదలంచి, యిందుఁ జేర్పకయే యీగ్రంథము ప్రకటింపఁబడినది. కవికృతమైన యితరగ్రంథముల నామములు మాత్రము టైటిల్ పేజీలో వెనుకవైపునఁ బేర్కొనబడినవి.

ఎచటను ఘోరముగ గురుకులక్లేశము నందకపోయినను వీరు విశేషముగా స్వయం కృషి చేసి బాల్యమునుండి యామరణాంతము సారస్వతగోష్ఠియందును నుత్తమకావ్యపరిశీలనమునందును కాలము బుచ్చుచు తాము **గూడ** తమ సామర్థ్యము ననుసరించి కావ్య నాటకాదుల రచించి వాఙ్మయమునకు యథాశక్తిని సేవయొనరించి, తుదకు 'మురారి' పండితునియుద్గ్రంథమున కాంధ్రలోకమున వ్యాప్తి కలుగుటకై మిక్కిలి యుత్కంఠితులైన కృతికర్తయొక్క పరిశ్రమయుఁ దత్ఫలమును సహృదయులు పరిశీలించి నిర్ణయింతురు గాక !

4-3-37,<br>కాకినాడ.

సత్యవోలు లక్ష్మీనారాయణరావు.<br>బి. ఏ., బి. ఎల్.

---

# విజ్ఞప్తి.

"శ్రీ భట్టమురారి" కవిప్రణీత మగునీ "యనర్ఘ రాఘవ" నాటకమునకు నాయొనర్చిన యనువాదమును గూర్చి ప్రసిద్ధ మహాకవి శిఖామణులు "బాలసరస్వతి" "కింకవీంద్రఘటా పంచానన" నేత్యాది బిరుదాంకితులు (శతావధాని) బ్ర॥ శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు వ్రాసిన యుపోద్ఘాతము వలనను శ్రీ మురారి మహాకవియొక్క స్థలకాల నిర్ణయాదులనుగూర్చి కాకినాడ శ్రీపిఠాపురం మహారాజావారి కళాశాలలో నాంధ్రగీర్వాణ భాషోపన్యాసకులగు శ్రీమాన్ యీయుణ్ణి వెంకట వీరరాఘవాచార్యులు యెం., ఏ, గారువ్రాసిన పీఠికవలనను వెల్లడియగును. గాన నేనింక వానినిగూర్చి వ్రాయునదలేదు.

ఈగ్రంథమును నేనెందును గురుముఖమునఁ జదివియుండలేను. వ్యాఖ్యానసాహాయ్యమున స్వయముగనే చదివికొని మిక్కిలి ప్రౌఢమగు దానియందలి యాసక్తి విశేషముచే నెట్టయిన దీని నాంధ్రమున ననువదింతమను కుతూహలము కలిగి యథాశక్తిగా భార్గవవిజయము వఱకుఁ గల నాలుగంకములు మాత్రము రచియించి యంతటదృష్టిపాటవము కొంత తక్కువయైకనులకు శస్త్రచికిత్స చేయించుకొనుటచేత వెంటనేమఱల గ్రంథావలోకనమున నలయించినచోఁ గన్నులకు మఱల దృష్టిలోపము కలుగునను భీతిచేత

ను స్వతః సార్థకమునఁగలిగిన దార్ఢ్యహీనతవలనను ప్రస్తుతము ప్రథమభాగముగా నంతటితో నిలిపివేయఁబడినది.

దీని నస్మత్పోషకులగు శ్రీ రాజా రావు శ్రీ రామకృష్ణ రంగా రావు బహద్దరువారి కంకితమొనర్చితిని. వారెంతయు నాదరముతో విని సంతోసించుటయే గాక వెంటనే దీనిని ముద్రింపించి ప్రచురణ చేయించవలసిన దని సెలవిచ్చి ముద్రణమున కగు ధనమొసంగి తమకుఁ గల కవిపండితాదరమును భాషాభిమానమును వెల్లడించిరి; చిరకాలమునుండి బాలుర విద్యాభివృద్ధి కొఱఁతపడియున్న కిర్లమపూడి గ్రామమున, బహుధనసాధ్యమగు పాఠశాలను నెలకొల్పించి జనులవిద్యాభివృద్ధికెంతయుఁ దోడ్పడి మహౌదార్యమును బ్రకటించి ప్రజల సన్నుతులను బడయుచున్న వీరియౌదార్యమున కిది క్రొత్తది కాదు.

ఈనాటకము నిదివఱలో రాజమహేంద్రవరవాస్తవ్యులును నచ్చటి ట్రైనింగుకాలేజీ సంస్కృతోపాధ్యాయులు నగు కీ॥ శే॥ బ్రహ్మశ్రీ ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రులవారు చాల కాలముక్రిందనే ఆంధ్రీకరించియుండిరి; వారి యనువాదము యథామూలముగాను మిగులఁ బ్రౌఢముగాను నున్నదనుట నిర్వివాదాంశమే. అయినను మఱల నేను నద్దానినే యనువదింపఁబూనుట నాకా మురారి గ్రంథమునందలి యభిరుచియే ముఖ్యకారణము.

ఇఁక నియ్యనువాదసందర్భమునఁ గొన్ని యంశములు దెలుపవలసియున్నవి.

1 నాందీశ్లోకములలో "విశ్వశ్రీవ్యాహ" మను మొదటి దాని కొక్కపద్యములోఁ ద్రుప్తిభిటక వేఱువేఱు విధముల వేత్వేఱువృత్తముల నాంధ్రీకరించిన నెట్లుండునో యని పెక్కు పద్యములు రచియించియు విస్తరభీతిచే నందియిదింటిని మాత్రమే ప్రచురించితిని.

2 రెండవదగు "విరమతి" యనుదానికిఁ గలదని పెద్దలవలన వినిన పాఠభేదమును గూడ నిందుఁజేర్చి దానిని గూడ నను వదించినాను. బాగుగ విమర్శించినచో నీపాఠమే యెక్కువ సమంజసముగా నుండెడునట్లు కన్పట్టుటచేతఁ గవియభిప్రాయ మిదియ కావచ్చునని తోఁచుచున్నది; విద్వాంసులు విమర్శింపఁ బ్రార్థితులు.

3 ఇటీవల నాకు లభించిన నాగరిప్రతిలోని రుచిపతివ్యాఖ్యానమువలనఁ దెలిసిన విశేషములను వ్యక్తపఱచుటకు గాను ప్ర॥ అం॥ 19 శ్లో॥ "ఉన్మ్యాన్విపయతి" తృ॥ అం॥ 53 శ్లో॥ పౌరాణిభిః" అను రెంటికిని రెండేసివిధముల రెండేసిపద్యములు వ్రాసినాను. మఱియు దానియందే యధికముగ నుండెడు ప్ర॥ అం॥ 34. శ్లో॥

ఏతాభిస్తవ కౌతుకోత్క్షిపదిశైర్విద్యమూర్తైరివ
త్వష్టస్త్యమరశిల్పినా దినకృతోఽనచ్ఛేద వేదాక్షరైః
పూతాఃస్తోత్రనయ మర్త్య యద్యపి హేదపాజ్ఞామపి స్వాయమాం
వోఢం విష్టరసర్ఘ తాంశుకుతే కల్యాంతి ముక్తాఙ్ఞలతు॥

అను నది "అనర్ఘరాఘవ" మను దీనినాటకమున కనుబంధము

గానుండి చాల ముఖ్యమైనదియే యగుటచే దానిని గూడ నిందుఁజేర్చి యదియు ననువదించితిని.

4 ఇందొకటి రెండుచోట్ల సుస్పష్టోక్తులుఁ గొంత గూఢముగా నున్నను దెలుఁగున గూడ వ్రాయుట ఇక్కాలమునకనను కూలమనితోఁచు సీతావయవ వర్ణనములు గల శ్లోకములను గొన్నిటి ననువదించియుఁ నిందుఁ జేర్పలేదు. కాని ఇటీవలఁ గొందఱు రసజ్ఞులు "స్వాతంత్ర్యము ననుసరించి మూలశ్లోకములను విడచుట యంత సముచితముగా లే" దని అనుటచే దాని కంగీకరించినను నచ్చు పూర్తియగుటచే సమనునను నపిచేర్పవలను పడక చివర ననుబంధముగాఁ జేర్పడమయినది. ద్వితీయముద్రణమున యథాస్థానములందుఁ జేర్పఁబడును.

5 విశ్వామిత్రుని శిష్యులపేళ్లు బాత్రిక నీతిబాహ్యముగ నుండుటచే వేఱువిధముగ మార్చివాఁడను. బ్రహ్మశ్రీ వ్యాసమూర్తి శాస్త్రిగారు కూడ నీహేతువుచేతనే కాఁబోలును మార్చియున్నారు; కవి యట్లేల వ్రాసియుండునో యెవ్వరే నెఱిఁగినఁ దెలుపఁ బ్రార్థితులు.

6 ఇందచ్చుతప్పు లెన్నియో యున్నవి; అందును ముద్రణము రేఫలు, తవర్గద్వితీయ చతుర్థవర్ణములు ముఖ్యముగ వ్యత్యస్తములై యున్నవి. పాఠకులు దయతో సవరించుకొని చదువుకొందురు గాక, యని ప్రార్థించుచున్నాను.

7 మఱియు నిందు మూలగ్రంథములోని ద్వితీయాశ్వాసము 18 వ గద్యమునందుఁ సహస్రసంఖ్య యనియుఁ దృతీ

యాంకము 60 వ గద్యమునందు "ఘృతచక్షుషః" అనియు గౌతమ శాపబంధకలుగక ముందే యింద్రునికి సహస్రాక్షిత్వమారోపింపఁబడినది. ఇట్టివ్యత్యయములు పండితరాజ ప్రణీత "రతిమన్మథ" నాటకాదులయం దక్కడక్కడ నుండినను స్వభావ విరుద్ధముగుటచే స్వతంత్రించి యావిశేషములను విడువడమయినది.

ఈగ్రంథమును మిగులదయతో నాలకించి యెంతయు సంతసించి నాయందత్యాదరమును జూపుటయే గాక వెంటనే దీని ముద్రితముఁ గావించి ప్రచురితముఁ జేయించి తద్ద్వారమున శ్రీశ్రీ పిఠాపుర సంస్థానాధిపతులు "సాహిత్య సమ్రాట్" "డిలిట్" ఇత్యాది బిరుదాంకితులు కవి పండిత ప్రభు శిఖామణులు నగు శ్రీ విక్రమదేవ వర్మ మహీపాలు సంతతివారి మెప్పునకుఁగూడఁ బాత్రమగు భాగ్యమును గల్గించి యీగ్రంథమును సార్థకపఱిచిన యస్మత్ప్రభువులగు ఏతత్కృతిపతులును నగు శ్రీ రాజా రావు శ్రీ రామకృష్ణ రంగారావు బహద్దరువారికి సర్వేశ్వరుఁ డాయురారోగ్యాది సర్వశ్రేయములు నిత్యైశ్వర్యంబును నొసంగి రక్షించును గాక.

ఈగ్రంథమును మిగుల శ్రద్ధతోఁ బరిశీలించి దీనికి విపులమగు సుపోద్ఘాతమును వ్రాసినా యందలి ప్రేమాతిశయమును వెల్లడించిన "శతావధాని" బ్ర॥ శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి నెంతయుఁ గొనియాడుచున్నాఁడను.

మిగుల శ్రమఁజెంది ప్రాచ్యపాశ్చాత్య మహాకవుల ప్రాచీనగ్రంథ ములనెన్నిటినో పరిశోధించి యీమహాకవియొక్క జన్మస్థల కాలపాండిత్యవిశేషాదులను నెల్లడించుచు దీనికి వేఱొకపీఠికను వ్రాసి నాకుఁ దోడ్పడిన శ్రీమాన్ యియ్యుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు "యెం, యే" గారికి మిగులఁ కృతజ్ఞుఁడను.

మఱియు నాకీనాటకానువాదవిషయమునఁ దమగ్రంథము లనుఁ గొంతవఱకు మార్గదర్శకములయిన శ్రీ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులవారి నెంతయు గౌరవపూర్వకముగా స్మరించుచున్నాఁడను.

ఇందుఁ "పంచమాంకము" నిటీవల ననువదింపఁగలిగితిని.

కాకినాడ,
ది 1 జూలయి 1936.

ఇట్లు బుధజన విధేయుఁడు,
సత్యవోలు కామేశ్వరరావు,
కిర్లంపూడి సంస్థానకవి.



శ్రీ సర్వదేవతాభ్యో నమః.

# ఉపోద్ఘాతము.



"సారం తు సారస్వతం, జానీతే నితరామసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః" అని సమకాలికులగు కవివరులచే బొగడ్తగన్న మురారికవినిగూర్చి నాబోంట్లిక్కడ విస్తరించుట యనావశ్యకము. అమ్మహాకవినాటకము నాంధ్రీకరించుట కెవ్వరును నేటి కాలపువారు సాహసింపలేరు కాని సర్వవిధముల మరల నమ్మురారి కవిని జ్ఞప్తికిం దేవగు పాండిత్యము గల శ్రీమదాకుండి వ్యాసమూర్తిశాస్త్రులవారు సుమారిప్పటికి ముప్పది యేండ్లనాడు తెనిగించి ముద్రింపించి ప్రకటించియున్నారు. ఇప్పుడు కాదు గాని మావిద్యార్థిదశనాటికి నీ నాటకమును పాఠము చెప్పదగినవారు పండితులలో లెక్కకుం గొందఱు మాత్రమే యుండెడువారు. ప్రస్తుతమీ యనర్ఘరాఘవ నాటకమునే యాంధ్రీకరించి ప్రకటించుచున్న గ్రంథకర్త కామేశ్వర నాయకవిగారు నా పేర నిట్లు వ్రాయుచున్నారు.

18-1-1936,

కాకినాడ.

. చిరమిత్రమా! సుకవిసత్తమా!

శ్రీ భట్టమురారి యనర్ఘరాఘవ నాటకమును, చిరకాలము క్రిందటనే ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రుల వారాంధ్రీకరించియున్నారు.

నాకు ఆగ్రంథమందలి వేడుకచేతను, కొందఱు మిత్రుల ప్రోత్సాహముచేతను నేనుగూడ మూల నాంధ్రీకరించినాను. అది మన కిర్లంపూడి సంస్థాన వర్తమాన ప్రభువులగు శ్రీరాజా రావు శ్రీ నాను కృష్ణ గంగారావు బహద్దరువారు విని సంతసించి ఆదరముతో నచ్చు వేయించుచున్నారు. అచ్చయినంతమట్టునకు ఇదివఱలో తమకడకుఁ బంపించినాఁడను. దీనికిఁ బీఠిక నాయనవారసి యున్నది. సర్వవిధములను దానికిఁ దగు సామర్థ్యము గలవారును, మొదటినుండియు మా యన్న గారి (సోమసుందరకవి) వలెనే నాయందును నాకవిత్వమునందును నెక్కుడభిమానము గలవారును తామే యగుటచేత, ప్రస్తుతము నావలెనే వార్ధకమునఁ గొంచెము దార్ఢ్యము తక్కువగా నుండియు సరసి యనుకొనియు, మిక్కిలి శ్రమపెట్టవలసి వచ్చినందులకు క్షమించి యెట్లో కొంచెము ఓపికవహించి దీనికి విపులమైన పీఠిక వ్రాయించి నాయందుఁ దమకుఁగల ప్రేమాతిశయమును వెల్లడించి నన్నానందింపఁ జేయుదురని నమ్ముచున్నాను.

(సం.) సత్యవోలు కామేశ్వరరావు.

పైయుత్తరమువల్ల మహామహోపాధ్యాయ యీయన వ్యాసమూర్తి శాస్త్రులవారి యాంధ్రీకరణమును ఈయన చూచియే యున్నారను సంశయమేకాక కవివంశములో నీయనమాత్రమే కాక అన్న సోమసుందరకవిగారు సయితము కవులను సంశయముకూడ మనకుఁ దెలియుచున్నది. ఆ సోమసుందరకవిగారు గానమందుఁగూడ మంచి ప్రవేశము కలవారు. పైఁగా రసవత్కవిత్వము విన్నప్పుడు ఆయనకు తన్మయత్వము కన్నీటి మూర్ఛకూడఁ గలుగునేమోయని భయపడవలసి

వచ్చెడిది. ఈలాటి విషయములు కొన్నిటిలోఁ దప్పఁ బ్రస్తుత గ్రంథకర్త సర్వవిధముల నన్నగారికిఁ దీసిపోవువారు కారు. అన్నగారి కుమాళ్లు రాధామాధవరావు లోనైనవారును కవులేగాక గాయకులుఁగూడ నై యున్నారు. గునుగుసీసములను పేరితోఁ బ్రసిద్ధి చెందినట్టియు బ్రాహ్మణ సంతర్పణములలోఁ దఱిమ భోజనకాలమును గోవిందనామస్మరణకు వాడఁబడుచున్నట్టియు "రఘునాథరాయణుండవ! నారాయణుండవ!" అనెడి మకుటములుగల దశావతారవర్ణన పద్యములతోనొప్పు పక్షిసేపరిణాయములోనగు కొన్ని ప్రబంధములు నైతము రచించిన శ్రీ సత్యవోలు భగవత్కవి (ఇందుమునించుకూడిముంచి సోదరులకు నమకాలికుఁడు కొన్నాడ(గ్రామనివాసి) వీరి వంశవృక్షములోనివాఁడే కాక దగ్గఱివాఁడు కూడనని సోమసుందరకవిగారు నాతోఁ జెప్పినట్లు జ్ఞాపకమున్నది. ఆ యీసందర్భముల వలన వీరి వంశము కవితావంశమని తేలినది. గ్రంథకర్త అన్న సోమసుందరకవిగారు బహుగ్రంథములను రచించి యావజ్జన్మమును కవితారచనకే వినియోగించిరని నేనెఱుఁగుదును. ఆయనకు వసుచరిత్ర యనినఁ బ్రాణమే ప్రస్తుతముగామింజేసి స్పృశించి వ్రాయుటను వదలుచున్నాను.

ఈ గ్రంథకర్త కామేశ్వరరావుగారును బహుగ్రంథములు తెనుఁగున వ్రాసియున్నారు. పూర్వకవులవలె సంప్రదాయసిద్ధమైన కవిగాని సామాన్యకవి కాఁడనుట నిర్వివాదాంశము. మురారి మహాకవికృతమైన నాటకము నాంధ్రీకరించుటకు సంపూర్ణమైన సంస్కృతభాషాసాహిత్య ముండినఁగాని యెవ్వరును బూనరనుట స్పష్టమగుటచే గ్రంథకర్తగారి సాహితినిగూర్చి వేఱుగఁ బ్రస్తావిం

చుట చర్విత చర్వణము. ఇఁక నాంధ్రీకరణ మెట్లున్నది? యని విచారింపవలెను. పీఠిక వ్రాయుచున్న నాయుద్దేశమునుబట్టి కావ్య నాటకాదులకన్న ఆంధ్రీకరణమునకుఁ బురాణములే తగినవని చాల కాలమునాఁడే అన్యత్ర వ్రాసియున్నాను.

ఉ॥ కావ్యముగాని నాటకముగాని మహాకృతిగాని తెన్గునన్
శ్రావ్యముగా నెసంగదు, పురాణము తెన్గొనరించినన్ గడున్
శ్రావ్యతగాంచి యొప్పునఁగ సంస్కృతమూలగతిని తెలిసేయు నీ
కావ్యము శబ్దమూలము పదంబుగాఁ దెలుంగొనరింప శక్యమే !॥

ఉ॥ అంతఁ బురాణముల్ మిగుల సాదము పొలుపొందఁ గావ్యమా
చందముగా మనంబునకు సంతసమీయదు నాటకంబులున్
వింపలుగాఁ దెల్గునఁ గవిప్రవరుల్ పొసగించుపట్ల నే
యందము దేనియందొదవు నయ్యది దానని యుంచఁ బోల్పగున్॥

ఉ॥ తెనుగునఁ గొన్ని సంగతులు తీయని వై యలరారు, సంస్కృతం
బున మఱికొన్ని సంగతులు ముద్దులుమూటలుగట్టఁ జాలు, నిం
దును మఱి యందునుం గల సొబగుతోఁ దులఁదూఁగు నగ్గొన్ని సంగతుల్
వనిగొని చెప్పనేల? యిది పండితవేద్యముగాక యుండునే?॥

ఇత్యాదిగా మా శ్రీనివాసవిలాసపీఠికలో నా యభిప్రాయమును ప్రకటించియున్నాను. కాని స్వేచ్ఛవలనఁ గాకున్నను పరేచ్ఛవల్ల నైనను మేమును గొన్నినాటకము లాంధ్రీకరించియే యున్నాము. రఘువంశాదులును, శాకుంతలాదులును ప్రాచీను లాంధ్రీకరించుట కంతగా సాహసింపలేదు గాని ప్రస్తుతకాలములో పలువురు సాహసించి యాంధ్రీకరించిరి. కొంత యశస్సునుగూడఁ గొంచెము దాని వలనఁ జేకొనిరి. శ్రీనాథుఁడు కుమారసంభవములోని కొన్ని శ్లోకము

లను యథామాత్రకముగాఁ గాకున్నను ఛాయామాత్రముగాఁ గైకొని హాసవిలాసమునఁ దెలిఁగించెను. ఈయన నైషధాంధ్రీకరణమును నిట్టిదియేయని యెఱుఁగఁదగు. పేరు ప్రతిష్ఠలమాట దేవుఁడెఱుఁగునుగాని యీ మాదిరి నాటకమును దొంగిలింపఁ బూనినంతకే తోలుదోలుత భయము గలుగునుగదా? ఈమహాకవికి తఱచుగా సమాసములయందే తన భావముల నిముడ్చుట యలవాటు. అట్టి దీర్ఘసమాసములు తెనుఁగులో వాడుదమన్న లేనేలేవుగదా! సిద్ధసమాసములకుఁ బోతిమేని—

"గమికర్మీకృత నైకనీవృతః"

"గమికర్మీకృత నైకనీవృతుఁడనై కోరికన్"

అన్న మాదిరి యగును. అట్లు పరివర్తనచేసినచో "నీ యేమి తెలిగింప" ని యాక్షేపించువారి కాక్షేపింప సందుగలుగును. కాని బాగుగ యోజించినచో నట్టిచోటులట్లు అనువదింపవలెను గాని గత్యంతరము లేదు. గత్యంతరమే యున్నచో శ్రీనాథాదులు దానిని గమనింపకుందురా? ఈ రహస్యము సర్వసామాన్యముగా నోచరించునది కాదు. ఈ గ్రంథకర్త, స్థూలదృష్టిని విమర్శించువారలు లాక్షేపింతురనియే కాఁబోలును వీలైనంతవఱకు, దీర్ఘసమాసములను దీర్ఘసమాసములుగానే డు, ము, వు, లు, చేర్చి కూర్చక వేఱు వేఱు మాటలతోఁ దత్తదర్థస్ఫురణ కలుగునట్లు యత్నించెను, మచ్చున కొకటిమాత్ర ముదాహరించెద—

శ్లో॥ నమన్నృపతిమండలీ ముకుటచంద్రికా దుర్దిన
స్ఫురచ్చరణ పల్లవప్రతిపదోక్త దోస్సంపదా
అనేన సనృపేతరాం తురగమేధ ముక్తభ్రమ
త్తురంగ ఖురచంద్రక ప్రకరదంతురా మేదినీ॥ I-23

లయగ్రాహి॥

మ్రొక్కెడు నృపాలకుల చొక్కపుఁ గిరీటములఁ
జెక్కినమణిద్యుతులఁ బిక్కటిలు జ్యోత్స్నన్
జెక్కఁగ వహించి తళుకెక్కు పదపల్లవమె
నిక్కపు భుజాబలము నెక్కుడుగఁ దెల్పన్
మిక్కిలి జగద్వినుతి కెక్కు హయమేధతతు
లక్కజపులీలఁగను మక్కువ నొనర్పన్
బెక్కులు గతాలు తమ డెక్క గుఱుతుల్వాఱల
నొక్కి యిల యంతయును ద్రొక్కి యిడి యుంటన్॥

అనెడి పద్యములో విడివిడి పదములతోడనే పరివర్తింపఁ జేసినట్లు గమనింపఁదగు. మఱియు నీశ్లోకము నాంధ్రీకరించినప్పు డీసమాసము నే పుచ్చుకొని, డు, ము, వు, లు. చేర్చినచోఁ బూర్వోక్తమైన యాక్షేపణ తగులునను శంకకలిగియే కాఁబోలును వ్యాసమూర్తిశాస్త్రులవారు మూలమునందలి సమాసార్థమును సమాసాంతరముచే వచ్చునట్లాంధ్రీకరించిరి—

మహాస్రగ్ధర॥

ప్రణమత్సర్వంసహాధీశ్వరమకుట మణిశ్రేణిరుక్చంద్రికా మి
శ్రణశుంభత్పత్కిసాల ప్రతిపదకథిత ప్రాణదోర్దండుఁడీ రా
ణ్మణి నిర్మాణించె విశ్వంభర బహుసవ బంభ్రమ్యమాణాశ్వరింఖా
ర్వణ రాజచ్ఛాంద్ర కౌఘూర్వ్యాంణ విషమగనర్వప్రభానప్రశస్తిన్॥

(వ్యాసమూర్తి శాస్త్రులవారు I-23)

సర్వత్ర గ్రంథకర్త సమాసస్థలములందెల్ల నిట్లే వర్తించెనన వలను పడదు. ఎక్కడదాఁకనో యెందులకు? ఇక్కడనే—

శ్లో॥ చిరాదక్ష్ణోర్జాడ్యం శమయతి సమస్తాసురవధూ
కచాకృష్టిక్రీడా ప్రసభసుభగం భావుకభుజః
త్రిలోకీ జంఘాలోజ్జ్వల సహజతేజా మనుకుల
ప్రసూతి స్సుత్రాణ్ణోవిజయ సహాకృత్వా దశరథః।

అను శ్లోకమును వేఱొక సమాసపదములతోడనే అనువదించి యుండెను—

మ॥ సురవైరి ప్రమదా కచగ్రహకళా సంభవ్యహో బాహువుఁడ
క్షుర కీర్త్యంచితుఁడుజ్జ్వల త్రిజగతీ జంఘాలతేజుండు ని
ర్జరలోకేడ్జయమిత్రకుండు మనువంశప్రోద్భవుండైన పం
క్తిరథుఁడద్దిరె! పెద్దకాలమునకున్ దృగ్జాడ్యమున్మాన్పెడున్॥
(I-24)

వ్యాసమూర్తిశాస్త్రులవారును సమాసాంతరముచేతనే మూలార్థము ననువదించిరి —

మ॥ ప్రసభేంద్రారివధూ కచగ్రహ విహారప్రోత్థ బాహాఢ్యుఁ డిం
ద్రసహాయుఁడని బంతికేర్లదార భూవ్యాప్త్యాళ్ల లోకమ్ముల
న్వెస లంఘించెడి తేజువాఁడు మనుపృథ్వీనాథ వంశాంబు రా
శి సుధాంశుఁడు చిరాక్షిమంది మము విచ్ఛిన్నమ్ముగావించెడిన్॥
(వ్యాసమూర్తిశాస్త్రులుగారు I-24 ౭వ పేజి)

ప్రస్తుతగ్రంథకర్తగారు మాత్ర మచ్చటచ్చట మూలార్థమును వేఱొక సమాసముచే ననువదించినను వీలైనంతవఱకు విడివిడి పదములతోడనే అనువదించినట్లు పొడకట్టెడిని. చూడుఁడు—

శ్లో॥ ఉద్దామద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపల
జ్వాలాజాల జటాల జాంగలతటీ నిష్కూజకోయష్టయః।
ఘర్మోష్ణప్లవమాన సూర్యకిరణ క్రూరప్రకారా దృశో
రాయుష్కర్మ సమాపయంతి ధగమూర్మధ్యాహ్న శూన్యాదిశః॥
పేజీ 86 (II..30)

అను శ్లోకమును విడివిడి పదములతో నొక సీసపద్యముచే ననువదించి యున్నారు. కొందఱు విమర్శకులు చిన్న శ్లోకమునకుఁ బెద్దపద్యమును కర్చుపెట్టిరి యని పరిహసించుటయుఁ గలదు. అది ప్రాజ్ఞేతర విషయము. శ్లోకార్థము చక్కఁగా ననువదింపఁ బడెనా? లేదా? అన్నదే విచార్యముగాని "చిన్న" "పెద్ద" విచారముతోఁ బనిలేదు. పై శ్లోకమును వ్యాసమూర్తి శాస్త్రులవారు చిన్నచిన్న తెనుఁగుమాటలతో నాంధ్రీకరించి యున్నారు. వీరు చంపకమునందే కూడ నిమిడ్చియున్నారు చదువరుల కొఱకు వీరి యుభయపద్యములను నిట నుదాహరించి నాకుఁ దోఁచిన మాటలు వ్రాయుదును.

సీ॥ కటుఁదీక్ష్ణకరము లై యుడుకుఁజూపుచునుండు
చండభానునిదీప్తిమండలముల।
గాఁటవతాం కూటమి నాటి యెంతయు మండి
పడుచుండు రవిశిలాపటలివలన!
గలిగి యార్పఁగరాని బలుమంటలం బగ్గు
మనుచుండు పెనుకట్టుంబుడస్సి
తీతువుల్ నోళ్లెండి కూఁతలువీడఁగా
నిలుఁగల్గు నావిరియునకరాళి।

తే॥ గీ॥ మిళితమై కన్నులకు మిఱుమిట్లుఁ గొలిపి
గట్టు పుట్టల వివరంబు గానఁనీక
చూపుమాపు నిసీ ! కడు శూన్యములగు
దిక్కుమాలిన దిక్కులు దినమునడుమ.

(సత్యవోలు వారిది II-30)

చ॥ బలుమినుమానికంబు జిగిపర్వుట, 'ఒగ్గు' న మంచు ప్రొద్దురా
లెలుఁగుల గుంపు గ్రమ్మనటవీతటిఁ గొంతలు పీడఁ దీతువుల్
వెలుఁగులతేరి వెల్గులిల వేఁకిమి మీఁదనుదేల హిమ ప్రభా
నలు పవలింటి పద్మ విజనంపు దెసల్ గనుజంట యేర్చు సీ!॥

(అకొండివారిది II-30 పే 25)

ఇరువురును చక్కఁగానే అనువదించినారు. శాస్త్రులవారి రచనలో నిమిడికతో గూడిన జిగిబిగి యెక్కువగను, రావుగారి రచనలోఁ బ్రసాదగుణ మెక్కువగను బొడకట్టెడిని. అక్కడే కాదు. ఈయంశము సర్వత్ర గోచరించెడిని. శాస్త్రులవారు మన మొదర్చెడిది యాంధ్రీకరణముగదా ! యని (కాంబోలు) నెక్కుడుగా నచ్చ తెలుఁగు పదములు వాడియున్నారు. మచ్చున కొకపద్య ముదాహరించి యీ యంశమునుగూర్చి చర్చింతును—

కం॥ ఎనగానక వెలయు కకు
స్థుని కొలమున సంపుఁడావి సొంగొందు మురా
ర నొడువులు గాడి పగిదిం
దనరును వాల్మీకి వాక్సుధాకూపమునన్ ॥

(శాస్త్రులవారిది I-12. 4 పే)

ఇందు విస్తరించి తెలుఁగుపదములు వాడఁబడినను తత్సమపదభూయిష్ఠముగనున్న నాల్గవచరణమునం దున్నంతటి ప్రసాదగుణము తక్కిన

చరణములందున్నట్లు లేదు. దీనికే రావుగారి తెలుఁగుం గూడఁ జూపుదును—

కం॥ నిరుపమ కాకుత్స్థ యశ
స్సురభిళములు, ప్రథమసుకవి శుభవాగమృతా
కిరకూప నిపానమ్ములు
సురుచిరములహా! మురారి సొబగుం బలుకుల్॥

ఇందు సర్వత్ర తత్సమ సమాసములనే వాడినను అర్థసౌకర్యమెక్కుడుగ నుంటచే ప్రసాదగుణ మధికమని చెప్పనక్కఱలేదు. సంస్కృతమున మురారి పాకమెట్టిదో ఆంధ్రీకరణమున శాస్త్రులవారి పాకము నట్టిదిగనే యున్నను వారు గొప్ప విద్వాంసులగుటచేఁ గొన్ని విషయములలో రావుగారికన్నఁ బైచేయిగ నుందురనుటకు సందియము లేదు—శాస్త్రులవారు మఱల మురారి యంతటివారని మొదటనే వ్రాసితిని. ఇందుకు రావుగారును సమ్మతింతురు. నిజ మొప్పుకొనుటయే సహృదయ లక్షణముకదా! అట్టిది మచ్చునకొకటిమాత్రము చూపుదును—

సీ॥ మనువంశమున నీ మూనిసి మొలకలు
కైదువుకత చెప్పఁ గలరు యేని
యాకృతివిన్యాయ మయ్యెనే బ్రాహ్మణ
గణమందు నీకిట్టి గలద యేని
(వ్యాసమూర్తిశాస్త్రులుగారు)

సీ॥ మన జన్మలైన యీమానిసి నిసువులే
శస్త్రప్రశంస చేఁజాలి రేని
యీ బ్రహ్మవర్గ మాకృతిగణంబగు నేని
యడియ నీమదికిష్ట మగున యేని
(రావుగారిది)

ఆయా యర్థాంగీకరణము లేశ్లోకమునకో ఆ శ్లోకభాగముగూడ నుదాహరించి చర్చింతముగాక—

శ్లో॥ కుర్యుశ్శస్త్రకథా మమీా యది మనోర్వంశే మనుష్యాంకురాః
స్యాచ్ఛేద్బ్రహ్మగణోయ మాకృతి గణస్తత్రేష్యతే చేద్భవాన్॥

ఈవాక్యము పరశురామునిది. "మా బ్రహ్మతేజమునకుం గూడ నీవు జంకకున్నావు ?" అని శతానందుండు పల్కినమీాఁద నీవొక బ్రాహ్మణుఁడవేనా ? అని ప్రాతబంశముల నుద్ఘాటించుచు గంభీరముగా శతానందుని పరశురాముఁ డెత్తిపొడుచుచు నుపాలంభించు సందర్భములోనిది. ఇందు రెండవచరణమే మనకుఁ బ్రస్తుతము కావలసినది. కాన దానికి సంప్రదాయార్థము వ్రాయుదును. బ్రాహ్మణగణము ఆకృతిగణ మయ్యెనేని అనగా ఆకారమాత్రముచే (శిఖా యజ్ఞోపవీతాది బాహ్యవేషధారణముచే) సంప్రాప్తింపఁదగినదే అగునేని-తత్ర - ఆబ్రాహ్మణగణమందు - భవాన్ - నీవు ఇష్యతేచేత్ - భాష్యకారాదులచేఁ గొన్నికొన్నిశబ్దములకు గణప్రవేశమెట్లో అట్లే యెవరేని మహాశయులచే నీవు బ్రాహ్మణులలోఁ జేర్పఁబడితివేని అని తాత్పర్యము. ఇయ్యెడ వ్యాఖ్యాత "వ్యాకరణ ప్రసిద్ధః" అని కూడ వ్రాసియున్నాఁడు. కాని రావుగారు వ్యాసమూర్తిశాస్త్రుల వారివలె గురుశుశ్రూషాపూర్వకముగా వ్యాకరణము నభ్యసించి యందు నిరంతర వ్యాసంగము కలిగినవారు కాకపోవుటచే సంప్రదాయార్థము వారికి స్ఫురింపలేదు—అందుచేత—"అదియు నీమది క్లిష్టమయ్యెనేని" అని యర్థాంగీకరించి యున్నారు వ్యాసులవారో ! మురారికవియుంబోలె "గురుకుల క్లిష్టు" లగుటచే సంప్రదాయానుసారముగా "అందు నీకిష్టి గలదయేని" అని తెలిఁగించిరి—అందు

ఆబ్రాహ్మణ గణమందు నీకున్ (శతానందున కన్నమాట) ఇష్టి-సమ్మతి-కలదయేని-ఉన్న దేని-అని సరిపోయినది—రావుగారి తెలిఁగింపులోనో—"అదియు నీమది క్లిష్టమయ్యేనేని" అని యుండుటచే సంప్రదాయార్థము లోపించినది-మక్కికి మక్కి తెలుగు గాదుగదా! యిది యనుకొందమన్నను మార్పు కొంతవఱకేసి అవసరమే అని తోఁచినచో ఆరీతిని సరిపెట్టుకోవచ్చునుగాని యిది యట్టిదికాదు. కాన నిందెత్తికొని కొంత వ్రాయవలసి వచ్చినది. గాని రావుగారి నధఃకరించు తలఁపుతోఁగాదు. ఇంత మాత్రమునఁగలిగిన పెద్ద లోపమేమియు నుండదు. ఇది సవరణగాని స్థలముకాదు, అదియె నీమది క్లిష్ట మగునయేని" యనుచో "అందు నీకుఁ బ్రవేశమబ్బునేని" అన్నచో రావుగారి తెలిఁగింపునకును సంప్రదాయము సరిపడును.

ఈసంప్రదాయ విషయమింకను గొంత వ్రాసినఁగాని తేలదు. ఒకొక్క శాస్త్రమునకుఁ గొన్నికొన్ని సంకేతములుండును. ఆయా సంకేతములు ఆయా శాస్త్రములలోఁ బరిపూర్ణులు కానివారికిఁ గూడఁ దత్తద్గురు శుశ్రూషామాత్రముచే సాధ్యము గావచ్చును. ప్రస్తుత మేమిటనఁగా మురారిమహాకవి అనేకస్థలములలో వ్యాకరణ సంప్రదాయములను జొప్పించియున్నాఁడు. ఈమధ్య నొక విద్వ్యాకా భాసుఁడు బయలుదేరి శాస్త్ర సంప్రదాయములు నాటకములందు బొత్తిగా నుండరాదని వ్రాసి మాచే గాఢముగా ఖండలింపఁబడి యున్నాఁడు. దాని నటులుంతము. మురారి కెంతవఱకును వ్యాకరణ శాస్త్ర మర్యాదలను తన నాటకమునఁ జొప్పింపవలయునవియే కుతూహలము. ఇందులకు "స్థానివద్భావము" లోనగా నెన్నో యుదాహరణములు కలవు. విస్తరభీతిచే నుదాహరించలేము. ప్రస్తుత

ము గణపాఠ విషయమును పురస్కరించుకొని శతానందు నెత్తిపాడిది నాఁడు. గణములు రెండు విధములు. పఠితగణములనియు, ఆకృతిగణములనియు, అందు పఠితగణములు ఆగణమందు మొట్టమొదట నాచార్యులు పఠించిన శబ్దములకు మాత్రమే ఆయా కార్యమును సంపాదించునవిగా నుండును, ఆకృతిగణములో, సజాతీయముగా నుండు మఱికొన్ని శబ్దములకుఁ గూడ ఆగణకార్యమును సంపాదింపఁగలవుగాని అక్కడ నొక విశేషమున్నది అందు లేనిశబ్దములకు ఆయా కార్యసంపాదనము విషయమునఁ గ్వాచిత్కముగా భాష్యకారాది మహామహుల యిష్టికూడ (ఇష్టము లేక అంగీకారము) ఉండవలసి యుండును. ప్రస్తుతము బ్రాహ్మణులనఁగా గణోక్తి ఇయత్త కలిగియున్న సముదాయమా? లేక ఆకృతిగణమా? అనఁగాఁ దాదృశమైన వేషభాషలచే నొప్పువారుకూడ వారిలోఁ జేరుట కవకాశ మేమేని యున్నదా? ఉన్నచో నీకాగణముం దేమహామహుల యంగీకారమేని యుండి యుండెనా? అనుచున్నాఁడు. పరశురాముఁడు. ఇట్లేల యనవలసి వచ్చెనందురా? శతానందుఁడు గౌతముని కొడుకు, గౌతముని భార్య కళంకితురాలగుటచే శతానందుఁడు పరిశుద్ధ బ్రాహ్మణుఁడు కాఁజాలఁడను కారణమును గంభీరముగా నుద్ఘాటించుచున్నాఁడన్నమాట.

కవులకు రసారసములు శాస్త్రాభ్యాసమువలనఁ గలుగవు. కాని యిట్టి సంప్రదాయములు శాస్త్రాభ్యాసమువలనఁ గాని అవగతములు కావు. ఇవి యవగతములుకాని యంత్రమాత్రమున స్వతంత్రరచనకు లేశమును జిక్కులేదు. ఇట్టిపట్టు లాంధ్రీకరించుపట్టునఁ గొంత కొఱతయున్నట్లు తోఁచుచుండును. ఈలోటు వ్యాఖ్యానము తీర్చవచ్చును గాని ఆవ్యాఖ్యానము గూడ గురుశుశ్రూషాలబ్ధముగు

ననుభవము గలవారికిఁ జేసినంతసాయమును దదన్యులకుఁ జేయఁజాలదు. నాయనుభవము నొకదాని నిక్కడ నుదాహరించుచున్నాను.

శ్లో॥ యదాచర్మ వదాకాశం। వేష్టయిష్యంతి మానవాః
తదా శివ మవిజ్ఞాయ। దుఃఖస్యాంతో భవిష్యతి॥

ఈశ్లోకము దేవీభాగవతములోనిది. శ్వేతాశ్వతరోపనిషత్తునుండి కైకొనఁబడినది. దీనియర్థము సుగమముగానే యుండినను ముప్పదినలుబది యేండ్లనుండి తాత్పర్యము నాకు గోచరించినదికాదు. వ్యాఖ్యానముకూడఁ జూచినాను. తాత్పర్యము తెలిసినదేకాదు. ఆంధ్రీకరణములో గోడమీఁది పిల్లివాటముగా సరిపెట్టఁబడినది. తుదకు నిన్నమొన్న కాఁబోలును సంప్రదాయజ్ఞులవలనఁ దెలిసికొంటిని. ఇట్టివెన్నో కవికవసరమని తెల్పుటకే యెందఱినో ఆశ్రయించి యెన్నో తెలిసికోవలసి యున్నట్లును అందుఁ గొన్నిమాత్రమే తెలిసికొని యున్నట్లును ఒకచో వ్యక్తీకరించి యుంటిమి—

ఉ॥ ఒక్కొకచోట నొక్కొకనియొద్ద నొకొక్కొకమాట చొప్పునన్
జక్కఁగ సంగ్రహించితిమి చాతురిమీఱఁగఁ జెప్పప్రజ్ఞ... ..

అని శ్రీ విజయనగరపు మహారాజావారిని గూర్చిన పద్యములలో వ్రాసికొని యుంటిమి. కాని తెలుసుకొన్న సంప్రదాయములెన్నో లేవనియును తెలిసికోఁదగినవే చాల నున్నవనియు నేఁడు గడచిన కొలఁది తోఁచుచున్నది. తదభ్యాసమునకు జన్మాంతరమపేక్షణీయము.

ప్రస్తుతము రావుగారి తెలిఁగింపునందు—“తత్రేష్య తేత్ భవాన్” అన్నచోట వ్యత్యాసము కలదనియు శాస్త్రులవారి తెలిఁగింపులో నయ్యది లేదనియుఁ దెలిసినది. కవికి సర్వశాస్త్రముల యందును ప్రవేశము కలిగియుండవలయునని లక్షణశాసకులు—

"అహో భారో గురుః కవేః !"

అను కారికామూలమున నుద్ఘోషించుచున్నారు. దానిని కాదనఁజాల మంగాని అట్టి కవులు చాల నరుదుగా నుందురనునది పూర్వకాలమం దలిమాట; నేఁడో చెప్పనే యక్కఱలేదు. నా యభిప్రాయమును నేఁటివారెంతవఱకామోదింతురో? కాని వ్రాయవలసి వ్రాయుచున్నాను. సర్వజ్ఞులయిన కవులుండిన నుందురుగాక. ఎట్లైనను—

"సర్వజ్ఞత్వము సాంబమూర్తిది, మనుష్యప్రజ్ఞ యల్పంబె,"

కదా! భవతు. అట్టివారి కవిత్వమేయైనను నీరసమైనచో నయ్యది సంప్రదాయబద్ధమే యైనను లోకాదరమునకు మిగుల దూరమగు నదియు, పూర్వపుణ్యవశమునఁ గేవల కవితమాత్రమే యలవడిన వారి కవిత్వమేయయ్యు నయ్యది రసవత్తరమైనదగుచో శాస్త్రజ్ఞుల కవిత్వముకన్నను లోకాదరపాత్రమై చిరకాలస్థాయి యగునదియు నేననుకొందును.

"లోకులరసనలె యాకులుగా నుండునట్టి యదియో కవితల్ !"

గదా! ఇందులకుఁ బ్రథమోదాహరణము పోతరాజుగారి భాగవతము. నేఁటి కవులలో శ్రీదాసు శ్రీరాములుగారి కవనము. ఆదిపూడి ప్రభాకరరావుగారి కవనము. చిలకమర్తివారి కవనము. ప్రస్తుత గ్రంథకర్తగారి కవనము లోనైనవి.

ఇఁక మురారినాటకపుఁ దెలిగింపు "మక్కికి, మక్కి" తెలుఁగు కాదన్నందుల కొక యుదాహరణము చూపుచున్నాను.

శ్లో॥ ప్రజ్ఞాత బ్రహ్మతత్త్వోపి స్వర్గమైరేవ ఖేలతి
గృహస్థ సమయాచార ప్రక్రాంతైస్సప్త తంతుభిః ॥

ఆ॥ వె॥ బ్రహ్మవేత్తయయ్యు స్వర్గకాముకులై గృ
హస్థవిధులనందు నందటుట్టు
లితఁడు నశ్వరములనిటు పూని విహరించు
నింతెకాని స్వర్గమితనికేల ! ॥ (II-35)

ఈయాంధ్రీకరణము మిక్కిలి చక్కఁగా నున్నది. స్థూలదృష్టిని శంకిం చువారికి చతుర్థచరణము పద్యపూరణమునకై యుపయోగింపఁబడిన దని తోఁచవచ్చును. కాని ఆంధ్రీకరణమనఁగా భావమునకుఁగాని శ్లోకనిష్ఠపదముల కెన్నఁడునుగాదు. భావమునేవట్టుచో స్వర్గమునకుఁ బ్రతిస్వర్గమును సృష్టించు విశ్వామిత్రునకు స్వర్గముతోఁ బనియుం డునని కొనువా రుందురా ? ఇదియునుగాక బ్రహ్మతత్త్వవేత్త యె న్నఁడేని స్వర్గము నపేక్షించునా ? " క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి " కదా !

ఈయన కొన్ని శ్లోకముల నాంధ్రీకరించుపట్టున మూఁడు నాలుగు వఱకును పాఠాంతరములను జూపియున్నారు. అందలి విశే షములను చదువరులను గమనింపఁగోరుదును.

ఇప్పటికి మనకుఁ దెలిసినంతలో నీ యనర్ఘరాఘవ నాటకము నాంధ్రీకరించిన కవులిర్వురు మాత్రమే. ఈయిర్వురిలోఁ బ్రథములు వ్యాసమూర్తి శాస్త్రులవారు. రెండవవారు వీరు. వెనుక నప్పయ్య దీక్షితులవారు కాఁబోలును—

" పిళ్లః కవి రహం విద్వాన్ "

అని వేదాంతదేశికులవారిం గూర్చియన్నట్లు వింటిమి. ప్రస్తుత మీ యుభయులపట్లను ఆశ్లోకార్థము నుపయోగింపఁ దగునని నేననుకొం దును. శాస్త్రులవారి రచనలో నెక్కుడుగ నాంధ్రపదము లున్నను ప్రసాదగుణము రావుగారి రచనయందే యున్నట్లు నే నభిప్రాయ

పడితిని. అదియే ముఖ్యముగ కావలసినది. అది లేనిచో మొల్ల చెప్పినట్లు—

"మూఁగ చెవిటివారి ముచ్చట." కావలసివచ్చును గదా! వీరిరువురియొక్క శైలిలోని భేదమును పాఠకులు గమనించుటకుఁ గొన్ని పద్యము లుదాహరించుచున్నాను.

1. శ్లో॥ I-18.

ఉ॥ మమ్ము నరుంధతీపతియు మన్చెఁ దనంతన యింతమట్టు; నేఁ
డిమ్మహిరుండు మాకుల మహిష్టుఁడు సర్వసురాదిముండు; జ
న్నమ్ములు నేఁడొనర్చితిమి; నాఁడెపురాజు గలట్టిదయ్యె నేఁ
డిమ్మహి; తన్ను మెచ్చుకొను నింద్రుఁడు మేము సహాయులౌటచేన్

(వ్యాసమూర్తిశాస్త్రులుగారు)

చ॥ ఇపుడుగదా, మదన్వయమహిష్టుఁడు సూర్యుఁడు దేవముఖ్యుఁడౌ
టిపుడుగదా, ముదంబుగొనుటింద్రుఁడు మాచెలిమిందలంచి; మే
మిపుడుగదా, సమున్నతి వహించి రహించుట యజ్వలందు; దా
నిపుడుగదా, యుదారవిభవి యిలకుంట, గురుండిటుంటచేన్॥

(సత్యవోలు వారిది)

2. శ్లో॥ I-21.

గీ॥ ఎతని యానతిమీఱుట కతమునం ద్రి
శంకు భూపాలునకు గాధిసంభవుండు
పట్టి పల్లార్చినను ననుభవపదంబు
గాకపోయెను దేవలోకంబు భువియు॥

(వ్యాసమూర్తిగారిది)

కం॥ ఆకౌశికమునిఘనకృప
కాకరమైనను త్రిశంకునకుభవమునకా
నాకము, నీలోకమునుం
గాకుండుట యితనియానఁ గడచుట నెగదా! ॥

(23 పే. కామేశ్వరరావుగారిది)

3. శ్లో॥ I-58.

శా॥ ఈరైదంగములొప్ప బుక్కులతలం; తీవగ్నులానున్మదం
బారన్నికుహవిస్ను యజ్వలిడ స్వాహాకార పూర్వంబుగా
క్షీరాంభోనిధినుండి భూమికిడిగన్ జేసెన్సురశ్రేణిని;
న్వీరా! చంపుదు రావణప్రముఖ దుర్వృత్తాళి నీవిపయిన్॥

(శాస్త్రిలవారిది)

సీ॥ నీవేకదా! వేద్కనెగడనీరైదంగ
ములనొప్పచుండు రుక్కులదలాతు
నీకై కదా! యజ్వలోకంబు మోదంబు
దగవేల్చు హావ్యముల్ చాల్చునగ్ని
నిన్నేకదా! పాలమున్నీటిలోనుండి
యిలకుడిగ్గగఁజేసి రెల్లసురలు
నీచేఁగదా! యింక నిగ్రహింపంబడఁ
గలరు రావణముఖ్య ఖలసురాలు

తే॥ గీ॥ లకట! నిను మానవునిగాఁగ ననుదినమ్ము
దలఁచుచుందు తెలుంగక ధరణి నరులు
మహితగుణముల ప్రోవ! సేమములతావ!
మానసీయప్రభావ! మహానుభావ! ॥

(రావుగారిది)

4. శ్లో॥ III-15.

సీ॥ కాయికమానస కలుషంబు లడఁగించు
సావిత్రాఘముల సమస్య యిదియొక్క
బుక్కులకు సమార్థమెటేఁగించుకృతియొ యు
జుస్సుల మొదలెదో సామ్ముసీగు
దీవన బహుకార్య దృష్టఫలంబు నా
కన్నెకు వసుఁ బురోగతునిఁబోలెఁ
దెలుపుచున్నది—*

విశ్వా—(సాభిప్రాయముగ నించుకనగుచు) మిత్ర! హాలకేతన!
యిదిల్లె కలదె యనతి చిరకాలభగ్న

(వ్యాస...)

---

* యిక్కడ శ్లోకమునకు సరిపోయినది. తరువాయి శ్లోకము యొక్క
అనువాదమునకు మిగిలినభాగము దీసికొనఁబడినది.

ఉ॥ సామపు సీమయో, యకలుషంబగు బుక్కులనిక్క మో యజు
స్తోమము ధామమో, యనఁగ శోభిలుచున్నిజమై, ఫలంబుల
న్వేమును బెక్కుచోట్లనిడు నీ ఘనవాక్యము నాకు మూర్తి కి
ష్టోముని చంద్ర మా యెదుటనుంచినవానిగఁ దెల్పెడున్ వధూ॥

(143 పే. కామేశ్వరరావుగారిది)

5, శ్లో॥ III-21.

కం॥ ఈ యీ, డీయతిసుందర
కాయము, వీరాద్భుతములు కార్యములివి, నీ
యీయర్చకులను గనుఁ గోఁ
జేయున్నామది యభీష్టసిద్ధి నటనమున్ ।

(వ్యాస...)

చ॥ వయసన నిద్ది యెంతొ యభివాంఛిత, మాకృతియన్న నిద్ది యెం
తయును మనోహరంబు, చరితంబన నిద్ది యపారవీరవి
స్మయరసపూరితం, బన నమంద ముదంబున నిక్కుమారక
ద్వయమునుఁ జూచి యాడు, మది తద్దయు సార్థకమైనయట్లులోన్
(149 పేజీ. కామేశ్వర...)

6 శ్లో॥ IV-62.

తే॥ గీ॥ పూర్వ మొప్పినవే వరమ్ము లవి రెండు,
వేడుకొనెదను భరతుఁడు పృథ్వినీది
యేలు రాముఁడు పదునాలుగేండ్లు దండ
కనువసించుతఁ దమ్ముతోఁ గాంతతోడ ॥
(వ్యాస...)

చ॥ " వరయుగమిచ్చి యుంటిరి కృపామతితో నలనాడు మీరు; త
ద్వరముల నిష్ట కోరుదును; దాన నయోధ్యకు రాజుగావలె
న్భరతుడు; రాఘవుండు పదునాలుగు వత్సరముల్ స్థిరంబుగా
ధరణిజతోడ లక్ష్మణయుతంబుగ దండక నుండ గావలెన్ ! ॥ "
(243 పేజీ. కామేశ్వర...)

ఇంకొకటి రావుగారు గమనింపవలసి యున్నది. ముద్రణము లో చాల వ్యత్యాసములు పడినవి. వీని నుపేక్షించినచో మునుపెట్లు లయినను నేఁడు మిక్కిలి చిక్కు. నేటి విమర్శకులు వీనిం బురస్కరించుకొని పెనఁగులాడుదురు. వారేమి చేయుదురు ? వారి జ్ఞానము తావన్మాత్రమందే పర్యాప్తము. ఇది నాకనుభూతమైన విషయము. మేమొకచో " మూఁగురు " అని, దానిని " నల్వురు " అనునట్లు సవరించుకోఁదగునని సవరణ నుపపాదించియుంటిని. అట్లు తెల్పినను మరల నెదురుతిరిగి కొన్నిచోట్లఁ గురురదని శంకించెను. నాయనా !

నీవేది కుదురదంటివో దానినికూడఁ గుదిర్చి ముద్రించిన ప్రతిగలదు. చూచుకొమ్మంటిమి. చూచుకొని మరల నీక నొకపద్యములో దిద్దలేదేమి ? అని యడుగ మొదలిడెను. అయినా విమర్శకబుధుఁడు, ప్రస్తుతము కాకపుర నివాసియే. కావునఁ గొంచెము విస్తరించి శుద్ధపత్రిక గూడ ముద్రింపక తప్పదు ! లేదా యితనిబాధ తప్పదు ! పైఁగా నితఁడనాలోచనగా నందందుఁ బొరఁబడి " క్రిందఁబడ్డను మీఁదివాఁడనే " అని పరాక్రమింపఁ జొచ్చును. కావున జాగ్రత్తయని రావుగారిని హెచ్చరించుచున్నాఁడను.

శ్లో॥ యథాస్త్రీణాం తథావాచాం సాధుత్వే దుర్జనోజనః ॥

అనికదా భవభూతి మహాకవి పలికియున్నాఁడు. మఱియు వార్ధక్యమువలనఁగాఁబోలును రావుగారిట్లు వ్రాయుచున్నారు.

" అచ్చుతప్పులను గూర్చి పడుశ్రమ ఆర్ద్రీకరణముకన్నను నెక్కుడుగాఁ గన్పట్టుచున్నది. మఱికొంత శ్రద్ధ చేయుదును "

వృద్ధులకే కాదు. ఈవిషయము యువకులకును దురవగాహమే. అందులో స్వకీయగ్రంథము ముద్రింపించుపట్టునఁ గొన్ని సందర్భములకు సొంతముగా ప్రూఫు చూచుకొనుట యుపకరించును గాని అక్షరలోపములకు లేశము నుపకరింపదు సరికదా ! పైఁగా నపకరించును. అందులో నక్షరములున్నను లేకపోయినను గవనము సొంతమే యగుటచే నున్న యక్షరములతోడనే లేనివికూడ నున్నటులే పద్యమో వచనమో చక్కఁగా నడచును. అందువలన లోపించిన భాగములన్నియుఁ గన్పట్టవలసి వచ్చును. అచ్చులోపములన్నవి శతవిధాల నిట్టివిమాత్రమే. కొన్ని యితరులు ప్రూఫు దిద్దుపట్టున వారివారి యూహను బురస్కరించుకొని చేసినవిగూడ నుం

డును. ఏమైనను గొందఱు "రాముఁడు" అనుటకు "కృష్ణుఁడు" అను పదము ప్రయోగించి దానినిగూడ ముద్రాప్రమాదము క్రిందికి లాగఁజూతురు. అట్టివారొకరు ప్రస్తుతము నన్ను రంగానవతరింపఁజేసి పెనఁగులాడుచున్నారు. కావున నేనింతగా రావుగారిని ప్రస్తుతవిషయమునఁ బనిగట్టికొని హెచ్చరింపవలసి వచ్చినది.

మఱికొన్ని విషయములకుఁ గూడ గ్రంథకర్తగారి యుత్తరమునుండియే కొన్నిమాట లుదాహరింతును—

"రేఫవిషయములో నేనంతగాఁ బాటించనిమాట వాస్తవమే. ఇప్పుడయినను యికత్రత్ర సవరింతును గాని ప్రాసయాదు మూఁడు మతాంతరానుసారముగా నట్లే యుండనిందు"

ఇక్కడఁ గొంచెము వ్రాయుదును. భారతకవు లేమి పాటించిరోకాని రేఫశకట రేఫమైత్రి నిషేధమును గూర్చి తదితరులు లేశమును బాటింపనేలేదని యెల్లరు నెఱిఁగినదే. అప్పకవి బోలెడు దీక్ష కష్టించినాఁడు కాని తుదకుఁ దన కవనమునందే తన్మైత్రి నంగీకరించినాఁడు. అంతమాత్రమున నతని కష్టము వలనుపడదు. ఏమందురా, నేనును పొరఁబడి యట్లు వాడితినని యతఁడు జవాబు చెప్పవలసినదెవలెను గదా? మామట్టుకొక నన్నయ్యగారు తప్ప తక్కిన భారతకవులు గూడ రేఫశకటరేఫమైత్రిని పూర్తిగా నంగీకరించిరనియు, అప్పకవి వారివారి ప్రయోగములలో బాధించుచోట్ల నుభయ రేఫల పట్టికలోఁ జేర్చియుండుననియే తోఁచినది. కావున నే—

ఉ॥ ఱాకును రేఫకుం జెలిమిరాదని పెద్దవివాద పెంచెఁ దా
నేకళనుండి వ్రాసెనో ? కవీంద్రుఁడు నన్నయ కల్పమాని నా
రే ? కవులొక్కరే నుభయరేఫలె యవ్వి నణల్ లడల్ శసల్
కాకయభేద మీయొకటికా ? తగకుండుట ! మేలుమేల్ ఇళీ ॥"

అని పాణిగృహీంత పీఠికలో వ్రాసికొనియుంటిమి. ఏమైనను అమలులో లేని కొన్ని గవర్నమెంటు శాసనములవలెనే శాస్త్రప్రవర్తకుల కొన్ని యను శాసనములును పాటింపరానివని నే నభిప్రాయపడుదును ఆట్టివానిలో నాంధ్రమున రేఫశకట రేఫమైత్రిని గూర్చిన నిషేధమొకటి, సంస్కృతమున ఉభయపదులగు ధాతువుల ప్రయోగవిషయమున నాత్మగామిత్వ పరగామిత్వములను గణింపకుండుట యొకటియని నే ననుకొనుచుందును. ఆ యీ సందర్భములను బట్టి యేమి మఱికొన్ని విషయములయందలి యనుభూతింబట్టి యేమి లక్షణము నిమిత్తమాత్రమనియు సర్వత్ర లక్ష్యమునకే యెక్కుడు ప్రాధాన్యమనియు నేను స్థిరపఱచుకొని వాదించుచున్నాను. భాష్యకారాదుల పోకడలుకూడ దీనికే బలము కలిగించునని నాయాశయము. కాని యవి యింపెత్తి చూపకపోవుటకుఁ గారణ మిక్కడ నది ప్రస్తుతము కాదనియే.

ఇంకొక విషయమునకుఁగూడ రావుగారి యుత్తరమే యుదాహరింతును. 'ఒక్కేతఱి' యుండరానిదేయైనచో—"అబ్బంబుగ" అని సవరింపనగును.

ఇయ్యెడ నాశంక యేమందురేని వినుఁడు. ఒక + తఱి. అనుచో సమాసము చేసితిమేని 'ఒకతఱి' అని కావలయు. వ్యస్తపదములైనచో 'ఒకటే తఱి' అని యుండును. విభక్తికి లోపమే యుండదు. కావున నిది సమాసమే, అగుచో మధ్య ఏవకారార్థకమగు 'ఏ' కారమునకుఁ బ్రవేశమెట్లు? అని. వ్యస్తమగుచో "ఒకటే తఱి" అని యుండుట సహృదయ సమ్మతము. ఒకేతఱి లోనైనవి తఱచు అఱవవారి తెలుగునందుపలబ్ధమగుటయు నెఱుఁగుదును.

దీనిని బట్టియే మా బాలరామాయణ నాటకమున నొకచోట 'ఒకే' ప్రయోగము పడినది. అది నాకిష్టములేక నిన్న మొన్న వచ్చియున షష్టిపూర్తి ముద్రణమున సవరింపఁబడినది. ఈకారణముచే నేను శంకించితిని. మఱి యెక్కడేని మాకవనమున "నొకే" పదమున్నను అది ప్రమాద ప్రయుక్తమేగాని మాకు సమ్మతము కాదని చదువరులు గమనింతురు గాక! నిన్న మొన్న మా గురువులలో నొకరు నన్నుగూర్చి వ్రాయు వ్యాసములలో 'ఒకే' వ్రాసియున్నారు. వారి తాత్పర్యమేమో!

రావుగారి యాంధ్రీకరణము మిక్కిలి చక్కగా నున్నదని వ్రాయుటకు నాకు సాహసము చాలదుగాని యింతకన్న నెక్కుడుగ వేఱొకరేని యీమురారి పాకమును తేలికపఱతురని మాత్రము నాకు నమ్మికలేదని చెప్పఁగలను. ఈమురారికవిత్వము నాంధ్రీకరించు విషయమున నిప్పటికి సుమారు ముప్పది సంవత్సరములనాఁడు పల్లెపాలెం గ్రామములో నాగురుపరంపరలో నొకరును బంధుగులును నాయెడల మిక్కిలి యభిమానులును నగు శ్రీ మధునాపంతుల సూరయ్యతాతగారు—"తాతా! మన వ్యాసమూర్తిశాస్త్రులవారు మురారి నాటక మాంధ్రీకరించినారు గదా! దానింగూర్చి నీ యభిప్రాయమేమ" ని ప్రస్తావించిరి. ఆవిషయము నిర్ణయించి యిదమిత్థమని వక్కాణించుటకు నేనెంతవాఁడనని కొంతసేపు లోకముతోఁ బాటు వినయోక్తుల నుపయోగించితిని. కాని వారు గట్టిగాఁ బట్టుపట్టిరి. అప్పుడు నేనున్నస్థితి "అహమేవ" అను నవస్థ నింకను పూర్తిగా నతిక్రమించనిది కావున తదనుసారముగనే జవాబు చెప్పితిని, దానిమీఁద వారు—

"శ్లో॥ ఏకైకే కేనివసంతి తే భుజభృతః" అను సప్తమాంకములోని శ్లోకము నిచ్చి పరీక్షగా నన్నాంధ్రీకరింపుమనిరి. వారి యాజ్ఞ నుల్లంఘింపఁజాలక వెంటనే నే నిట్లాంధ్రీకరించితిని. వారు మిక్కిలి సంతసించిరి. దాని నిక్కడఁ జూపుచున్నాఁడను.

చ॥ ఒకరొకరుంద్రు వీరవరు లొక్కరికొక్కరు తీసిపోరు, భూ
మికి యశమబ్బె రావణుని మెచ్చునసంచనుకొందు మేని వా
లికి నతఁడింతజంకె లవలేశము లొక్కటడించి కన్నులుం
టకుఁగని వీనులుంటకు వినందగు నల్పులమేమి చెప్పఁగన్ ॥

ఆపద్యములోనున్న యేపదమునకు లేక యేవాక్యమునకు ఆంధ్రీకరణములో నేది వాడఁబడినదో యేది సొంతముగాఁ జేర్చఁబడినదో, యేది వదలఁబడినదో యిచ్చోట విడఁదీసి చూపి వ్యాఖ్యానము చేయవలసియున్నను గ్రంథవిస్తరభీతిచే నది యుపేక్షింపఁ బడినది. అదిగాక ఉభయభాషావిదులగువారికిఁ గాని ఆవ్రాత యుపకరింపదు. ఆశ్లోకమునకు శ్రీ వ్యాసమూర్తిశాస్త్రులవారి యాంధ్రీకరణమునుగూడఁ జూపుట అంతయప్రస్తుతము గాదని దానింగూడఁ జూపుచున్నాను.

ఆ॥ వె॥ ఉందు రొకరికంటె నొక్కరు భుజశాలు
లెవని సమరభీరు నెన్నవచ్చుఁ
గాని లంకఁ జేనిఁబూనెడు నీవసుం
ధరయొ ? వీరభూమి పరిగణింప ॥ ౧

తే॥ గీ॥ వాలియో ? పిల్చువీనినిఁబట్టి యేమి
సేసెనో ? యది దృక్కులసృష్టిగనుఁగొ
నుచును వీనులకలిమి వినుచును మనెద
మనదలము వాకొనఁగనది మనతలంబె ॥ ౨

ఇక్కడ మఱికొంత వ్రాయవలయును. వీరు రెండు పద్యములలో నెందు కాంధ్రీకరింపవలసి వచ్చినదనిన, అంతకు మున్నొక శార్దూల శ్లోకమును సీసములో నాంధ్రీకరింపఁ దొరఁకొనిరి. అందున్న సరుకు సీసము నాలుగు చరణములకు మాత్రమే సరిపడినది. కావున నందు మిగిలిన ఆటవెలఁదిలో ప్రస్తుతశ్లోక మాఁధ్రీకరింప మొదలిడిరి. ఆట వెలఁదిలో శార్దూలమునందలి సరుకెప్పుడో గాని యిముడదుగదా ? అందుచేఁ దరువాయికై వేఱొకగీతి నవలంబించవలసి వచ్చినది. ఆ యీ చిక్కులు రెండుపాత్రములును నెదుటఁ బెట్టుకొని విమర్శించు వారికిఁ గాని బోధపడవు. ఏమైననేమి నేను వ్యాసమూర్తిశాస్త్రుల వారి యాంధ్రీకరణము నభినందించలేదన్నది ముఖ్యాంశము. ఏదో యొక శ్లోకానికి మాత్రము వారికన్న మిన్నగాఁ దెలిఁగించుట చూపి నంతలో ప్రస్తుతవిషయము తేలదుగాని అప్పటి వాదోపవాదాలలో

కం॥ తెనిగించిరి దేవరవా
రనర్ఘరాఘవము దానినారసియే వా
రనిరిశబాసని దీనిం
గనియనుటకు నెందుకింత కష్టము దేవా ? ॥

అని వారి ప్రబోధచంద్రోదయములోని దేనినో విమర్శించుచుఁ గూడ నన్నట్లు జ్ఞాపకము. ఇంతేకాదు—

మ॥ " తమపాకంబు స్వహస్తపాకగతి శుద్ధంబైనఁగానిండు సా
జము గామిన్ శ్రవణంబులందను వ, దచ్ఛమ్మైన యల్లంతనే
రమణీయంబగునే ? కవిత్వము రసారామంబు గాకున్న, మీ
శ్రమకున్ లేదుఫలంబు; మీ తెలుఁగు గీర్వాణమ్ము లంఘించెడిన్ !"

అని కూడ నన్నట్లు జ్ఞాపకము. అందువలన వారి బంధువులకును నభిమానులకును మిక్కిలి యాగ్రహపాత్రుఁడనైతిని—

ఎందఱెన్నివిధాల బంధుత్వాదికారణములనుఁ బురస్కరించుకొని యభిమానించినను, అసలు పసలేనియెడల నట్టి కవిత పయికి రాదు. కవనమునకు నితరసౌందర్యమునకన్న రససౌందర్య మెక్కుడు ముఖ్యము. అందుచేతనే—"సాధ్వ్యోహిరసో యథా తథం కవిభిః" అన్నారు వాగనుశాసనులు. రసస్ఫురణకుఁ బ్రసాదగుణ మెక్కుడుగాఁ దోడ్పడును. వీలైనంతవఱకు రావుగారు తమ యాంధ్రీకరణమునందు రసస్ఫూర్తికై పాటుపడిరి. ఎంతవఱకు కృతార్థులైనారో నిర్ణయింపఁదగువారు సహృదయులు కావున నాభారము వారికే వదలుచున్నాను. నేనుమాత్రము చాలవఱకు రసస్ఫూర్తిని గలిగింపఁజాలిరనియే యభిప్రాయపడుచున్నాను.

రావుగారు మాతృకనుగూడఁజేర్చి ముద్రించుటచేఁ జదువరులకెక్కుడు వీలుచేసినట్లయినది. ఇక్కడికే కొంత విస్తరించినట్లగుటచే నిఁక ముగించుచున్నాను. రావు గారిపుడు ప్రచురించు చున్నది నాలుగంకములవఱకే. తక్కిన మూఁడంకములును గూడ నచిరకాలముననే యాంధ్రీకరించి ప్రచురించి పాఠకలోకము మెప్పును బడయుదురుగాక యనియు నట్టియోపికను వార్ధక్యములోనున్న రావుగారికి భగవంతుఁడిచ్చి యారోగ్యమును గాపాడుఁగాక యనియు నాశీర్వదించుచున్నాఁడను. ఈగ్రంథమును విని సంతోషమును వెలువరించుటయేకాక దీనిని వెంటనే ముద్రాపితము గావించి తమభాషాభిమానమును సహజౌదార్యమును బ్రకటించిన ఏతత్కృతి పతులు

శ్రీ శ్రీ బొబ్బిలి రావుకులీనులు, కిర్లంపూడి వగయిరా యెస్టేట్టు జమీందారులు, శ్రీ శ్రీ రావు శ్రీరామకృష్ణ రంగారావు బహద్దరు వారు మిక్కిలిగా నభినందనీయులు. వీరికి నాటక ప్రతిపాద్యమానుఁడగు శ్రీమహావిష్ణువు సర్వశ్రేయములను కలిగించి కవివరశ్లాఘ్యమగు కీర్తినొసఁగి రక్షించుఁగాక యని కూడ నాశీర్వదించుచు ముగించుచున్నాఁడను.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి,

శతవధాని.



# మురారిమహాకవి.



## 1 అవతారిక.

"నాటకాన్తం హి సాహిత్యమ్"—అని లోకోక్తి. సారస్వతమున దృష్టవ్యుత్పత్తి యుపకవ్యాసంగమువలనఁ గలుగునని దీనిభావము. అంతియే కాక కవియొక్క కావ్యనిర్మాణనైపుణికి నాటకరచనము నికషోపల మనఁదగును. వైదికవాఙ్మయముకంటె విలక్షణమగు లౌకికసంస్కృత సాహిత్యమునఁ బ్రౌఢపాండిత్యము వలయునని మహాకావ్యములలో హర్షనైషధమును, గద్యకావ్యములలోఁ గాదంబరిని, దృశ్యకావ్యములలో "అనర్ఘరాఘవము" ను గూలంకషముగా వ్యాసంగముచేయవలయును. ఆంధ్ర "మిల్టన్" (అను నాంగ్లకవిశేఖరుని) కృతులయందలి సారస్యము నాస్వాదింపఁగలుగుట పాండితీపాటవసూచకమన్నట్లు, * మురారినాటకమును సమన్వయింపఁజాలుట ప్రౌఢవైదుష్యమునకు గీటురాయి యనంబడెడిది. బహుశాస్త్రసాహిత్యాదియపరిచయమగు నీనాటకము నన్యభాషలలోనికిఁ జక్కఁగాఁ బరివర్తించుట గూడ ననువాదకుని కవితాపాటవమును జాటును. భారతీయ సాంస్కృతపండితులు మురారికృతిని దలఁదాల్చెదరు. వీరికంటె నభిరుచులలో విలక్షణులగు పాశ్చాత్యసంస్కృతవిద్వాంసులు కాళి, మాఘ, శ్రీహర్షుల కృతులవలెనే మురారికృతిని గూడ సామాన్యముగా నెంచెదరు.

* 'An appreciation of Milton is the final criterion of consummate scholarship.'

## 2 జన్మాదికము.

భట్టమురారి మౌద్గల్యగోత్రుఁడు. మహాకవి భట్టశ్రీవర్ధమానుఁ డీతనితండ్రి; తల్లి తంతుమతి. ఈసంగతు లనర్ఘరాఘవప్రస్తావనలో నిట్లు చెప్పఁబడియున్నవి.

"అస్తి మౌద్గల్యగోత్రసంభవస్య మహాకవేర్భట్ట శ్రీవర్ధమానతనూజన్మన స్తన్తుమతీనందనస్య మురారేః కృతి రభినవ మనర్ఘరాఘవం నామ నాటకమ్." [15 పు]

"అస్య హి మౌద్గల్యానాం (మౌద్గల్యాయనానామ్-ఇతిపాఠః) బ్రహ్మర్షీణా మన్వయమూర్ధన్యస్య మురారి నామధేయస్య బాలవాల్మీకే ర్వాఙ్మయ మమృతబిన్దు నిష్యన్ది కన్దలయతి కౌతుకం మే." [19 పు.]

ఈప్రమాణములవలన ముద్గలగోత్రము బ్రహ్మర్షు లనేకు లవతరించిన పవిత్రవంశమని తెలియుచున్నది. మురారి పండితవంశాంకురము. ఈతని తండ్రి రచించిన కృతులేవియో తెలియుటలేదు.*

ఈనడుమఁ బ్రకటింపఁబడిన యొకానొక వ్యాసములో † మురారి బ్రాహ్మణేతరుఁడని వ్రాయఁబడియున్నది. ఇందులకు వ్యాసకర్త చూపిన యుపపత్తులు:— IV అం. 43 శ్లో. క్రిందను.

[ఈప్రతిలో-220 పుట। 'నేపథ్యే ఆః పాప క్షత్రియమాయాః పుత్ర! క్షత్రియభ్రూణహత్యాపాతకిన్!' అని పరశురాముని శతానందుఁడు తిట్టెను.

---

* జల్హణుని 'సూక్తిముక్తావళి' లో — 'సముద్ధృతాస్తేన నకస్యదోషాః'- అను శ్లోకమును, శ్రీధరదాసుని 'సదుక్తికర్ణామృతము' న [1 ప్ర. 54 వీచి, 3 శ్లో. 40 పుట] 'వత్సస్త్వం' అను శ్లోకమును వర్ధమానుని పేర లభించుచున్నవి. వీరిరువురు నొకరో భిన్నులో తెలియదు.

† 'అనర్ఘరాఘవము'— చేబోలు సుబ్రహ్మణ్యంగారు [ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక —21 సంపు 2 సంచిక-56 పు— ఆంగీరస, జ్యేష్ఠాషాఢములు]

‘ జామదగ్న్యః — [సరోషపరిహాసమ్] అరే బ్రహ్మబన్ధో! బాధకీనేయ! గౌతమగోత్ర పాంసన !’

అని శతానందుని జామదగ్న్యుఁడు తిట్టెను. తత్త్వతపోవేదియు, సత్త్వగుణప్రధానుఁడు నగు పరశురాముని చేతను, యాజ్ఞవల్క్యునితో సమానుఁడగు జనకునిపురోహితుఁడైన శతానందుని చేతను నిట్టి మాటలాడించుటచేఁ గవి బ్రాహ్మణులయందు హీనత్వమును జూపెనని తెలియుచున్నది. ఇట్లు బ్రాహ్మణులయందు హీనత్వమును జూపుట చేతను, నక్కవికి భట్టుమూర్తి యనుపేరును, తండ్రికి భట్టవరదుఁడను పేరును నుండుటచేతను నితని భట్టశబ్దము భట్రాజు లనుశాఖను సూచించును గాన నితఁడు బ్రాహ్మణేతరుఁడని చెప్పవచ్చునని తోఁచుచున్నది ”

ఈవ్రాఁత కేవలమసంగతము, నవిమృశ్యమూలకము.

“భట్టుమూర్తి” యందలి “భట్ట” శబ్దమునకు “భట్రాజు”ని యర్థము గాదు. “భట్ట” పదమునకు బ్రాహ్మణుఁడు, పండితుఁడు—అని యర్థము. భట్ట, భట్టాక, భట్టారక, భట్టాచార్య శబ్దములు పూజ్యవాచకములు. ఆచార్య వామనశివరామ ఆప్టే-తన సాంస్కృతాంగ్లేయకోశమున నిట్లు వ్రాసియున్నాఁడు.

భట్టః-1. A title used with the names of learned Brahmanas. ఉదా. ‘భట్టగోపాలస్య పౌత్రః’ మాలతీమా I. So కుమారిలభట్టః etc.

2. Any learned man or philosopher.

భట్టారకః-1. Revered, worshipful.

2. A title of respect or distinction used with proper names: as in ‘ భట్టారకహరిచంద్రస్య పద్య (గద్య ?) బన్ధో నృపాయతే - హర్ష చ.

భట్టారకః — Venerable, worshipful.

భట్టారకః is an epithet applied to great and learned men.

భట్టాచార్యః—1. A title given to a learned man or any celebrated teacher. 2. A great doctor.

“భట్టారకో భట్టరకో భట్టస్తత్రభవానితి—వైజయంతీ” అని ఇష్టార్థకల్పవల్లి (47 పు.)

“భట్టశబ్దః-పూజ్యవాచీ”—అని పంచికా వ్యాఖ్య (56 పు.)

“భట్టః—చతుర్దశశాస్త్రాభిజ్ఞః. మాలతీమాధవటీకాయాం సర్వరక్షితేన వ్యాఖ్యాతత్వాత్. దేశభాషా చేయమ్”-అని రుచిపతి వ్యాఖ్య (15 పు.)

ఇదియుంగాక-“అస్యహి మౌద్గల్యానాం బ్రాహ్మణా మన్వయమూర్ధన్యస్య మురారినామధేయస్య” అను ప్రస్తావనా వాక్యమువలన మౌద్గల్యవంశము బ్రాహ్మణులనేకు లవతరించిన పవిత్ర వంశమని తెలియుచున్నది. బ్రాహ్మణులనఁగా—“ఋషయ ఇవ బ్రాహ్మణా బ్రహ్మర్షయః”-అని రుచిపతి (19 పు.) A Brahmanical sage'-అని ఆప్టేనిఘంటువు.

మఱియు మురారి తాను శ్రోత్రియపుత్త్రుఁడనని కూడఁ జెప్పుకొనియున్నాఁడు:-“అయంతు ప్రాచేతసీయం కథావస్తు బహుభిః ప్రణీతమపి ప్రయుంజానో నాపరాధ్యతి శ్రోత్రియపుత్త్రః”(17 పుట)

దీనివలన మురారిజనకుఁడు శ్రోత్రియుఁడని తెలియుచున్నది. శ్రోత్రియుఁడనఁగా వేదవేత్త

మఱియొకప్రమాణమువలన-జన్మచే బ్రాహ్మణుఁడు, సంస్కారముచే ద్విజుఁడు, విద్యచే విప్రుఁడు, నీమూటిచేతను శ్రోత్రియుఁడునగునని తెలియుచున్నది.

" శ్రోత్రియశ్ఛన్దోऽధ్యేతా. జన్మసంస్కారవిద్యావాన్ నా శ్రోత్రియః ఇతి— 'శ్రోత్రియం ఛన్దోऽధీతే' ఇతి వ్యాకరణే సాధు. లక్షణాన్తరం చ— శ్లో॥ జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః సంస్కారైర్ద్విజ ఉచ్యతే। విద్యయా యాతి విప్రత్వం త్రిభిః శ్రోత్రియ ఉచ్యతే " —రుచిపతివ్యాఖ్య. [17 పు.]

భట్ట, భట్టారపదములు నామములు గాఁ గల సంస్కృతకవులు, పండితులు ననేకులు గలరు:—

1. అనంతభట్టు; 2. భట్టాపరాజితుఁడు; 3. భట్టేందురాజు; 4. భట్టోద్భటుఁడు; 5. భట్టకర్ణాటకుఁడు; 6. కుమారిలభట్టు; 7. భట్టగోపాలుఁడు; 8 దామోదరభట్టు; 9. భట్టనారాయణుఁడు; 10. భట్టప్రభాకరుఁడు; 11. భట్టబాణుఁడు; 12. మమ్మటభట్టు; 13. భట్టవాసుదేవుఁడు; 14. భట్టవృద్ధి; 15. భట్టశ్రీశివస్వామి; 16 భట్టశ్రీదత్తుఁడు; 17. భట్టనందనుఁడు; 18. హరిభట్టు 19. భట్టారహరిచంద్రుఁడు. 20. భట్టహలాయుధుఁడు.

ఆంధ్రకవులలోఁ గూడ నన్నయభట్టు; హరిభట్టు మొదలగువారు కలరు గదా! కావున భట్టమురారి భట్టరాజపుట యుపమన్యుభవ మని యెఱుఁగునది.

## 3. మురారి నివాసము

మురారి నివాసస్థల మేదియను సంశయము సందేహాస్పదముగా నున్నది. ఇతఁడు కాశ్మీరవాసి యనియు, నర్మదాతీరవాసి యనియు, నాంధ్రదేశీయుఁడనియు నిట్లు ప్రాచ్యవిద్యాపరిశోధకులు వివదించుచున్నారు. ఆ వాదముల నిందు సూచించెదను. నిర్ణయసాగర ముద్రణమును బరిష్కరించిన మహామహోపాధ్యాయ పండిత దుర్గాప్రసాదాఖ్యులు—" ఈ కవి దేశకాలములు సరిగాఁ దెలియవు. కాని కాశ్మీరమున నీనాటకమునకుఁ బ్రచురప్రచారము కలదు. "— అని వ్రాసియున్నారు. అందువలన నీ కవి కాశ్మీరవాసియే యైయుండునని కొందఱు తలంచిరి. కాశ్మీరవాసులగు రత్నాకరుఁడును,* మంఖుఁ

*. హరవిజయము, 38 సర్గ. 68 శ్లో. ఈశ్లోకమునందలి 'కవి, మురారి' పదములు మురారికవి సూచకములుగావని కొందఱిమతము.

మును[1] దమకావ్యములలో మురారిని బేర్కొనుటయు, భారతవర్షమున నితర ప్రాంతములందలి కవులకావ్యములలో నితని ప్రశంస లేకపోవుటయు నీవాదమునకుఁ గొంతసాధకము. కాని ప్రమాణాంతరములుండినఁ గాని యీవాదము నిలువదు.

ఇఁక నర్మదాతీరవాదము— ఈనాటకమునఁ గవి చేదిమండలమున కలంకారమును, "కలచురి" కులనరేంద్రులకుఁ బ్రధానపట్టణమునగు మహిష్మతీనగరమును బేర్కొనుటచే నితఁడు "కలచురి" ప్రభువుల నాశ్రితుఁడై యుండు ననియు, నేఁడు మాంధాతనగర మనఁబడు నర్మదానదీప్రాంతములందున్న మాహిష్మతీనగరమే యీతని వాసస్థానమనియు "బెరిడేల్ కీత్"[2] మొదలగు పాశ్చాత్యసంస్కృతపండితులూహించుచున్నారు. కాని ప్రమాణాంతరములు లేకపోవుటచేఁ గాశ్మీర, నర్మదాతీరవాదములు రెండును దుర్బలములని నిరసింపవలెను. మురారి సప్తమాంకమున ననేకనగరముల వర్ణించుచు మహారాష్ట్రమండలైకమండనమగు కుండినగరమును గూడ వర్ణించెను అంతమాత్రముననే యితఁడు కుండిననగరవాసి యనఁ జెల్లునా ?

1. శ్రీకంఠచరితము. 25-74. ఈశ్లోకములు రెండును గాలనిర్ణయ ప్రకరణమున వివరింపఁబడును.

2. 'Of his place of activity we know nothing definite. He mentions, however, Mahishmati as the seat of the Kalacuris, and it has been suggested that, this indicates that he lived under the patronage of a prince of that dynasty at Mahismati, now Mandhata on the Narmada.'—

—Dr. A. B. Keith: 'The Sanskrit Drama'—P. 226.

ఇఁక నాంధ్రదేశవాదము:—కీ॥ శే॥ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు "ఆంధ్రవిజ్ఞానసర్వస్వము"న[1] అనర్ఘరాఘవమును గుఱించి యొక చక్కని వ్యాసమును బ్రచురించి, యందీవాదమునకుఁ గల యుపపత్తులను వివరించియుండిరి. వారి వాక్యముల నుదాహరించి, పిమ్మట నాకుఁ దోఁచిన విశేషాంశములఁ జేర్తుందును. "నాకుఁ జూడ నీ కవి యాంధ్రదేశము వాఁడేమో యని సంశయము తోఁచుచున్నది. ఎందుకనఁగా, ఈనాటకమునందు ఏడవ యంకములో, శ్రీరామాదులు రావణసంహారానంతరము పుష్పక విమానమెక్కి అయోధ్యకు వెళ్ళుచుండఁగాఁ గ్రిందఁ గానవచ్చిన కొన్ని దేశములను, పట్టణములను క్షేత్రములను వర్ణించునట్టి సందర్భమునఁ గవి ఆంధ్రదేశమందలి భీమేశ్వరుని నిట్లు వర్ణించియున్నాఁడు:-

'విభీషణః:—[దక్షిణతో దర్శయన్] దేవ! పరిణమ్యతామయమన్ధ్రవిషయలక్ష్మ్యాః సప్తగోదావరీహారకలాపైకనాయకో భగవాన్ భీమేశ్వరః"

(అర్థము:—విభీషణుఁడు— దక్షిణమువైపు చూపి) దేవా! ఆంధ్రదేశలక్ష్మికిఁ గల యేడుగోదావరులను హారసమూహములకు నొక్కనాయకమణియగు ఈభగవంతుఁడైన భీమేశ్వరునకుఁ బ్రణామము చేయుఁడీ)

దీని తరువాత విభీషణునినోట[2] నొకపద్యమును, శ్రీరా

1. 'ఆం. వి. స.' ద్వితీయసంపుటము (పునర్ముద్రణము-1934,-25-26 పు.

2. "అయం హి—శ్లో॥ తత్కాలోన్మిషితటీ విజృమ్భణ పరిత్రాసాదివ భ్రశ్యతా
వామార్థేన తదేక శేషచరణం బిభ్రద్వపుర్భైరవమ్
తుల్యం చాస్తి భుజఙ్గభూషణమసౌ భోగీన్ద్రహారాలకై
ర్బిభ్రాణః పరమేశ్వరో విజయతే కల్పాన్తకగ్రాహిణః.
7 అ. 108 శ్లో.

మునినోట * రెండుపద్యములును భీమేశ్వరస్తుతిపరములు కలవు. వానితో మనకుఁ బనిలేదు. కాని పైని ఈయఁబడిన 'అన్ధ్రవిషయము,' 'సప్తగోదావరి,' 'భీమేశ్వరుఁడు,' అనుపదములును, హిందూదేశమునందు విశేషఖ్యాతిలేని భీమేశ్వరక్షేత్రమును (దాక్షారామము) వర్ణించుటయుఁ జూడ నీ కవి యాంధ్రుఁడనియు, ఆదేశమందలి యభిమానముచే శ్రీరామునిచే దండము పెట్టించెననియు నూహింపవలసియున్నది. కాని కవి ఈప్రకరణమునందే భీమేశ్వరునకుఁ బూర్వము మహారాష్ట్రాంతర్గతమైన విదర్భలోని కుండినపురమును, తరువాత ద్రవిడదేశమందలి కాంచీనగరమును వర్ణించియున్నాఁడు, కావున— 'ఈ కవి ఆయాదేశములవాఁడని కూడఁ జెప్పవలసియుండును' అని కొందఱాక్షేపింపవచ్చును. కాని అట్లనుట సరికాదు. కుండినపురము, కాంచీనగరము భరతఖండఖ్యాతి గల పట్టణములు. కవి యెచ్చటివాఁడైనను ఆపట్టణనామములను ఎఱిఁగియుండును. దాక్షారామము అట్టి భరతఖండఖ్యాతి గల క్షేత్రము కాదు. దానికి తెలుఁగు

* 'రామః— [కృతాఞ్జలిః]

శ్లో॥ కృత్వారమ్భ పరిత్రసద్గిరిసుతాంకణ్ఠగ్రహ సంపూర్తయే
నిర్వ్యూఢభ్రమి విభ్రమాయ జగతామీశాయ తుభ్యం నమః
యశ్చూడాభుజగేశ్వరప్రశ్లథస్తాదృగ్భ్రమస్తీర్దశః
పశ్యద్భిర్భ్రమఘూర్ణమాననయనైః శాన్తోఽపి న శ్రద్ధధే.

అపిచ— శ్లో॥ క్రీడానటస్య ప్రల[illegible]రైః
కర్ణే నిపీతే తవ [illegible]
పృథక్కబన్ధం పృథగుత్తమాఙ్గమ్
నృత్యద్భిరూర్ధ్వేక్షిత కాలరాత్రిః. —7 104; 105 శ్లో.

దేశమందు మాత్రము ఖ్యాతి గలదు. ఆఖ్యాతికిని రెండుమూఁడు జిల్లాలకంటె నెక్కుడు వ్యాప్తిలేదు. తెలుఁగువాఁడైనఁగాని సాధారణముగ నీక్షేత్రమును ఎఱిఁగియుండఁడు. ఒకవేళ నెవరివలన నైన విన్నను, కాంచీపట్టణమందలి మీానకేతనునితో సమానముగ నీ భీమేశ్వరుని నాటకమునందుఁ బేర్కొనవలయునని యాతనికేల బుద్ధి పుట్టును ?" శ్రీలక్ష్మణరావుగారు చూపిన యీాయుపపత్తులు సమంజసములుగానే నూపట్టుచున్నవి. ఆంధ్రదేశమునఁ బండిత లోకమున నీనాటకమునకు విశేష ప్రచారముండుట యీావాదమునకు సాధకము. మురారినాటక వ్యాఖ్యాతలలో ముగ్గురు దక్షిణ భారతవర్షమునకుఁ జెందినవారు; వీరిలో నిద్దఱు తెలుఁగునాటి వారు—హరిహరదీక్షితులు, రామానందాశ్రమముని ఈవిషయ మీావాదమునకు మఱింత సాధకముగానున్నది.

## 4. మురారికాలము.

రత్నాకరుఁడు (క్రీ. 855-84) మంఖుఁడు (క్రీ. 1135 45) మొదలగు సంస్కృతకవులకంటె మురారి చాల నవీనుఁడని కొందఱి యభిప్రాయము. రత్నాకర, రాజశేఖరాదులకంటెఁ బ్రాచీనుఁడని మఱికొందఱనుకొనెదరు. మొదట నవీనత్వవాదుల యుపపత్తులం జూపి, వానిని విమర్శింతము:—హేమచంద్రుని శిష్యుఁడును, కావ్యనాటకాలంకారాదిబహుగ్రంథకృతినిర్మాతయు నగు రామచంద్రసూరిచే (క్రీ. 1173-76) రచియింపఁబడిన 'కౌముదీమిత్రానందము' అను నాటకములోని మూఁడవశ్లోకమును బట్టి, యీాకవియు మురారియు సమకాలీనులని 'హుల్ట్ష్' (Dr. Hultzsch) పండితుఁడు సిద్ధాం

తీకరించి యున్నాఁడు.[1] కాని యాతఁడు చూపిన యుపపత్తి చాల దుర్బలమైనది. పైశ్లోకమును బట్టి నాఁటికే మురారి కీర్తిశేషుఁడయ్యెనని యే తేలుచున్నది. ఇతరకవులకాలమును బట్టి చూచినను నీవాదము నిలువనేరదు. ఏలన క్రీ. శ. 1176 ప్రాంతమున జీవించియుండిన రామచంద్రుని సమకాలికుఁడగు మురారిని, క్రీ. 1135 ప్రాంతముల విలసిల్లిన మంఖుఁడు తనకావ్యమునఁ బేర్కొనుట యెట్లు పొసఁగును?

క్రీ. శ. 1135-45 నడుమ రచింపఁబడిన మంఖుని 'శ్రీకంఠచరితము'న జయసింహునకు (క్రీ. 1129-50) మంత్రియు, మంఖుని సోదరుఁడునగు అలంకారుఁడు సమావేశమొనర్చిన విద్వత్పరిషత్తు వర్ణింపఁబడి యున్నది. అందు ప్రకృతములగు రెండుశ్లోకములను జూపెదను.

"శ్లో. పథా చరతి వక్రేణ వాగ్యస్య చతురైః పదైః
సరస్వత్యై వినిర్మాతు ముద్యతేవ ప్రదక్షిణమ్.
శ్లో. పరిక్రమై ర్గ్రహవక్రిణో మురారి మనుధావతః
శ్రీరాజశేఖరగిరో నీపి యస్యోక్తిసంపదామ్."
—శ్రీకంఠచరితమ్. 25 స. 73-74 శ్లో.

1. "A further effort to place him late is that of Dr. Hultzsch [Z. D. M. G, Vol. 75, no. 63] who infers from verse 3 of the 'Kaumudi- mitrananda' of Ramacandra, pupil of Hemacandra, that that dramatist was a contemporary of Murari. But the evidence is clearly inadequate; the words used are perfectly compatible with the fact that Murari was dead, and there are grave chronological difficulties in the way of the theory. It is practically impossible that a contemporary of Ramacandra could have been cited by Mankha at the date of the 'Srikantha-carita'. Moreover Murari seems to have been imitated by Jayadeva in the 'Prasanna-Raghava, [II. 34, as Compared with VII. 83]"—Keith: 'Sanskrit Drama' Pp 225—6.

ఈప్రమాణములవలన మురారి క్రీ. శ. 1135 కంటెఁ బూర్వుఁడనియే కాక, 12 వ శతాబ్దికే రాజశేఖరునికంటె మురారి ప్రాక్తనత్వ మంగీకరింపఁబడినట్లును దెలియుచున్నది. ఈవిషయము స్థలాంతరమున మురారిరాజశేఖరుల పౌర్వాపర్యవిచారణ సందర్భమున విస్తరింపఁబడును.

ఇఁక రాజానక రత్నాకరుని యుల్లేఖనముం గూర్చి యాలోచింతము కాశ్మీరము నేలిన యవంతివర్మ (క్రీ. శ. 855 84) యాస్థానమున ముక్తాకణుఁడు, శివస్వామి, ఆనందవర్ధనుఁడు, రత్నాకరుఁడును విలసిల్లియుండినట్లు 'రాజతరంగిణి' యందలి యొకానొక శ్లోకము వలనఁ దెలియుచున్నది.[1] రత్నాకరుఁడు తన 'హరవిజయ మహాకావ్యము' న

'శ్లో. అఙ్కేఽథ[2] [అఙ్కేత్థ] నాటక ఇవోత్తమనాయకస్య
నాశం కవి ర్వ్యధిత యస్య మురారి రిత్థమ్
ఆకర్ణితకృత్స్నభువనః క్వ గతః సదైత్య
నాథో హిరణ్యకశిపుః సహబన్ధుభి స్స్వైః[3]'—38 స. 68 శ్లో.

అనుశ్లోకమును రచించెను ఇట—"అఙ్కే=ఉత్సఙ్గే; మురారిః విష్ణుః," అని ప్రకృతార్థమైనను, కవి యుద్దేశపూర్వకముగా— అఙ్క, నాటక, కవి, మురారి పదములఁ బ్రయోగించి, నాటకనిర్మాత యగు మన మురారికవినే సూచించియున్నాఁడని, మ. మ. దుర్గా

---

1. 'శ్లో. ముక్తాకణః శివస్వామీ కవిరానందవర్ధనః । ప్రథాం రత్నాకరశ్చాగాత్ సామ్రాజ్యేఽవన్తివర్మణః'— రాజత. 5 త. 34 శ్లో.

2. 'అఙ్కేషు' అని పాఠాంతరము. 3. 'బన్ధువర్గైః' అని పా.

ప్రసాదపండితులు వ్రాసియున్నారు.[1] ఈసిద్ధాంతము సరిగాదనియు పైపదములు మురారికవి నెంతమాత్రమును సూచింపవని 'కొనో' [Prof. Sten Konow][2] అను పాశ్చాత్యపండితుఁడును, పండిత పరవస్తు భట్టనాథస్వామి,[3] కే. యస్. రామస్వామిశాస్త్రి శిరోమణి[4] అనుభారతీయపండితులును వ్రాసియున్నారు. 'హరవిజయ వ్యాఖ్యాత యగు అలకుఁడీశ్లోకవ్యాఖ్యానములో మురారి కవిపేరైనను దల పెట్టలేదు. 'బెరిడేల్ కీత్' మొదలగు పండితు లీశ్లోకము ప్రక మురారికవిని సూచించు ననియు, నందువలన మురారి క్రీ. శ. 855 కంటెఁ బ్రాక్తనుఁడనియు వ్రాసియున్నారు.

ఈశ్లోకము మురారికవిని సూచింపదను విమర్శకుల యుపపత్తు లేమన:—స్థూలదృష్టి కీశ్లోకమునందలి-అఙ్క, నాటక, కవి, మురారి-పదములు మురారికవి నుద్దేశించినట్లే కానఁబడును. ఈ శ్లోకమునఁ జెప్పఁబడినట్లు అనర్ఘరాఘవమున నెచ్చటను నుత్తమ నాయకుఁడగు రామునిపతనము కానరాదు. కావున నప్రకృతముగా నైనప్పటికి నీశ్లోకము కవిమురారిని సూచింపఁజాలదు. ఇఁక నీశ్లోకమును—"కవిః కునాటకే అఙ్కే ఉత్తమనాయకస్య నాశమివ మురారిః ఇత్థం యస్యనాశం వ్యధిత సః ఆక్రాన్తకృత్స్నభువనః దైత్యనాథః హిరణ్యకశిపుః సహబన్ధువర్గైః క్వ గతః"—అని సమన్వయింపవలెను.

---

1. 'అనర్ఘరాఘవము'-1 పు. అధోజ్ఞాపిక [నిర్ణయసాగరప్రకటనము, 1908.]
2. 'The Indian Drama'—Berlin, 1920.
3. 'Indian Antiquary'—Vol. XLI, No. 141.
4. Notes to Rajasekhara's 'Kavya-mimamsa'-Pp. 234-5. [G. O. Series—No. 1. 3rd ed. 1934]
5. 'The Sanskrit Drama,—P. 225.

ఈయుభయమతముల వాదముల సమాలోచింపక యే, మురారి క్రీ. శ. 850-880 నడుమ జీవించియుండెనని ప్రమాణాంతరములచే నిరూపింపనగును. మొదట నీతనిజీవితకాలమునకుఁ బూర్వావధి (క్రీ. శ. 850) ని గూర్చి విచారితము :—

రావణసంహారానంతరము రామాదులు విమానముపై నయోధ్యకు వెళ్ళుచుండునవసరమున శ్రీరాముఁడు జానకితో- కలచురికులనరేంద్రులకు రాజధానియు, చేదిమండలమునకు శిరో- లంకారమునగు మాహిష్మతీనగరమును బేర్కొని, యచ్చటి యువ జనుల క్రీడావిలాసముల వర్ణించినట్లు—అనర్ఘరాఘవమునఁ గలదు.

" రామః—[అన్యతో దర్శయన్] ఇయం చ కలచురికులనరేన్ద్రసాధారణాగ్ర మహిషీ మాహిష్మతీనామ చేదిమణ్డలముణ్డమాలా నగరీ. ఇహ హి.

శ్లో. ఆశ్లేష చుంబనరతోత్సవకౌతుకాది
క్రీడాగుణోదరపణప్రతిభూరనఙ్గః
భోగస్సయద్యపి జయే చ పరాజయే చ
యూనోర్మనస్తదపి వాఞ్ఛతి జేతుమేవ. —7. అ. 114 శ్లో.

కలచురివంశము[1] భారతవర్షమునందలి సుప్రసిద్ధరాజవంశము లలో నగ్రగణ్యము. కలచురిప్రభువులు చేదిమండలమును జిరకాల ము—అనఁగా- క్రీ. 14 వ శతాబ్దివఱకుఁ బాలించిరి.[2] ఈవంశ ప్రతిష్ఠకుఁ గారకుఁడు 'కొక్కల్లదేవుఁడు' అను ప్రభుపుంగవుఁడు.

---

1 మఱియొకస్థలమునఁ గూడ- 'కల (కర)చురి' నామము పేర్కొనఁ బడినది: 'యః కర్చ్చుర్వైరివారోయం సఖులు కరచులికతత్ర సాధారణత్వాత్' 5 అ. 50 శ్లో. (218 పు).

2. C. V. Vaidya: 'History of Mediaeval Hindu India'— Vol. II (1924); Ch. VIII-The Kalachuris of Chedi-Pp. 134-37.

ఇతఁడు-క్రీ. శ. 850 ప్రాంతముల రాజ్యపాలన మొనరించినట్లు దేశచరిత్రలవలనఁ దెలియుచున్నది. మురారి చేసిన చేదిమండలప్రశంస యీతని రాజ్యపాలనకాలమునకుఁ జెందవచ్చును. కావున మురారి క్రీ. శ. 850 కంటె నర్వాచీనుఁ డనఁదగును.

ఇంక మురారిజీవితకాలమున కుత్తరావధి నరయవలెను. రాజశేఖరుఁడు 'కావ్యమీమాంస' లో- స్వస్యపాతాలీయకవిరహస్యస్థాపన మను పదునాఱవ యధ్యాయమునందు[1]

'శ్లో. యదిన్దో రన్వేతి వ్యసన ముదయం వా నిధి రపా
ముపాధి స్తత్రాయం జయతి జనికర్తుః ప్రకృతితా
అయం క స్సంబంధో యదనుహరతే తస్య కుముదః
విశుద్ధాః శుద్ధానాం ధ్రువ మనభిసన్ధి ప్రణయినః."

అను శ్లోకమును మురారినాటకమునుండి (I అ. 58 శ్లో.)- కవిపేరు గాని, కృతిపేరు గాని పేర్కొనకయే యుదాహరించుకొని యున్నాఁడు.

ఈశ్లోకము కావ్యమీమాంసయొక్క వ్రాఁతప్రతులలోఁ గన్పట్టలేదఁట. కాని హేమచంద్రుని "కావ్యానుశాసనవివేకమునఁ" గలదు.[2] దీనిని బ్రమాణముగాఁ గైకొని దీని నిందుఁ బరిష్కర్తలు చేర్చిరి. కావ్యమీమాంస నుండి యనేక భాగములను హేమచంద్రుఁడు కావ్యానుశాసనమునకుఁ దాను నిర్మించిన 'వివేకము' లో నుదాహరించుకొని యున్నాఁడు. అందీ పదునాఱవయధ్యాయములోని మూఁడుశ్లోకములను దప్ప తక్కిన యధ్యాయము నంతయు హేమచంద్రుఁడు స్వీకరించియున్నాఁడు.

---

1. కా. మీమాంస, 87 పు.
2. హేమచంద్రుని 'కావ్యానుశాసనవివేకము'—[17 పు.]

'అత్రినేత్రసముద్భూతచన్ద్రయో ర్ఐక్యమ్'—అను కావ్యమీమాంసలోని (XVI. అ. 87. పు.) కారికకు 'వన్ద్యా విశ్వసృజః'-అను శ్లోక మత్రినేత్రోత్పన్నుఁడగు చంద్రున కుదాహరణము; 'యదిన్ద్రోరన్వేతి' అనుశ్లోకమే యిట నుదాహరింపఁబడనిచో సముద్రోత్పన్న చంద్రున కుదాహరణమే లేదు. ఈరెండు శ్లోకములను గలిసి పై కవిసమయమున కుదాహరణమగును. లేఖకప్రమాదమునఁ గావ్యమీమాంసయొక్క లిఖితపుస్తకములలో నీ రెండవశ్లోకము లోపించి యుండఁ బోలును. కావున నీశ్లోక మీయఁదుఁ బ్రక్షిప్తము కాదనియు, రాజశేఖరుఁడే చేర్చియుండుననియు సిద్ధాంతీకరింపనగును. మురారి రాజశేఖరుల కాలమును బట్టి చూచినను నిది సుసంగతముగానే కన్పట్టుచున్నది. మురారికవితను రాజశేఖరుఁ డనుసరించెనను శ్రీకంఠచరితములోని శ్లోకము నిదివఱకే చూపియున్నాము. మురారి రాజశేఖరున కించుక పూర్వుఁడు కావచ్చును; లేదా వారిరువురు సమకాలికులైనను గావచ్చును; అట్లయినచో మురారి వృద్ధుఁడును, రాజశేఖరుఁడు చిన్నవాఁడును కానోపును.

పూర్వకవిక్షుణ్ణమగు రామకథనే మఱలఁ దాను నాటకరూపముగా వ్రాయుటకు హేతువు నిట్లు మురారి వచించి యున్నాఁడు:—

'శ్లో. యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితమ్
గుణైరేతావద్భిర్జగతి పునరన్యో జయతి కః
స్వమాత్మానం తత్తద్గుణగరిమగంభీరమధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథ ముపకరిష్యన్తి కవయః" 1 అ. 9 శ్లో.

దీనివలన మురారికిఁ బూర్వమే రామాయణమును శ్రవ్యకావ్యముగానో, దృశ్యకావ్యముగానో యనేకులు రచించినట్లు తెలియు

చున్నది. రామకథాశ్రయములగు శ్రవ్యకావ్యములపరిసంగము మన కిట నప్రస్తుతము గావున, దృశ్యకావ్యముల విషయమై యాలోచింపఁదగును. మురారికంటెఁ బ్రాక్కాలికములగు రామ నాటకములు—

I. భాసుఁడు:—1. ప్రతిమానాటకము.
2. అభిషేకనాటకము.

II. దిఙ్నాగుఁడు:—3. కుందమాల.

III. భవభూతి:—4. మహావీరచరితము.
5. ఉత్తరరామచరితము.

IV. యశోవర్మ:—6 రామాభ్యుదయము.

V. మాయురాజు:—7. ఉదాత్తరాఘవము.

VI. ? :—8. ఛలితరామము.

VII. శక్తిభద్రుఁడు:—9. ఆశ్చర్యచూడామణి.

ఇందుఁ గొందఱికవుల కాలము నిశ్చయముగాఁ దెలియుచున్నది. కొన్ని నాటకములలోని కవితాచ్ఛాయలు మురారినాటకమునఁ గానఁబడుచున్నవి. ఇట్టి కవితాసామ్యములు తరువాతి ప్రకరణములలో వివరింపఁబడును. ఈప్రమాణములఁ బట్టి చూచినను ముందు సిద్ధాంతీకరింపఁబడిన మురారికాలము సరియని దృఢమగుచున్నది.

ఇఁక, వాఙ్మయపరిశోధకుల యుపయోగముకొఱకు మురారి సమకాలికులగు సంస్కృతవాఙ్మయనిర్మాతల నామములఁ గొన్నిటిఁ బేర్కొనెదను:—

1. అభినందుఁడు (880-920 క్రీ. శ.):—కాదంబరీకథాసారము.
2. ఆనందవర్ధనుఁడు (855-84):—ధ్వన్యాలోకము.
3. త్రివిక్రమకవి (915):—నలచంపూ మదాలసచంపువులు.

4. భల్లటుఁడు (883-902):—భల్లటశతకము.

5. ముక్తాకణుఁడు (855-84)

6. రత్నాకరుఁడు ,, :—హరవిజయము.

7. రాజశేఖరుఁడు (880-920) కావ్యమీమాంస, బాలరామాయణము మొ.

8. రుద్రభట్టు (900-1000) శృంగారతిలకము.

9. వాచస్పతిమిశ్రుఁడు (850):—భామతి, న్యాయకణిక.

10. శాకటాయనుఁడు (814-77):—శాకటాయనవ్యాకరణము.

11. శివస్వామి (855-84):—కప్ఫణాభ్యుదయము.

5. మురారిబిరుదములు-కవిపండితామోదము.

మురారి తనకు 'బాలవాల్మీకి' యని బిరుద మున్నట్లు—'మురారినామధేయస్య బాలవాల్మీకేర్వాఙ్మయ మమృతబిన్దువిష్యన్ది' అని ప్రస్తావనలోఁ జెప్పికొనియున్నాఁడు. వాల్మీకివాగమృతకూపము నకు నిపానమువంటి యనర్ఘరాఘవమును రచించి, యితఁడు కవిపండితుల యామోదమును బడసి, 'బాలవాల్మీకి' యను బిరుదము నంది యుండును. ఇట్లే మురారికృతి ననేకవిధములఁ బోలియున్న 'ప్రసన్న రాఘవము'ను రచించిన జయదేవునకు 'పిల్ల (బాల) మురారి' యను బిరుదము గలదు. సుధాసదృశమైనను వాల్మీకికవిత కూపము నందలి జలమువలె సుగమము గాదనియు, నందుచే వాల్మీకి కవితామృతమును నిపానము (గాడి) వంటి తన యనర్ఘరాఘవమున నించి, సర్వజనసులభముగఁ దా నొనరింపఁదలంచినట్లు మురారి యీశ్లోకమునఁ జెప్పికొని యున్నాఁడు:

'శ్లో. తత్తాదృగుజ్జ్వలకలత్కథితలబ్ధశక్తి
సారభ్యవిగ్రహగభీరమనోహరాణి
వాల్మీకివాగమృతకూపనిపానలక్ష్మీ
మేతాని బిభ్రతి మురారి కవేర్వచాంసి'—అనర్ఘ. I అ. 12 శ్లో.

కాని నిజ మారయుచో 'నారికేళఫలపాకమునం జలిమైన' భట్టమురారి 'కవితానుగుంఫముల' కంటె 'మాధ్వీరఘురీధురీణ'ము లగు వాల్మీకివాక్కులే సుగ్రాహ్యములుగా నుండును. మురారి కట్టుపెట్టెలోని వస్తువును యయః పేటికయందుఁ బెట్ట నవచ్చును. సంస్కృతమున సామాన్యసంస్కారము గలవారిని గూడఁ దలలూపఁ జేయు వాల్మీకికవిత యెక్కడ, పండితాగ్రణులకుఁ గూడఁ గొఱుకఁబడని క్లిష్టగ్రంథులు గల మురారికవన మెక్కడ! అయినను విద్వత్కవిరచన మగుటచే మురారికృతి పండితలోకమునఁ బ్రఖ్యాతి నందియుండును.

హృదయావర్జకములగు కొన్ని కొన్ని వర్ణనలను బట్టి సంస్కృత కవీంద్రుల కాయాబిరుదములు రసికచూడామణులచే నొసంగఁబడి నవి. ఇట్లు బిరుదముల నందినవారిలో మురారి యొకఁడు. 'అనర్ఘ రాఘవము'న (II అ. 81 శ్లో.)

'శ్లో. భూయిష్ఠతరాణి య దమూని తమస్వినీషు
జ్యోత్స్నీషు చ ప్రవిరళాని తతః ప్రతీమః
సంధ్యానలేన భృశ మంబరమూషికాయా
మావర్తితె రుడుభిరేవ కృతోఽయ మిందుః'.

అనుశ్లోకమున- కాలమనెడి శిల్పి సంధ్యయను నగ్నిహోత్రి మున నాకాశమను మూసయందు నక్షత్రములనెడు వెండిముక్క లను గరఁగించి చంద్రుఁడనెడు వెండిదిమ్మను బోయుటచేఁ గావల యుఁ, జీఁకటిరాత్రులయందు నక్షత్రములు హెచ్చుగానుండి వెన్నెల రాత్రులయందు స్వల్పముగా నున్నవని యుత్ప్రేక్షించుట వలన నీకవికి 'ఇందు మురారి' యను బిరుదము లభించెనఁట.

కొందఱు కవులకు వారివారి గ్రంథములను బట్టి బిరుదములు వచ్చినవి. ఉదా: రఘువంశమును రచించుటచేఁ గాళిదాసునకు రఘుకారుఁడు; కృష్ణకర్ణామృతరచనముచే లీలాశుకునకుఁ గర్ణామృతకవి. చమత్కారజనకములగు పదములఁ బ్రయోగించుటచే మఱికొందఱకు వాని ననుసరించి బిరుదములు లభించినవి. ఉదా: జఘనచపల; ఘటకర్పరుఁడు; కర్ణోత్పలకవి; ఝుఞ్ఝులవాసుదేవుఁడు; పికనికరుఁడు, క్రీడాచంద్రుఁడు—మొదలగువారు. చిరకాలము క్రిందటనే నేను సంస్కృతమహాకవుల సార్థకబిరుదములను గూర్చి యొకవ్యాసమును బ్రచురింపనుండ నీవిషయమును గుఱించియే యొకరు ‘ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక’[1] లో నొకవ్యాసమును బ్రచురించియుండిరి. ఇందు వారు పదునొకండు సంస్కృతకవులను గూర్చి మాత్రము చర్చించియుండిరి. ఈనడుమ ‘భారతి’[2] లో ‘లాంఛనములు’ అను శీర్షికతో నీవిషయమును గూర్చియే వేఱొకరు మఱియొక వ్యాసమును బ్రకటించియుండిరి. ఇందు వీరు పేర్కొనినకవులు పదునేడుగురు మాత్రమే. ఇట్లు చమత్కారహేతువులగు బిరుదముల నందిన సంస్కృతకవిచంద్రుల నామములు నాకు నలువది వఱకు లభించినవి. వానింగూర్చిన చర్చ కాలాంతరమునకు విడచి కౌతుకోద్దీపకములగు వారినామములను మాత్రమిటఁ బేర్కొనెదను.

---

1. XIII సంపు. 3-4 సంచి, 215-22 పు. (1925) అల్లమరాజు సత్యనారాయణశాస్త్రిగారు: ‘సంస్కృతమహాకవులు, బిరుదములు’.

2. X సంపు. 8 సంఖ్య. 308-310 పు. (ఆగష్టు, 1933; శ్రీముఖ-శ్రావణము)-మల్లాది రామకృష్ణశాస్త్రిగారు: ‘లాంఛనములు’.

(1) అకాలజలదుఁడు. (2) ఆరనాళకవి. (3) 'ఇందు' మురారి. (4) ఉంఛవృత్తికవి (హారిగోషకవి). (5) కర్ణామృతకవి (లీలాశుకుఁడు). (6) 'కర్ణికార' శంఖుఁడు. (7) కర్ణోత్పలకవి. (8) కలమకవి. (9) క్రీడాచంద్రుఁడు. (10) కౌపీనకవి. (11) 'ఘంటా' మాఘుఁడు. (12) ఘటకర్పరుఁడు. (13) చండాలచంద్రుఁడు. (14) చంద్రోదయకవి. (15) 'ఛత్ర' భారవి. (16) 'ఛమచ్ఛమికా' రత్నకవి. (17) జఘనచపల. (18) జానుదఘ్నకవి. (19) 'ఝలజ్ఝల' వాసుదేవుఁడు. (20) 'తాళ' రత్నాకరుఁడు. (21) 'తురంగ' బాణుఁడు. (22) దగ్ధమరణుఁడు. (23) 'దీపశిఖా' కాళిదాసుఁడు (రఘుకారుఁడు). (24) 'దోర్గలికా' భీముఁడు. (25) నగ్నాచార్యుఁడు. (26) నిచులుఁడు. (27) నిద్రాదరిద్రుఁడు. (28) 'నిశా' నారాయణుఁడు. (29) పికనికరకవి. (30) భవభూతి [శ్రీకంఠుఁడు]. (31) మార్జారకవి. (32) 'యమునా' త్రివిక్రముఁడు. (33) రండానందకవి. (34) రత్నఖేట దీక్షితుఁడు. (35) వక్షస్థలాచార్యుఁడు. (36) వాగ్వీణాకవి. (37) వికటనితంబ. (38) 'వీణా' కవి. (39) వేణీకృపాణామరచంద్రకవి. (40) సీత్కారరత్నకవి.

మైసూరునగరమునఁ దెలుఁగులిపిలో ముద్రింపఁబడిన 'అనర్ఘరాఘవము'న మురారికి 'సకలతంత్రస్వతంత్రుఁడు, సంగీతసాహిత్యపారదర్శి, విద్వత్కవిసార్వభౌముఁడు'[1] అను విశేషణములు గానవచ్చుచున్నవి. ఈబిరుదములు మురారి కేపండితప్రభువైన నొసఁగినవో, లేక ముద్రాపకప్రసాదితములో తెలియుటలేదు. సకలతంత్రస్వతంత్రుఁ డనఁగా నన్ని శాస్త్రములయందును నిరంకుశప్రజ్ఞకలవాఁడని యర్థము. అనఁగా నాఁటికి శాస్త్రత్వగౌరవమునం దిన యన్నివిద్యలలో నీతఁ డఖండపాండిత్యము గలవాఁడని

1. 'తత్రభవతా సకలతంత్రస్వతంత్రేణ సంగీతసాహిత్యసరసతాపారదృశ్వనా విద్వత్కవిసార్వభౌమేన శ్రీభట్టమురారిణా విరచితమనర్ఘరాఘవాభిధం నాటకమ్'.

భావము. ఈతనికి శబ్దతర్కమీమాంసాదివివిధశాస్త్రములయందుఁ గల నైపుణ్య మన్యప్రకరణమునఁ గననగును. భవభూతి, మాఘుఁడు, శ్రీహర్షుఁడు, వేదాంతదేశికులు, అప్పయదీక్షితులు, వేంకటాధ్వరి మొదలగు సంస్కృతకవీంద్రు లిట్టి పాండితీపాటవము గలవారే.

ఈతని సంగీతసాహిత్యపారదర్శిత్వము: సాహిత్య మనఁగా సారస్వతము (వాఙ్మయము, *Literature,*) సాహిత్యశాస్త్రము (అలంకారశాస్త్రము, *Poetics*) అని యర్థము. ఈ రెండిటియందు నీతని దండెవేసినచేయి యని వేఱె చెప్పనక్కఱలేదు. ఈతఁడు సంగీతశాస్త్రనిష్ణాత యనుటకు బ్రమాణములు లభింపలేదు.

ఈతని విశ్వకవిసార్వభౌమపదము: ఈతఁడు మహావిద్వాంసుఁడు, కవిచంద్రుఁడు ననుటకు సంశయము లేదు. నాఁటి కవులలో నీతఁడు సార్వభౌముఁడుగా నెంచఁబడుచుండె ననుకొందును.

పిమ్మట మురారికవి పండితప్రపంచమున నెట్టి యామోదము నందెనో యరయఁదగును.

౧. ‘శ్లో. దేవీం వాచ ముపాసతే హి బహవః పారం తు సారస్వతమ్
జానీతే నితరా మసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః
అబ్ధి ర్లఙ్ఘిత ఏవ వానరభటైః కిం త్వస్య గమ్భీరతా
మాపాతాళనిమగ్నపీవరతను ర్జానాతి మన్థాచలః’.

ఈ శ్లోకము ‘సదుక్తికర్ణామృతము’ [1]న మురారికృతముగాఁ గన్పట్టుచున్నది. ‘రసికజీవనము [2]’నఁ గూడ మురారికే యారోపింపఁబడియున్నది. ‘అలంకారకౌస్తుభము’ [3]నఁ గవినామరహితముగా నుదాహరింపఁబడియున్నది. ఇట్లే ‘కువలయానందము [4]’న ‘సూక్తిరత్నాకరి [5]’ యందును ‘సారసంగ్రహము’ [III-90] న

(1.) 296 పు. (2.) 222 పు. (3.) 290 పు. (4.) 55 పు. (5.) 78. పు.

నుదాహరింపఁబడి యున్నది. 'అబ్ధి ర్లజ్ఞిత ఏవ' అను నది మొదటిచరణముగా 'సుభాషితరత్నకోశము' నందును [II. 31.] 'సుభాషితహారావళి' యందును [32 ఆ-18], 'అలంకారశేఖరము' (75పు) నందును 'రసగంగాధరము' నందును (388 పు) నుల్లేఖింపఁబడియున్నది. దీని మురారి రచించినట్లే పండితలోకమునఁ బ్రసిద్ధి. నిర్ణయసాగరప్రకటితమగు 'అనర్ఘరాఘవము' నఁ బీఠికలో నీశ్లోకము కర్తృనామరహితముగ నుదాహరింపఁబడియున్నది. క్రీ. 13 వ శతాబ్దిప్రారంభమున రచింపఁబడిన 'సదుక్తికర్ణామృతము' నందే యీశ్లోకము మురారి కారోపింపఁ బడుటచే నిది మురారి దనియే నమ్మఁదగును.

ఇందు మురారిపాండిత్యప్రౌఢి ప్రశంసింపఁబడి యున్నది. వాగ్దేవి ననేకు లుపాసన మొనర్చినను గురుకులవాసమునఁ గఠోర వ్యాసంగ మొనర్చిన మురారికవికే సారస్వతతత్త్వము తెలియును. వానరభటు లనేకులచే సముద్రము దాఁటఁబడినది; కాని సాగరము యొక్క గాంభీర్యము పాతాళమువఱకు వ్యాపించిన పీవరతనువు గల మంథాచలమునకే తెలియును గాని వానరభటులకేమి తెలి యునని దీనిభావము. ఇట్లాత్మస్తవమునకు మురారి పాల్పడునా యని శంకింపఁజనదు. భవభూతి, బిల్హణుడు, వేదాంతదేశికులు, జగన్నాథపండితరాయలు, వేంకటాధ్వరి మొదలగు సంస్కృతకవీంద్రు లనేకులు స్వప్రతిభావిష్కారము నొనర్చుకొనిరి.

2. 'శ్లో. మురారిపదచిన్తాయాం భవభూతేస్తు కా కథా
భవభూతిం పరిత్యజ్య మురారి మురరీకురు.'

3. 'శ్లో. భవభూతి మనాదృత్య నిర్వాణమతినా మయా
మురారిపదచిన్తాయా మిద మాధీయతే మనః'.

ఇట భవభూతికంటె మురారియాధిక్యము వర్ణింపఁబడినది. భవభూతి: అనఁగా భవభూతికవి యనియు, ఐహికైశ్వర్య మనియు

నర్థము. మురారిపదచిన్తా: అనఁగా విష్ణుపాదధ్యానమనియు, మురారి కవివాక్యాలసమాలోచన మనియు నర్థము.

౪. 'శ్లో. మురారిపదచిన్తా చేత్తదా మాఘే మతిం కురు
మురారిపదచిన్తాచేత్తదా మాఘే మతిం కురు.'

మాఘే=మాఘకవి 'శిశుపాలవధ' యందు, మతిం కురు=మనస్సు నుంచుము-మఱియు,అఘే=పాపమునందు, మతిం మా కురు=మనస్సును బోనీకుము.

విష్ణుపాదధ్యానము వలయుచోఁ బాపమున బుద్ధిపోనీకుము; మురారికవిశబ్దచమత్కృతి నెఱుఁగఁదలఁచినచో మొదట మాఘకావ్యమును బఠింపుము—అనిభావము. ఇక్కడ నొకవిశేషము: మురారి మహాశాబ్దికుఁడు; వ్యాకరణసంప్రదాయములను, వ్యాకరణచమత్కారములను దనకృతియం దనేకముల సూచించెను. ఈ వ్యాకరణప్రయోగచమత్కారమును జక్కఁగ నెఱుఁగఁదలఁచినచో వ్యాకరణచమత్కారప్రచురమగు మాఘకృతిని మొదటఁ బఠింపవలెనని తాత్పర్యము.

మురారి తనకృతియందు విశేషపదజాలమును బ్రయోగించెను. బహునిఘంటుపరిశీలనముగాని యీతనికృతి బోధపడదు. ఈ విషయమున గూడ మురారికిని మాఘునకును సామ్యము గలదు. మాఘమును దొమ్మిదిసర్గములవఱకుఁ బఠింపుచో నిఁకఁ గ్రొత్త పద ముండఁబోదని సూక్తి.-'నవసర్గగతే మాఘే నవశబ్దో న విద్యతే'.

ఇందువలనఁ గూడ ననర్ఘరాఘవమును జదువఁదలఁచినచో మొదట మాఘమును జదువవలె నందురు. కవితాప్రౌఢినిబట్టి చూచినను మాఘమును బఠించి, పిమ్మట మురారికృతిని బఠింపవలె నందురు.

౬. 'శ్లో. యైర్బోధాయనసూక్తిపుష్పకలికాః కర్ణావతంసీకృతాః
యేషాం బిల్హణసూక్తిమౌక్తికసరాః కణ్ఠానలంకుర్వతే
మాధుర్యైకభువాం మురారివచసా మాస్వాద యైః స్వాదిమా
సంతుష్యన్తి త ఏవ నూతనసుధావేణీషు వాణీషు నః '.

అని సుకుమారకవి 'రఘువీరచరితనాటకము' నఁ బ్రస్తావనలో నుడివియున్నాఁడు [1] దీనిని బట్టి మురారికవిత మధురమధురమైనట్లు సుకుమారకవి యభిప్రాయముగాఁ దెలియుచున్నది.

౭. శ్లో. సుకవిహితమురారిబోధముద్రః
విలసదగస్త్యమహోవికాసిబాణః
విలసతిభువి శారదావతారో
విహితమయూరవిజృమ్భణో విచిత్రమ్. '

అని రాజచూడామణిదీక్షితులు తన 'కమలినీకలహంస' నాటికలో మురారిని బేర్కొనియున్నాఁడు.

౮. 'శ్లో. హృదయాకలితాశేషశబ్దశాసనసంవిదః
మురారే రిహ శబ్దార్థతత్త్వం కో వేద తద్వద. '

అని హరిహరపండితుఁడు 'అనర్ఘరాఘవ' వ్యాఖ్యలో [II అ. 812 పు] నుడివియున్నాఁడు.

ఆంధ్రకవులు గూడ ననేకులు మురారిని బ్రస్తుతించియుండిరి. వారి ప్రశంసలలో నొండు రెండు—

౧. కాకమాని మూర్తి: 'రాజవాహనవిజయము' 1 ఆ.

చోరు నలంక్రియావిహృతిసొంపు, మయూరుని సౌకుమార్యమున్
భారవి కాంతిసంపదయు, బాణు గుణాఢ్యతరప్రయోగమా
దారి మురారి కోమలపదంబు ప్రసాదముఁ, గల్గునట్లుగా
భారతి యిచ్చుఁగాతఁ బ్రతిభారతి మత్కృతికిం జమత్కృతిన్. '

1. బోధాయనుని 'భగవదజ్జుకము' ను దెలిఁగించి తాము వ్రాసిన పీఠిక [4 పు] లో శ్రీయుతులు వేటూరి ప్రభాకరశాస్త్రి చరణులు.

ఇట్లు మురారికోమలశబ్దప్రయోగము, ప్రసాదగుణమును జెప్పఁబడినవి. (విష్ణువువిషయమున నైనచోఁ బైపదములకు మృదుపదములు, ననుగ్రహము నని యర్థాంతరము.) మురారికవిత మాధుర్యగుణాన్వితమను సుకుమారకవివాక్యము నిదివఱకే చూపి యున్నాము. రుచిపతి 'నిద్రాత్యాయాహ', 'విరమతి' (అ. 1.2.) అను శ్లోకములకు వ్యాఖ్య వ్రాయుచు వీనిలోఁ బ్రసాదమను వాక్యార్థగుణము కలదని యిట్లు వ్రాసియున్నాఁడు:

'అనయోః పద్యయోః ప్రసాదనామా వాక్యార్థగుణః. తథా చ సరస్వతీ కంఠాభరణే- యత్తు ప్రాకట్య మర్థస్య ప్రసాదః సోఽభిధీయతే.'

ప్రసాదమనఁ బద్యమైనను గద్యమైనను జదివిన వెంటనే యర్థస్ఫురణమగుట. ఇది యుత్తమకవితాలక్షణములలోఁ బ్రధానమైనది.

'శ్లో. సా కవితా సా వనితా । యస్యాః శ్రవణేన దర్శనే నాపి
కవిహృదయం యువహృదయమ్ । సరళం తరళం చ సత్వరం భవతి'.

దేనిం జదువఁగానే కవిహృదయము సరళమగునో యదియే కవిత్వము. కాని మురారికవనము బహుశాస్త్రసంప్రదాయప్రచురమగుటచేఁ బెక్కుస్థలముల దుర్బోధముగా నుండునని చెప్పకతీరదు.

౨. అయ్యలరాజు నారాయణకవి: 'హంసవింశతి', I. ఆ.

తే. * * ధ్యానబద్ధమురారి మురారి గాత్రి
పటువిభారవి భారవిఁ బ్రస్తుతింతు । సర్వశబ్దార్థవిజ్ఞానసరణి కొఱకు.'

3. చెళ్ళపిళ్ళ నరసకవి: 'యామినీపూర్ణతిలకావిలాసము.'

తే. దండి భవభూతి భవభూతి పండితాచి । ర ప్రసన్నమురారి మురారి'

ఇందు మురారికవిత పండితబోధ్యమని చెప్పఁబడియున్నది.

౪. రామరాజభూషణుఁడు: 'నరసభూపాలీయము' I ఆ. 15 ప.
'మురారి శయ్యనేర్పు'—అనియితని శయ్యాకౌశలముఁ జెప్పెను.

## 6. మురారి—సుభాషితగ్రంథములు.

మురారిశ్లోకము లనేకములు సుభాషితగ్రంథములలో నుల్లేఖింపఁబడియున్నవి. దీనివలన నాయాగ్రంథములు రచింపఁబడుకాలమున కీతనికవన మనినఁ బండితలోకమున నెంతయాదరము గలదో తెలియఁగలదు. వీనియం దుదాహృతములగు శ్లోకములఁ జూపినచోఁ బాఠభేదము లెట్లున్నవో తెలియును. వారెంచిన శ్లోకములఁబట్టి నాఁడు పండితలోకమున నభిరుచు లెట్లున్నవో విశదమగును. కాని గ్రంథగౌరవభీతిచే మురారినాటకమున లేక, సుభాషితగ్రంథములఁ గన్పట్టు శ్లోకముల నుదాహరించి, తక్కిననానిసంఖ్య మాత్రము చూపెదను.

(అ). క్రీ. శ. 12 వ శతబ్దికంటె నవీనము కాని 'కవీంద్రవచనసముచ్చయము' నందు మురారిశ్లోకములు 9 యుదాహరింపఁబడియున్నవి.

IVఅ. 3,6 శ్లో. V అ. 6. శ్లో. VII అ. 80,81,82,90,107 శ్లో.

'శ్లో. వన్దే భుజభ్రమితమన్దరమథ్యమాన। దుగ్ధాబ్ధిదుగ్ధకణవిచ్ఛురితచ్ఛవీకమ్
నక్షత్రతకచ్ఛురవియత్ప్రతిరోధినిన్ద। దున్నిద్రకైరవతడాగ ముకో మురారేః' 29. శ్లో.

ఇట మురారి తనపేరు నినుద్ఘుకొనెను

(ఆ). లక్ష్మణభట్టాంకోలకరుని 'పద్యరచన' యందు 3 శ్లోకములు మురారికృతములుగా నున్నవి:

౧. అనర్ఘ. V అ. ౨0 శ్లో. ౨ 'శ్యామాశతణ్డులవిలోప'.

౩ 'శ్లో. కించిత్కోపకలాకలాపకలనాహంకారబిభ్రద్భ్రవో
ర్విక్షేపా దకరో దసౌ రఘుపతి ర్జ్యాకూపతేః పత్తనమ్
క్రిన్దత్స్ఫేరు రటత్కరేటు విచటద్ద్వారు స్ఫుటద్గుగ్గులు
ప్రక్రీడత్కపి నిఃశ్వసత్ఫణి రణఝ్ఝిల్లి భ్రమద్ద్వీపిచ'.
—పద్య ర. XIII. 21. [శా. ప. 4070]

(ఇ). వేణీదత్తుని 'పద్యవేణి' లో 1 శ్లోకము.

సంగ్రామాఙ్గణ మాగతే దశముఖే' (VII తరంగము, 1 శ్లో.) ఇది 'పద్యరచన' యందు భానుకరున కారోపితము.

(ఈ). గదాధరభట్టు: 'రసికజీవనము' న 30 శ్లోకములు.

అనర్ఘ: I అ. 2,11,29,54 శ్లో. II అ. 2,3,5,30,51. ['అఃసర్వతః' అను శ్లోకము మైసూరుప్రతియందు (294 పు.) అధికముగాఁగలదు.]

III అ. 5 శ్లో. IV అ. 1,2,20,32,33,35,37,52 శ్లో. V అ. 49 శ్లో. VI అ. 48 శ్లో. VII అ. 39,79,81,115. (నిర్ణయసాగరప్రచురణమున 79 వ శ్లోకమునకుఁ బిమ్మట నధికపాఠములుగా నొసంగఁబడిన రెండింటిలో 'గీయన్తే యది' అనునది కూడ నిందుఁగలదు.)

మురారికారోపితములగు నీక్రిందిశ్లోకము లనర్ఘరాఘవమునఁ గానరావు.

౧. 'కాళిన్ది బ్రూహి' (20 పు.) ఇది 'సదుక్తికర్ణామృతము'న (III. 1,2. 187 పు.) ధిత్తిపున కారోపితము.

౨. 'దేవం వాచమ్' (222 పు.)

3. 'శ్లో. తాత త్వం నిజకర్మణైవ గమితః స్వర్గం యది స్వస్తి తే
బ్రూమస్త్వేకమిదం కథాప్యాది కథాం తాతాన్తికే మా కృథాః
రామోఽహం యది తద్దినైః కతిపయైః వ్రీడానమత్కన్ధరః
సార్ధం బన్ధుజనైః సురేన్ద్రవిజయీ వక్తా స్వయం రావణః' (205 పు.)

౪. 'శ్లో. వీరోఽసౌ కిముపర్ణ్యతే'-ఇది 'శార్ఙ్గధరపద్ధతి' యందు బిల్హణున కారోపింపఁబడియున్నది.

(ఉ). శార్ఙ్గధరుని 'శార్ఙ్గధరపద్ధతి' యందు 12 శ్లోకములు.

అనర్ఘ. III అ. 5,41 శ్లో. IV అ. 18,37,52 శ్లో. VII అ. 74, 80,81, 115 శ్లో. మురారికృతియందుఁ గానరానివి 3 శ్లోకము లిందున్నవి.

(ఊ). శ్రీధరదాసుని 'సదుక్తికర్ణామృతమున' 31 శ్లోకములు.

అనర్ఘ. II అ. 29, 78 శ్లో. III అ. 1,54 శ్లో. V అ. 20 శ్లో. VII. అ. 38, 43, 61, 79. 114, 115 [నిర్ణయసాగరప్రచురణమున 79 వ శ్లోకమునకుఁ దరువాత నధికపాఠములుగా నున్న 'అద్య స్వర్గి', 'గీయతే యది'-అను రెండు శ్లోకములును గూడ నింకుదాహృతములు.]

(ఋ). భట్టగోవిందజిత్తు : 'సభ్యాలంకరణసంయోగశృంగారము' లేక 'సారసంగ్రహసుధార్ణవము'- 6 శ్లోకములు.

అనర్ఘ. II అ. 1,5,52,75 శ్లో. III. అ. 7 శ్లో. VII. అ. 115 శ్లో.

(ౠ). హరికవి : 'సుభాషితహారావళి'-7 శ్లోకములు.

అనర్ఘ III అ. 5 శ్లో. VII అ. 49, 53, 80, 114 శ్లో.

(ఌ). వల్లభదేవుఁడు : 'సుభాషితావళి'-5 శ్లోకములు.

అనర్ఘ. II. అ. 2 శ్లో. IV. అ. 12 శ్లో. V. అ. 23 శ్లో. VI. అ. 6 శ్లో. VII. అ. 79 శ్లో.

(ౡ). జల్హణుఁడు : 'సూక్తిముక్తావళి'-68 శ్లోకములు.

"అనర్ఘరాఘవము" న లేని శ్లోకములఁగూడ నాటింటి నీతఁడుదాహరించియున్నాఁడు. అందొకటి-

శ్లో. పురా పాశ్రేయశైలోఽయ మస్మి న్మకరకేతవే।
మృతసంజీవనీ దుగ్ధా మహౌషధి రజాయత ॥

## 7. మురారి - సాహిత్యవాఙ్మయము.

జయరథుఁడు : 'అలంకారవిమర్శిని'[1] లోను, హేమచంద్రుఁడు 'కావ్యానుశాసనవివేకము'[2] నను, రామచంద్రసూరి 'నాట్యదర్పణము'[3] నను, శారదాతనయుఁడు 'భావప్రకాశము'[4] నను

1. (75. పు=II. 9; 76 పు. = IV. 6.) 2. (17పు=I. 58; 174 పు=I. 400.) 3. (193 పు.) 4. (233 పు.)

పండితరాయలు 'రసగంగాధరము'[1]న, భానుదత్తుఁడు 'రసతరంగిణి'[2] లోను, సర్వజ్ఞసింగభూపాలుఁడు 'రసార్ణవసుధాకరము'[3] నను, విశ్వనాథకవిరాజు 'సాహిత్యదర్పణము'[4] నను, అచ్యుతరాయలు, 'సాహిత్యసారము'[5] నను మురారినాటకము నందలి శ్లోకముల నుదాహరించుకొని యున్నారు. ‡

## 8. శబ్దశాస్త్రము, నిఘంటువాఙ్మయము

మురారి వ్యాకరణశాస్త్రమును గూలంకషముగ వ్యాపనము చేసెను. ఈతని నాటకమును జదివిన, శబ్దశాస్త్రమర్మము లనేకములు విశదమగును. ఇట్టి మర్మము లనేకములకు వ్యాకరణశాస్త్రకారులు మురారిప్రయోగముల నుదాహరణములుగాఁ జూపిరి.

ఉజ్జ్వలదత్తుఁడు 'ఉణాదిసూత్రము*' న మురారిప్రయోగములఁ గొన్నిటిఁ జూపెను. భట్టోజీదీక్షితులుకూడ సిద్ధాంతకౌముదిలో వ్యాకరణచమత్కారములకు మురారికృతినుండి యనేకప్రయోగముల నుల్లేఖించి యున్నాఁడు. శబ్దశాస్త్రపరిమళము నాఘ్రాణింపక, వ్యాకరణమర్మభూయిష్ఠమును గంభీరమును నగు తన కృతియందు గుణదోషవిచారము నొనర్పఁదగదని మురారి యిట్లు చెప్పుకొనియున్నాఁడు:

---

1. (388 పు.) 2. (44 పు.) 3. (72 పు.=V. 44, 45; 83 పు.=V. 7 261-62 పు.=I. 25, 26; 266 పు.=I. 1; 274 పు.=I. 21.)
4. (278 పు.=I. 1.) 5. (183 పు.=IV. 32; 184 పు.=IV 86; 329 పు.=I. 23; 437 పు. 'దేవీం వాచ ముపాసతే' అను శ్లోకమనర్ఘరాఘవము లోనిది దని పేర్కొనఁబడెను.)

‡ సాహిత్యప్రపంచమున సార్వభౌముఁడగు మురారి యేలకో యాలంకారికులచే విశేషముగాఁ బ్రమాణీకరించుకొనఁబడలేదు. భోజుఁడు మొదలగు సుప్రసిద్ధ సాహిత్యవేత్తలు మురారి శ్లోకములఁ బేర్కొని యుండలేదు.

* (1) IV. 171.= IV. అం. 69 శ్లో. (2) V. 19 = II. అం. 83

" శ్లో. సముదీర్ణలతూన్నక్తస్తబకమకరన్దైః శ్రవణయో
రవిశ్రమ్యద్ధారాసవన ముపచిన్వన్తు కవయః
న శబ్దబ్రహ్మోత్థం పరిమళ మనాఘ్రాయ చ జనః
కవీనాం గమ్భీరే వచసి గుణదోషౌ రచయతు.' (VII అ. 151.)

' శ్లో. యే శబ్దశాస్త్రనిష్ణాతాః యే శీలితనిఘంటవః
తేషా మే వాధికారోఽస్తి మురారికృతనాటకే. '

అను సూక్తి యించుకమార్పుతో హరిహరదీక్షితుని వ్యాఖ్యావసానమునఁ (IV అ. 526 పు.) గలదు. శబ్దశాస్త్రమున జితశ్రములై, నిఘంటువులు జిహ్వాగ్రమునఁ గలవారికే మురారికృతిని జదివెడి కధికారము గలదని భావము. ' హంతా దాశ్కృష్టానాం కతిపయపదానాం రచయితా ' అనునట్లు ప్రయోగభ్రష్టములై, నిఘంటువులయందే లభించు మాఱుమూలపదముల నీతఁడు ప్రయోగించె ననఁజనదు. అపారమగు సంస్కృతపదజాలము నధిగమించిన వశ్యవాక్కగుటచేఁ దాను ప్రయోగించు నేపదమును నీతనికి దుర్బోధమైనట్లు తోఁచదు. మఱియు విద్వత్కవులకు స్వకృతుల యందుఁ దమ పాండితీప్రౌఢిని జూపవలెనని కుతూహలము మెండుగా నుండును.*

## 9. మురారి వైదుష్యము.

మురారి వ్యాకరణ సాహిత్య మీమాంసా మంత్రశాస్త్రాదుల య్యందుఁ బ్రవీణుడని యాతనికృతివలననే విశదమగుచున్నది.

---

*సర్వానందుఁడు, లింగాభట్టును ' అమరకోశమునకు ' దాము రచించిన వ్యాఖ్యలలో మురారిప్రయోగముల నుదాహరించుకొనియున్నారు. రాయముకుటుఁడు గూడ ' అమరకోశవ్యాఖ్య ' (II.8-38) లో ' ఐషీకమస్త్ర మధికృత్య తదా తమస్థ్నా ' అను మురారిశ్లోకపాదము (II. అ- 83) నుదాహరించుకొనెను.

కాళిదాసు, భవభూతి, శ్రీహర్షుఁడు, వేదాంతదేశికులు, వేంకటాధ్వరి, మొదలగు సంస్కృతసాహిత్యనిర్మాతలు కావ్యనిర్మాణముననేఁ గాక, వివిధశాస్త్రపరిజ్ఞానమునఁ గూడ నిరంకుశప్రచారము గలవారు.

ఈతని వ్యాకరణశాస్త్రపరిజ్ఞానము: వ్యాకరణసాంప్రదాయములఁ జమత్కారముగఁ గావ్యముల నిముడ్చుట కాళిదాసు నుండియుఁ గన్పట్టుచున్నది.

'శ్లో. రామాదేశా దనుగతా సేనా తస్యార్థసిద్ధయే।
పశ్చా దధ్యయనార్థస్య ధాతో రధి రివాభవత్' (రఘు. XV. 9.)
ఇట్లే రఘు. XII. 58; XI. 56; కుమార. II. 27;
కిరాతార్జునీయము, XIII. 19; మాఘము. X. 15.

మురారియుఁ బాణినిసూత్రములఁ దనకృతియందు జమత్కారముగఁ గూర్చియుండెను

'జని కర్తుః ప్రకృతిః' అను సూత్రమును 'జయతి జనికర్తుః ప్రకృతితా.'[I అ. 58.] అనుచోటఁ బ్రయోగించెను. ఇట్లే 'శ్లో. పరిక్రప్తుకర్త్రభిప్రాయక్రియాఫలవతో విధీన్ ప్రయుఞ్జానాః', [II. 86] అనుచోట 'స్వరిత జితః కర్త్రభిప్రాయే క్రియాఫలే, అను సూత్రమును, 'స్థానివద్భావేఽపి కుత్ర కార్యం నజహాతి' [IV. 151 పు.] అనుచోట వ్యాకరణశాస్త్రసంకేతమగు స్థానివద్భావమును, 'శ్లో. కుర్యుశ్చ స్త్రీకథా మమిా యది మనోర్వంశే' [IV. 44.] అనుశ్లోకమున వైయాకరణప్రసిద్ధమగు వాకృతిగణమును, జొప్పింపఁబడినవి.

'తద్ధితమూఢో వైయాకరణ స్తద్ధితమూఢోఽవైయాకరణః' అనునట్లు శాబ్దికులకుఁ దద్ధితప్రయోగమునందు వ్యామోహమధికము. అందునను, 'ప్రియతద్ధితా దాక్షిణాత్యాః' అను న్యాయమున, దాక్షిణాత్యకవులగు మురారిమొదలగు వారికృతులు తద్ధితప్రయోగప్రచురములుగఁ గానవచ్చును.

ఉదా :-ఐణేయ్యాం త్వచి, [78. పు] త్రైశఙ్కవం చరితమ్ [82 పు.] ఐషీక మస్త్రమ్ [189] త్రైయమ్బకం కార్ముకమ్. [115.] ఇట్లనేకములు గలవు.

'యదధికరణం ధర్మస్థీయం తత్రైవ వచాంసినః' [93 పు.] ఇటు మీమాంసా పరిభాషయు, 'చతురక్షరోऽపి రాక్షసశిక్షాసిద్ధమన్త్రః' [66 పు.] ఇటు మన్త్రశాస్త్రపరిభాషయు నుపయోగింపఁబడియున్నవి.

'బిభ్రతీం కైశికీం వృత్తిమ్' [702 పు.] అను శ్లోకమున సాహిత్యశాస్త్రపరిభాష కనఁబడుచున్నది.

## 10. మురారికృతులు-అనర్ఘరాఘవము.

ఇక్కవి బహుశాస్త్రజ్ఞుఁడైనను, తత్కృతులలో ననర్ఘరాఘవ మొక్కటియే మనకు లభించినది. మైసూరుప్రతిలో నాటకాంత గద్యమున (920 పు.) 'సమాప్తమిదం మౌద్గల్యాన్వయస్య భట్ట మురారేః కృతి రనర్ఘరాఘవం నామ నాటక' మ్మని కలదు. దీనివలన నీతఁడు బహుగ్రంథములు నిర్మించినట్లును, నం దీనాటక మొకటి యనియుఁ దెలియుచున్నది

సాహిత్యగ్రంథములయందును, సుభాషితగ్రంథములయందును మురారికృతములుగఁ గనవచ్చు శ్లోకము లనేకము లీనాటకమునఁ గన్పట్టుటలేదు. అందువలన నీశ్లోకములుగల మురారికృతు లేవియైన నుండవచ్చునని యూహింపఁజనును. 'బెరిడేల్ కీత్' పండితుని 'సంస్కృతవాఙ్మయచరిత' మను బృహద్గ్రంథమున (412 పు.) మురారి యొకసంస్కృతనిఘంటువు రచించినట్లు కలదు. ఈతఁడు మన కవియే కావచ్చును. ఈనడుమ యస్. కే. రామనాథశాస్త్రి వర్యులు మురారిమిశ్రుని 'త్రిపాదీనీతినయన' మను నొకదర్శన గ్రంథమును బ్రచురించిరి. ఈగ్రంథకర్తయు మనకవియు భిన్నులా, కారా, యనువిషయము విచారణీయము.

'మురారే స్తృతీయః పన్థాః' అను సూక్తి పూర్వమీమాంసా దర్శనమునఁ బ్రసిద్ధులగు కుమారిలభట్ట ప్రభాకరుల భాట్టప్రాభాకర ప్రస్థానములకంటె విలక్షణమగు మార్గమున రచింపఁబడిన యీ గ్రంథమును దత్కర్తను సూచించును గాని మనకవిని సూచింపఁ జాలదని శ్రీశాస్త్రిపరఁగులు తత్పత్రికయందు వ్రాసియున్నారు.[1]

ఈనాటకమునకు 'అనర్ఘరాఘవ' మను నామ మన్వర్థముగా నున్నది. అనర్ఘ మనఁగా నమూల్యము, పూజ్యము. పూజ్యుఁడగు రాఘవుని కథ యిట వర్ణింపఁబడుటచే నిది యెంతయు సమంజసము. ఈయనర్ఘతకు హేతువు కవియే యిట్లు నుడివియున్నాఁడు. మీయాజ్ఞను దలఁదాల్చుట హేతువుగా మా రఘుకులమున 'ననర్ఘత' కల్పాంతము విలసిల్లుఁగాక' యని దశరథుఁడు విశ్వామిత్రునితో రామ లక్ష్మణులఁ బంపునపు డనును. ('ఏతాభి స్తవ * * అనర్ఘతా రఘుకులే కల్పాంత ముర్మీలతు'. I అ. 34.) విశ్వామిత్రుఁడు శ్రీరాముని దీసికొనిపోవు కథ మొదలు శ్రీరామపట్టాభిషేకమునవఱకుఁ గల కథ యేడంకములలో నిందు వర్ణింపఁబడి యున్నది. కథ పెద్దదియు నాటకము చిన్నదియు నగుటచే ననేకకథావిశేషములు రంగముపైఁ జూపు వీలు లేక విష్కంభాదులలోఁ బాత్రలచేఁ జెప్పింపఁబడవలసి వచ్చినవి.

I. అం. 'మునీంద్రసంవాదము.' విశ్వామిత్రుఁడు దశరథునియొద్దకు వచ్చి రామలక్ష్మణులఁ గొనిపోవుట యిందలికథ. 59 శ్లోకములు.

II అం. 'కౌమారవిక్రమము'. రాక్షసులను సంహరించి విశ్వామిత్రుని యజ్ఞమును సంరక్షించుట. శ్లోకములు 87. భవభూతి యుత్తరరామచరితమున V. అం. 'కుమారవిక్రమ' నామకము.

1. '*Journal of Oriental Research*' Vol. II, Part iii-iv. [July- Oct. 1928, Madras]. Pp. 266-78.

III. అం. 'పినాకభంగము.' శివధనుస్సును ద్రుంచుట. శ్లో. 61.

IV. అం. 'జశరథవిప్రలంభము.' శ్రీరాముని పరశురాము సమాగమము, పరశురామగర్వభంగము నిందు వర్ణింపఁబడియున్నవి.

'శ్లో. జేతారం దశకన్ధరస్య' [VII. 146.] అను శ్లోకమునఁ జెప్పఁబడినట్లు దశకంఠుని జయించిన కార్తవీర్యార్జునుని నోడించిన పరశురాముని, బాలకుఁడయ్యు శ్రీరాముఁడు జయించె ననుచో శ్రీరాముని విజయకథ సమాప్తి నొందినట్లే. పరశురాముని జయించుట రావణుని జయించుటను సూచించుచున్నది. ఉత్తరకథ శ్రీరాముని యందలి గౌరవముచేతను, జగదానందముకొఱకును రచింపఁబడిన దఁట. ఇట్లే మన యాంధ్రీకర్తలును నీ నాలుగంకములవఱకుఁ బూర్వార్థమును దెలిఁగించియుండిరి. శ్లోకములు 69.

అం. 'సుగ్రీవాభిషేకము.' శ్లోకములు 55.

VI. అం. 'దశగ్రీవనిగ్రహము.' శ్లోకములు 84.

VII. అం. 'నాయకానందము.' శ్రీరామాదులు విమానమునెక్కి యయోధ్యకు వెళ్ళుచుఁ గ్రిందఁ గనఁబడు పట్టణాదుల వర్ణించుట. శ్రీరామపట్టాభిషేకము. శ్లో. 152.—మొత్తము 567 శ్లోకములు.

వీరరసప్రధానమగు నీనాటకమునందలి వస్తువు భవభూతి మహావీరచరితమునందలి యితివృత్తమును జాలవఱకనుసరించి యుండును. భవభూతికృతిని మించవలె నని మురారి తనకృతిని రచించిన ట్లీనాటకమున నుదాహరణము లనేకములఁ జూపనగును. ఉత్తరరామచరితానుసరణములు గూడ నిం దెడ నెడఁ గానవచ్చును. మురారికంటె భవభూతియం దొకవిశేషము: మహావీరచరితము

మాట యిటుంచి, యుత్తరరామచరితము కొలఁదిమార్పులతోఁ బ్రదర్శనయోగ్యము కాఁగలదని చెప్పవచ్చును. మురారికృతి యున్నదో నాటకరూపమునను న్న యతిప్రౌఢమగు శ్రవ్యకావ్యము. గురుముఖమున వ్యాఖ్యాసాహాయ్యముననే దీనిఁ బఠింపవలయును.

స్వర్గత 'కళాప్రపూర్ణ' వేదము వేంకటరాయశాస్త్రిపాదుల సమాలోచన[1] మిటుఁ గనఁదగును. 'భవభూతికృతనాటకములను వ్యాఖ్యాతలకన్న అనుకర్తలే చక్కఁగా గ్రహించినారు. * * మహావీరచరితమును వీరరాఘవునిపేషికన్న మురారి చక్కఁగా గ్రహించినాఁడు. ఇందులకు నిదర్శనమును 'అపి తాటకారిః' అను దానిపై మదీయవిమర్శవినోదభాగమునం గనవచ్చును. పరశురామాభియోగమును వీరచరితయందుం గని బాలరామాయణానర్ఘరాఘవ ప్రసన్నరాఘవాదులందు తత్కర్తలు నిబంధించుకొనిరి. ఇతని యొరవడి దొరకిన తర్వాత పూర్వరామచరితము నధికరించి పలువురు రామనాటకములను రచించినారు. * * వీరందఱును వశ్యవాక్కులే. ఇందఱిలోను అనర్ఘరాఘవకారుఁడు మురారి పాండిత్యపరమోచ్చపదంబున దీపించుచున్నాఁడు. పరశురామాభియోగములో భవభూతిని మించినాఁడు'.

కథాసంవిధానమున మురారి భవభూతి ననుకరించె ననుట కొండు రెండుదాహరణములు:

౧. గురుధనుర్భంగమునకుఁ గుపితుఁడై పరశురాముఁడు రఘురాము నెదుర్కొనుటయే రెండునాటకముల సమానమే. 'మహా

1. ఉత్తరరామచరితనాటకమునకు నుపోద్ఘాతము, ౧౧ పు.

వీరమున 'మాల్యవత్ప్రేరణమున భార్గవుఁడు శ్రీరామునెదుర్కొనెను. అనర్ఘమున శివధనుర్భంగమునవలన నుగ్రుఁడై పరశురాముఁడు శ్రీరాము నెదుర్కొనెను.

పరశురామాభియోగప్రకరణమున మురారి భవభూతిని మించెనని శ్రీ వేంకటరాయశాస్త్రిగారనిరి. ఇట్టి యభిప్రాయమునే 'కీత్' పండితుఁడును, 'విల్సన్' పండితుఁడును వెలిపుచ్చిరి. కాని శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిలవారు 'సంస్కృతవాఙ్మయ చరిత్ర' [II సం. 376పు.] లో నేలకో 'చతుర్థాంకములోని రామ జామదగ్న్యసంవాదము చదువునపుడు వీరముకంటె హాస్యము ముందు కనఁబడును. ఈవిషయమున భవభూతికంటె నితఁడెక్కువ చూపిన చాతుర్యము కనరాదు.' అని వ్రాసియున్నారు. కాని యిది సమంజసముగఁ జూపట్టదు.

౨. మహావీర: ఒరునితో యుద్ధముచేయుచున్న వాలిని రాముఁడు చెట్టుచాటునుండి సంహరించె ననుచో మహావీరుఁడగు

1. 'The following scene [IV Act.] shows us Rama and Parasu-rama in verbal contest; Rama is even more polite than in the *Mahavira-carita* which is obviously imitated, while the friends of Rama carry on a vituperative dialogue behind the scene without actually appearing.' [*Sanskrit Drama*, P. 228.]

2. 'The next scene introduces Parasu-rama, in the same strain as the *Mahavira-carita*, but more extravagantly. Rama's humility is more excessive, and the other characters carry on a vituperative dialogue with Parasurama without appearing, speaking successively from behind the scenes.' [H. H. Wilson: *The Theatre of the Hindus*, Vol. II.]

రాముని యుదాత్తతకు భంగము వాటిల్లును. అట్లు కాకుండుటకై వాలిరాములకు ద్వంద్వయుద్ధము కల్పింపఁబడినది. 'ఉదాత్త రాఘవము' న మాయురాజకవి కూడ వాలివధావసరమున నిట్లే శ్రీరాముని యపప్రథను దొలఁగించెను. అనర్ఘమునను వాలి రాముల ద్వంద్వయుద్ధము కల్పింపఁబడెను.

3. మహావీర: రావణసంహారానంతరము రామాదులు విమానముపై లోచనలోభనీయములగు దృశ్యముల నవలోకించుచు నయోధ్యకరుదెంచిరి. భవభూతిని మించు నుద్దేశముతో 'అనర్ఘమున' నీసన్నివేశము కూడఁ గూర్పఁబడినది. 'బాలరామాయణము' న దశమాంకమున దీనికిఁ బ్రతిబింబము చూపట్టుచున్నది. ప్రసన్నరాఘవకారుఁడు కూడ వీరి ననుసరించెను.

మురారికృతియందలి లోపములు: ఇంచుమించుగా నొక శతాబ్దమునకుఁ బూర్వము సంస్కృతనాటకవాఙ్మయమును గూర్చి వ్రాయఁబడిన 'విల్సన్' పండితుని గ్రంథరాజమునుండి మురారి నాటకవిమర్శము సారము నవలోకింపఁ జనును: "అనర్ఘమున స్వభావోన్మీలనము గాని, చేష్టితము (చలనము) గాని, హృదయావర్జకములగు కథాసన్నివేశములు గాని, కౌతుకోద్దీపనము గాని లేకపోవుటచే నాటకీయదృష్టిని బరిశీలించుచో దీనియం దుత్కర్ష మృగ్యమని చెప్పవలెను. కావ్యదృష్టిని జూచినను నెక్కడనో కాని కవితాకల్పనములు గానరావు; ఆ కొలఁదికల్పనలైనను సుదీర్ఘములు రసవిహీనములు నగు సామాన్యవిషయవర్ణనల నడుమను, నసంగతభావనల మాధ్యమునను, నపరిమితములగు నతిశయోక్తులలోనను నిగూఢములగు నితి

హాసములయందును మఱుఁగుపడియున్నవి. అట్లయ్యు, నుత్తమకవితా సురభిళములగు కాళిదాస భవభూతుల కృతులున్నను, నేఁటి పండిత లోకము దీనిని దలఁదాల్చుచున్నది. దీనికి హేతువులు వీరిలో సామాన్యముగఁ జూపట్టు రసజ్ఞతాలోపము, రసాపకర్షయు నన వలెను. నేఁటి భారతీయు లెంతసేపును గవియొక్క శయ్యను విమర్శించుటయందే తమ సమాలోచనమును వినియోగింతురు కాని భావనలవైపు దృష్టిని బోనీయరు. భావనానైర్మల్యమునుగాని, రసమాధుర్యమును గాని, కల్పనౌజ్జ్వల్యమును గాని నిర్ణయించు ప్రజ్ఞ వీరి యెడ మృగ్యము. మురారి భావములవలెనే యాతనిభాషయుఁ బ్రశస్యము కానేరదు. కాని యిందొక గుణము గలదు: బహుశ్రమతో జాగరూకతతో రచింపఁబడిన కావ్యములలో నిది యగ్రగణ్యము. దుర్గ్రాహ్యము లైనను సమావేశమున శ్రుతిసుఖావహములగు నీతని పదములరచనను జూచుచో నీతఁ డెంతటి కఠోరవ్యవసాయ మొనర్చి దీనిని నిర్మించెనో, సంస్కృతభాష యితని కెంత విస్మయజనకముగ వశమయ్యెనో తెలియఁగలదు. దీనికి ఫలమేమన నీకృతియం దెక్కడను బ్రసాదగుణము లేకపోవుటయే. కూలంకషముగ వ్యాసంగ మొనర్చినఁ గాని యీనాటక మామూలాగ్రముగ బోధపడునని చెప్పుటకు వీలులేదు. [V అ.] రావణుఁడు సీతను హరించుట చూచి జటాయు వాతని వెంబడించును. మొత్తముమీఁద నీ పట్టున భాష సరళముగాను సుబోధముగాను నున్నది; కాని యిటఁ గవితావైభవమేమియుఁ గానరాదు. ఎడనెడ వర్ణనలు గలవు. కాని యిట్టి సందర్భముననే భవభూతి కృతియందలి వర్ణనలం జూచినచో మురారిపద్యములు దివిటియొద్దనున్న దీపములవలె నుండును. 'మహావీరము' న

నున్న జటాయుసంపాతుల సంవాదమునకు మురారిలోని జటాయు జాంబవంతుల సంలాపము ప్రతిధ్వనివలెఁ జూపట్టును. దానిని జూచి దీనిని జూచినచో రాజును జూచిన కన్నులతో మొగుని జూచి నట్లుండును'. * * * * "

'విల్సన్' పండితుని యీ సమాలోచనము నవీనపాశ్చాత్య దృష్టిని బట్టి చూచినచోఁ గొంతవఱకు నుచితముగానే యున్నది. కాని భారతీయసహృదయులదృష్టి కీవిమర్శము సముచితముగఁ గన్పట్టదు. నిష్పాక్షికముగ నాలోచించిన 'ననర్ఘమున' నాటకత్వయోగ్యత బహుస్వల్పము. ఇందలి కావ్యత్వమాలోచింతుమా- దేశకాలపరిచ్ఛేదమున కతీతులైన వాల్మీకి భాస కాళిదాస భవభూత్యాది మహాకవుల కృతులకుఁ బిమ్మట గణింపఁదగి, జీవము, జవము గలిగిన కావ్య 'మనర్ఘము'. అతిశయోక్తులందుమా— సంస్కృతకావ్యములఁ గల సామాన్యదోషమే యిది. ఈలోపము మురారి జీవించియుండిన కాలమునకుఁ జెందును గాని కేవల మీతనికిఁ జెందదు. ప్రాచ్యులును పాశ్చాత్యులును నభిరుచులలో విలక్షణులు. అందువలన వీరికి హృదయంగమముగఁ జూపట్టునది వారికి రుచింపదు. వారికి హృదయావర్జకమైనది, వీరికి నీరసముగా నుండవచ్చును.

## 11. అనర్ఘరాఘవము—ఆంధ్రీకరణములు.

'అశేషమనీషిహృదయంగమంబుగా, శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుర్తించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారము భూషించియు, నౌచిత్యం బాదరించియు, మాతృకానుసారంబున,' రచింపఁదగు నని శ్రీనాథుఁడు 'శృంగార

నైషధము' నం [VIII. ఆ. 202 వ.] జెప్పియున్నాఁడు. ఈసూత్రము నుత్తమమైన యనువాదమునకు నాదర్శముగాఁ గైకొనఁదగును. ఈలక్షణములన్నియు మన యాంధ్రకృతియం దెంతవఱకు నొప్పియున్నవో చర్చించుట యావశ్యకమైనను నవకాశము లేకుండుట చేతను, శతవధానులు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిచరణు లీవిషయమును విపులముగఁ జర్చించియుండుటచేతను నొండు రెండు విషయములు మాత్ర మిట ముచ్చటింపఁబడును.

గురుకులవాసమున మురారినాటకమును గఠోరముగ వ్యాసంగ మొనరించి శుద్ధాంధ్రభాషయందుఁ జక్కని జ్ఞానము నార్జించినఁ గాని బ్రహ్మశ్రీ పండిత వ్యాసమూర్తిశాస్త్రి పాదులయాంధ్రీకరణము నుబోధము గాఁజాలదు. వారికృతి మూలమునఁ గల సొగసులను, శాస్త్రసంప్రదాయములను గలిగియుండి, వేంకటశాస్త్రులవారిచేఁ బ్రౌఢ మనఁబడినను, వారనినట్లు కావ్యమున ముఖ్యగుణములలో నొకటి యగు ప్రసాదగుణ మందు బహుస్వల్పము. పద్యములు ధారావాహికముగాఁ బ్రవహిఁపక యడుగడుగునకును గుంటువడుచుండును. శ్రీ కామేశ్వరకవిగారి కృతియం దీప్రసాదగుణము సుప్రచురముగ నున్న దనవచ్చును. సామాన్యముగ వీరికృతియందు సంస్కృతకవి హృదయము సులభముగ గోచరించును.

'ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితం'—రసోత్తరమైన కావ్యమున కౌచిత్యము జీవితము వంటిది—అని సాహిత్యవేత్తల యభిప్రాయము. 'అనౌచిత్యాదృతే నాన్య ద్రసభఙ్గస్య కారణమ్'- అనౌచిత్యముకంటె రసభంగహేతువు వేఱొకటి లేదందురు. శ్రీ కామేశ్వరకవిగా రనౌచిత్యమును బరిహరించి యౌచిత్యమును బాటించిరి.

ఆధునికులదృష్టిలోఁ గటికుచాదివర్ణన లసభ్యములుగ నెంచఁబడును. అందువలన నట్టిశ్లోకముల నేడింటిని రావుగారు మూలమునఁ జేర్పక, యనుబంధమున ననువాదములతోఁ జూపియుండిరి.

విశ్వామిత్రుని శిష్యులపే ర్లశ్లీలార్థద్యోతకములుగా నుండుటచే వీరు 'వక్రినాసుఁడు, హ్రిస్వబాహుఁడు' అని మార్చిరి. వ్యాసమూర్తిశాస్త్రిలవారు పెద్దవాఁడు, పిన్నవాఁడు నని మార్చిరి.

ఇఁక మురారిభావములతోఁ దత్పూర్వులభావములకు, నవీనుల భావములకుఁ గల సామ్యమును జూపుటకును, నాంధ్రీకరణములలోఁ బరస్పరతారతమ్యమును జూపుటకును దిఙ్మాత్రముగఁ గొన్ని యుదాహరణము లొసఁగఁబడును-

I. 1. శ్లో. 'దేవీం వాచ ముపాసతే హి బహవః'—మురారి.

2. శ్లో. 'అంబు న్యంబునిధే రనన్యగతిభి ర్నీతైః కియ ద్గమ్యతే
క్లేశేనాపి కియ ద్వ్యలంఘి రభసోత్తుంగైః ప్లవగేశ్వరైః
విజ్ఞాతా కియతీ పునః క్షితిభృతా మంథేన గంభీరతా
కిం తైః కేశవపాదుకాగుణమహామ్భోధే స్తటస్థా వయమ్.'
శ్రీవేదాంతదేశికులు : 'పాదుకాసహస్రము.' [3. ౧3 శ్లో.]

II. 3. శ్లో. 'నిష్ప్రత్యూహామ్ ** నాభీపల్వలపుండరీకముకుళః.' మురారి [1.౧]

4. శ్లో. 'నాకే న స్పృహ మన్య దన్యదపి వా తన్నాభినాళీకినీ
నాళీకస్పృహణీయసౌరభముచా వాచా న యాచామహే.'
శ్రీవేదాంతదేశికులు: 'రహస్యత్రయసారము,' [17 అధి. ౨౨3 పు.]

5. మ: 'ఏవి నాభీసరసీరుహంబు దగసామ్యశ్యంబు నొందించె న
ద్ధవిశాపార్ధనిమీలనంబుల గదాధార్యత్వఘు లూరార్చ జ
కక్కువల న్వెన్నెలపుప్పుల స్దనుప దత్కుంబైన తేజోప్ర్వ న
య్యావి మా కీప్సితవిఘ్నభూధరకులేందాస్త్రంబులై గావుతన్.'
—వ్యాసమూర్తిశాస్త్రిలవారు. [౨ పు.]

6. శా. 'శోకానీకము చొక్కఁ, వెన్నెలపులుంగు లెక్కఁ, జ్యోతిష్మద్గా
లోకంబు ల్వెలయించి సావిడఁ బుపొల్పున్ సాముమోదమ్పొన్చి నా
భీకాసారసితాబ్జకోశమును నిల్పెన్ శంఖముల్లెద్ది యా
శ్రీకాంతావదనక్షియుగ్మము నెదన్ సేవింతు విఘ్నమ్ముఱన్.'
—కామేశ్వరకవిగారు (3 పు.)

శ్రీమద్వేదాంతదేశికులకు మురారికవితయందు వ్యామోహ మధికము. తత్కవితాచ్ఛాయలు దేశికులకృతులయం దనేకములు గలవు. 'అహో, సకలకవిసార్థసాధారణీ ఖల్వియం వాల్మీకీయా సుభాషితనీవి' [అనర్ఘ. 10 పు.] ఇందలి 'సుభాషితనీవి' యను సమాసమును శీర్షికగాఁ గొని దేశికు లొకకృతిని రచించిరి.

III. 7. శ్లో. 'యదిక్షుణ్ణం పూర్వైరితి' —మురారి [1 అ. ౬ శ్లో.]

8. శ్లో. 'స్వసూక్తీనాం పాత్రం రఘుతిలకమేకం కలయతాం
కవీనాం కోదోషః స తు గుణగణానామవగుణః
యదేతైర్నిశ్శేషై రపరగుణలుబ్ధై రివ జగ
త్యసావేక శ్చక్రే సతతసుఖసంవాసవసతిః.'
—జయదేవుఁడు: ప్రసన్నరాఘవము.' [1. ౧౨.]

9. చ. 'మునుపటివారు వాడి నదె, పో యని వీడిన రామసత్కథ;
న్గొనము లెసఁగునే నరునకు న్భువి నన్యున కిన్ని యెన్న; మా
నినఁ దమ సాహితీపటిమ నేర్పు రెటుల్ ప్రకటింపఁ గీర్తిచే
తను దివి నింపఁ జెంద గుణధన్యపదార్థపరుల్గ కవీశ్వరుల్.'
—ఆకుండివారు. [౮ పు.]

10. ఉ. 'వాడిరి పెక్కురంచు రఘువర్య పవిత్రవిచిత్రసత్కథన్
వీడినచో నిఁకెన్నఁ బృథివీస్థలి నిన్నిగుణమ్ము లన్యుఁడే
వ్వాఁడు వహించి మించు? మతి వారల చారుగభీరవాక్తతిం
బోఁడిమిఁ జూపనోపు రెటు? పూర్ణగుణాళిపరుల్ కవీశ్వరుల్.'
—సత్యవోలువారు. [౧3 పు.]

11 ఉ. 'తొంటి బుధాళి, రామవిభుఁ దోరముగా వినుతించె నంచుఁ దా
మంటక మానినన్ జగతి నట్టి గుణోజ్జ్వలుఁడైన నాయకుం
డుంట ఘటిల్లునే కవుల కొప్పగు వాగ్విభవంబు తల్ప నే
వెంట భజించు ధన్యతను వీరు కృతార్థత గాంచుటెట్లొకో.
—శ్రీయుత్ మేడేపల్లి వేంకటరమణాచార్యులవారు.

12. ఉ. 'తొల్లిటివారు రామకథ తొంబది రీతుల వ్రాసిరంచుఁ దా
రొల్లర యేని రామునకు నుజ్జిగ నాయకుఁ డెందుఁ గల్గునే
సల్లలితప్రభామధురసంపదుదారగభీరవాణి యె
ట్లుల్లసిలున్ గవీశ్వరులు నొందెద రెట్లు కృతార్థభావమున్.
—కవిరాజు వల్లాది వేంకట విశ్వనాథశర్మగారు.

IV. 13. శ్లో. 'జాతాః పక్వపలాండుపాండుమధురచ్ఛాయా ' మురారి. [2. ౨]
శా. 'జాతాపక్వపలాండు పాండిమ* ధరచ్ఛాయం గనెన్ దారలు
ద్యూతిం బైకొనెఁ బ్రాచి కొన్ని కిరణంబుల్ పద్మినీవాతువుల్
లూతాతంతువితానవర్తులనభోలోలాత్మబింబంబుతోఁ
శ్రాంతఃప్రోషితరోచియై డిగియెఁ దారానాథుఁ డస్తాద్రికిన్.'
—చిజ్జుళ తిమ్మభూపాలుఁడు.

14. శా. 'ఆమె స్పందిన వెల్లయుల్లి జిగి హృద్యంబు ల్లునాఁ దారకల్
సేయునొమ్మల్వఁగఁ దూర్పుఁ గొన్నిరుచు లాజీవాపదు ల్దమ్మికిన్
బాయన్వెల్గుల సాలెగూఁడు గుడుసొప్ప స్ఫింబముద్దాల్పుచు
న్బోయె జ్జందిట మింట నస్తశిఖరమ్ముం దాఁకఁగా వేకువన్.'
—వ్యాసమూర్తిశాస్త్రులవారు. [౧౭. పు]

15. శా. 'చుక్కల్ పక్వపలాండుపాండురతరాంశుల్ క్రక్కెమున్ బ్రాచిఁ బం
పెక్కెన్ దమ్మికి జీవనౌషధములౌ నీవేరుముల్ స్వాంశువుల్
సుక్కెన్ గుండ్రనిసాలెపట్టునదువై సాంపేమబింబానన నీ
చక్కన్ వేకువ నింగినుండి శశి యస్తాగ్రంబున్ జేరుమున్.'
—కావేశ్వరకవిగారు. [౫౭. పు]

* 'పాండుమధుర' ?

V. 16. శ్లో. ‘ ఉద్దామద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాఙ్గలతటీనిష్కూజకోయష్టయః’ మురారి [2 3.]

17. శా. ‘ మాళింగోమాళి సంఘటించినక్రియన్ మధ్యాహ్నవేళన్ మహా
కాశం బైననభోవిభాగమున వీఁకం గాసె బీరెండ యా
ప్రాలేయాహితసంప్రదీప్తకిరణప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టియై.’
శ్రీనాథుడు: ‘ హరవిలాసము ’ [7. ఆ. ౧౦౯ ప.]

18. శా. ‘ వ్రాలెన్ దిక్కుల భానుభావ్యతికరప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టులై’.
శ్రీనాథుడు: ‘ క్రీడాభిరామము. ’ 52 పు.

పై శ్లోకమునకు ఆకుండివారు సత్యవోలువారు వ్రాసిన పద్యములను గూర్చినచర్చ చెళ్ళపిళ్ళవారి యుపోద్ఘాతమునఁ గననగును. [8.9 పు]

VI. 19. శ్లో. ‘ తీర్త్వా భూతేశమౌళిస్రజమ్ * *
వ్యామగ్రాహ్యస్తనీభిః శబరయువతిభిః (మురారి 5. అ ౨ శ్లో.)

శ్రీనాథునకు మురారికృతి యనినఁ బ్రాణము. పలుతావుల మురారివచనముల నీతఁడు పుడికిపుచ్చుకొని యున్నాఁడు. ఈతని ‘ వ్యామగ్రాహ్యస్తనీభిః ’ అను పదబంధమున శ్రీనాథునకు వ్యామోహ మెక్కుడు. పెక్కుతడవ లీతఁడీపదమును దన కృతులయందు వాడెను. [చూ. ‘ శృంగారనైషధము ’, 8 ఆ. ౯౭ ప; కాశీఖండము. ౪ ఆ. ౫౩ ప; ‘ హరవిలాసము ’ 5 ఆ. ౩౨ ప; ‘ క్రీడాభిరామము ’ 86 పు. ప్రభాకరశాస్త్రిగారి ప్రతి-‘ శివరాత్రిమాహాత్మ్యము. ’ (క ఆ. ౭౭ ప.)

VII. 20. శ్లో. ‘ మహీభృతః పుత్రవతోఽపి దృష్టి
స్తస్మిన్నపత్యే న జగామ తృప్తిమ్
అనంతపుష్పస్య మధోర్హి చూతే
ద్విరేఫమాలా సవిశేషసఙ్గా. కుమారసం’. [1. ౨౭.]

21. శ్లో. ‘ సాధారణో రఘూణాం
గురుర్గృహస్థోఽపి విశేషదృష్టిస్తే
నామోదయతి కిమిందుః
కుముదం పునరస్య సర్వస్వమ్.’ మురారి [1. ౧౬.]

22. క. 'దొరగ రఘున్నృపుల కెల్ల
న్గురుఁడయ్యు విశేషదృష్టి గూరుచు నీపై
ధరణి నలరింపఁ జేది చం
దురుఁ డీతని కగును దెల్లఁ దొగ సొత్తెల్లన్.' శాస్త్రులుగారు [౪ పు.]

23. చ. 'సరిగొని మీరఘుప్రవరసంతతి కంతకు నొజ్జ యయ్యుఁ దాఁ
గర మనురక్తి గౌరవముఁ గాంచుచు నీయెడ సంతతంబు, నా
నరయఁగఁ జందురుండు ముద మందఁగఁ జేయనిదద్ది యైన నా
మరచిరకైరవ మ్మతనిసొమ్మఖిలమ్మయి నెమ్మి గాంచదే.'
-రావుగారు [౧౬ పు.]

VIII. 24. శ్లో. 'పాత్రవిశేషే న్యస్తం గుణాన్తరం వ్రజతి శిల్ప మాధాతుః
పయ ఇవ సముద్రశుక్తౌ ముక్తాఫలతాం పయోదస్య.'
-'మాళవికాగ్నిమిత్రము.' [1 అం. ౬. శ్లో.]

25. శ్లో. 'అథోపనీతం విధివ ద్విపశ్చితో, వినిన్యు రేనం గురవో గురుప్రియమ్
అవధ్యయత్నాశ్చ బభూవు రత్ర తే, క్రియా హి వస్తూపహితా ప్రసీదతి.'
-'రఘువంశము' [3. ౨౯.]

26. శ్లో. 'వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథా జడే
నతు ఖలు తయోర్ జ్ఞానే శక్తిం కరో త్యపహన్తి వా
భవతి చ తయో ర్భూయా న్భేదః ఫలేప్రతి త ద్యథా
ప్రభవతి శుచి ర్బిమ్బగ్రాహే మణి ర్న మృదాదయః?'
-భవభూతిః 'ఉ. రా. చ.' [2 అం. ౪. శ్లో].

27. శ్లో. 'చీయతే బాలిశస్యాపి సత్ క్షేత్రపతితా కృషిః
న శాలేః స్తమ్బకరితా వప్తుర్గుణ మపేక్షతే.'
-విశాఖదత్తుఁడు: 'ముద్రారాక్షసము' [1 అం.]

28. శ్లో. 'స్థానేషు శిష్యనివహైః.' — మురారి. [2. ౯.]
ఈశ్లోకమునకు శాస్త్రులవారి యనువాదము [వారి కృతిలో 21 పు.]
రావుగారి యనువాదము [73 పు.] చూడునది.

IX. 29. శ్లో. 'భూయస్తరాణి యదమూని' —మురారి [2. ౮౧.]

30. తే. 'ప్రిమరతములు చీఁకటిరాత్రుల, నివి
ప్రివిరళంబులు వెన్నెలరాత్రుల నవుఁ
గనుక మినుమూస సంజవిచ్చునఁ గరంచి
చుక్కలని పోఁతపోసె నీ శుభ్రకరుని.' వ్యాస. [3౫పు.]

31. ఉ. 'ఎన్నొయుగముల్ దమస్వినుల, నిన్నియె వెన్నెలరేల, నుంటఁ గ
న్గొన్నవు డాయుడు వ్రిజముఁగూడను జేరిచి సాంధ్యవహ్నిచే
విన్నమమూసలోఁ గఱగి వేధ నిశిన్నిశిఁ బెంచుచుండునో
యి న్నలినారి నంచు మదినెంచఁగ నయ్యెడు మాకుఁ జూడఁగన్.
—రావుగారు. [౧౧౮ పు.]

గ్రంథవిస్తరభీతిచే నింతటితోఁ బద్యముల నుదాహరించుటమాని సాదృశ్యముగల ప్రాచీనకవులరచనలను, మురారిశ్లోకములను, నవీనులపద్యములను దిఙ్మాత్రముగ సూచించెదము.

| మురారి. | ఇతరకవులు. |
|---|---|
| ౧. 'జటాంధత్రే' [4. ౨౭.] | 'పిత్ర్యమంశమ్.'-[రఘు. 11. ౬౪.] |
| | 'జ్యోతిర్జ్వాలా'-[మహావీర. 2. ౨౬.] |
| ౨. 'సవిధ ముపసరణ'- [4. ౨౮.] | 'అన్విష్యతః'-[మహావీర. 2. ౩౧.] |
| 3. 'ఆదేష్టా భగవాన్'-[4. ౨౯.] | 'ఉత్పత్తిః'-[మహావీర. 2. ౩౯.] |
| ౪. 'వ్యసనే పతితే'-[5. ౧౫.] | 'వజ్రాదపి కఠోరాణి'- [ఉ. రా. చ. 2.౭.] |
| ౫. 'శంభో రాధారమ్'- [8. ౫౦.] | 'సముత్క్షిపన్'-[మాఘము. 1. ౫౦.] |
| ౬. 'వరం తాదృక్'-[8. ౫౨.] | 'ప్రభు ర్బుభూషుః'-[ - 1. ౪౯.] |
| ౭. 'మఘోనః'-[3. ౪౦.] | 'తస్యాన్వయే'.[రఘు. 6. ౪౧] |
| ౮. 'కేరలీచికురభంగిభంగురం'.[2.౨౫.] | 'ధుమ్మిల్లం కోవ నాలీ ద్మహురలకలతా లాసయ త్యేకరలీనామ్.' ['కావ్యమీమాంస'-100 పు.] |
| భీమేశ్వరస్తుతి [7. ౧౦3-౫] | భీమేశ్వరస్తుతి [రాజశేఖర 'బాలరామాయణ' తిరుపతివేంకటకవుల తెనుఁగు. 10 అం.౯3పు.] |

౧౦. 'గిరిశే నారార్ధం'-[8. 3౨.] 'ఏతత్తద్దుర్విగాహమ్' [ప్రసన్న. ౩. ౩౦.]
౧౧. 'పీయూషాశ్రవణమ్'-[7. ౮3] 'ఏతత్లోకే' [,, 2. 3౬.]
౧౨. 'యద్యేవ ముపయుజ్యమాన మిద్ధ్రిసానా ముపేక్ష్య సుగంధేనోపయోక్ష్యమాణేన సంధిరితి వక్రః ఖల్వయం పన్థాః' [205.] 'ధిక్కృత్యైవ దశాస్యదర్పదమనం ధీశాలినం వాలినం'-[వేంకటాధ్వరి. 'విశ్వగుణాదర్శము'. 37 పు.]

## 12. ప్రకీర్ణకము.

(అ.) అనర్ఘరాఘవము — ముద్రితప్రచురణములు :—

౧. కలకత్తాప్రతి: (నాగరి) ప్రేమచంద్రుని టీకతో. (1860)

౨. కలకత్తాప్రతి: (నాగరి) జీవానందవిద్యాసాగరసంస్కృతము.

3. మద్రాసుప్రతి: (నాగరి ?) [1870]

౪. బొంబాయిప్రతి: (నాగరి, నిర్ణయసాగరప్రచురణము) రుచిపత్యుపాధ్యాయుని టీకతో (1908).

౫. తంజావూరుప్రతి: (నాగరి) మ. మ. లక్ష్మణసూరి 'ఆకర' వ్యాఖ్యతో. (1902).

౬. మైసూరుప్రతి: (తెలుగు). రామానందాశ్రమముని 'ఇష్టార్థకల్పవల్లి'-విష్ణుభట్టు 'పంచిక'-హరిహరదీక్షితుల 'అనామిక'లతో (1907).

(ఆ.) మురారి వ్యాఖ్యాతలు, వ్యాఖ్యలు : అముద్రితములు-

౧. వ్యాఖ్యాతపేరు. ? (బొంబాయిప్రతిలో చేర్కొనబడెను.)

౨. త్రిపురారి. 3. ధనేశ్వరుడు. ౪. నరచంద్రసూరి. ౫. పూర్ణసరస్వతి ౬. మిశ్రభవనాథుడు. ౭. లక్ష్మీధరుడు. [=రామానందాశ్రమముని ?] ౮. హరదత్తుడు.

ముద్రితములు :-౯. ప్రేమచంద్ర తర్కవాగీశుఁడు.

౧౦. రామానందాశ్రమముని. [=లక్ష్మీధరుఁడు?] ౧౧. రఘుపతి.

౧౨. లక్ష్మణసూరి. ౧౩. విష్ణుభట్టు. ౧౪. హరిహరదీక్షితులు.

(ఇ.) 'అనర్ఘరాఘవము'న కాంధ్రకృతులు :

౧. చిజ్జుళ తిమ్మభూపాలుఁడు. (క్రీ. 1700 ; పద్య-ముద్రిత.)

౨. కూచి సత్యనారాయణకవి. (ప్రబంధ ; అముద్రిత.)
[శ్రీమంత్రిప్రగడ భుజంగరాయాంకితము.]

౩. కురుగంటి సూర్యనారాయణశాస్త్రి. (నాటకము; అము.)

౪. కవిరాజు మల్లాది వేంకటవిశ్వనాథశర్మ. ( „ „ )

౫. ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రి. (నాటక. ముద్రితము.)

౬. సత్యవోలు కామేశ్వరరాయకవి. ( „ „ 1-4 అం.)

(ఈ.) ఈ వ్యాసరచనమునఁ బరిశీలింపఁబడిన ప్రతులు-

౧. అనర్ఘము, ప్రసన్నరా., ఉ. రా. చ. మహావీర., సాహిత్యదర్పణము, అలంకారవిమర్శిని, రసగంగాధరము, కువలయానందము. [నిర్ణయసాగరప్రకటనములు.]

౨. రసార్ణవసుధాకరము (తిరువనంతపురప్రకటన.)

౩. కావ్యమీమాంస (బరోడాప్రతి.)

ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యుఁడు, యం.ఏ.,
అధ్యక్షుఁడు: 'ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు',
ఆంధ్రగీర్వాణభాషోపన్యాసకుఁడు,
పిఠాపురరాజకళాశాల.

కాకినాడ,
15.9.1936.



శ్రీ

# అనర్ఘరాఘవము



## — జగదీశ్వరస్తుతి —



చ. సకల చరాచరేశ్వరుఁడసంగుఁ డెవండొ యతండె దైవ మే
టికి నిఁక నన్యదైవముల డెబ్బదికోట్లఁ దలంచి వారి వా
రికి వివిధాకృతుల్ వివిధరీతులు వృత్తులు సొమ్ము లెమ్మెలుఁ
సకలమునుందు లెంచి నుతిసల్పఁ? బరాత్పరుఁడొక్కఁడేయనన్॥



శ్రీరస్తు.

# భట్టమురారిప్రణీతే - అనర్ఘరాఘవే

## ప్రథమోఽంకః.



శ్లో॥ నిష్ప్రత్యూహ ముపాస్మహే భగవతః కౌమోదకీ లక్ష్మణః।
కోకప్రీతిచకోరపారణపటుజ్యోతిష్మతీ లోచనే ।
యాభ్యామర్థవిబోధముగ్ధమధురశ్రీ రర్థనిద్రాయితో ।
నాభీపల్వలపుండరీకముకుళః కంబో స్సపత్నీకృతః॥



శ్రీ

# అనర్ఘరాఘవము

## ప్రథమాంకము.

శా. కోకానీకము చొక్క వెన్నెలపులుంగు ల్మెక్క జ్యోతిష్మదా
లోకంబు ల్వెలయించి సావిడుపుపొల్పున్ సాము మోడ్పొన్చినా
భీకాసారసితాబ్జకోశమును నిల్పెన్ శంఖము ల్లెద్ది యా
శ్రీకాంతావరునక్షియుగ్మము నెదన్ సేవింతు విఘ్నమ్మడన్. 1

పాఠాంతరములు:—

ఉ. కోకముదాస్పదంబును జకోరకపారణపూరణంబు నా
నాకృతిదీప్తి నర్ధహాసనార్ధనిమీలనముల్ ఘటించి, నా
భీకమలంబుఁ గంబు వనిపించెడి వెన్నుని కన్నుదోయి శో
భాకరలీల నేలుత నపారకృపారస పూరమై మమున్.

మ. ఘనమా మోదము సాదమున్ గొని రథాంగంబుల్ చకోరంబు లే
పునఁ బొంగంగని నాభిపల్వల సితాంభోజాతపుఁగుట్మలం
బున కొక్కేతరి నర్ధబోధ మునమోడ్పుంగూర్చి కంబూపమం
బును గావించిన వెన్నుకన్నుగవ యోమున్ మమ్ము విఘ్నమ్ముగన్

చ. బలుప్రమదం బపారమగు పారణ చక్రచకోరకాళికా
వెలుగులయేపుసూపి యరవిప్పరమోడ్పు ఘటించి నాభిప
ల్వలవరపుండరీకముకుళంబును గంబుసమంబుఁజేయు శ్రీ
చెలువుని కన్నుదోయి గనఁజేయుత హాయి నిరంతరాయమై.

అపిచ,

వ॥ విరమతి మహాకల్పే నాభీపద్మైకనికేతన
త్రిభువన పురశ్శిల్పీయస్యప్రతిక్షణ మాత్మభూః
కిమధికరణం కీదృక్కస్యవ్యవస్థితి రిత్యసా
వుదరమవి శద్ద్రిష్టుంతస్మై జగన్నిధయేనమః॥

పాఠాంతరము— 2

వ॥ విరమతిమహాకల్పేనాభీకద్మైకని కేతన।
త్రిభువనపునశ్శిల్పీయస్య ప్రతిక్షణమాత్మభూః
కిమధికరణం కీదృక్కస్యవ్యవస్థితి రిత్యభూ
దుదరమివసంద్రష్టుం తస్మై జగన్నిధయే నమః॥
నాంద్యంతే సూత్రధారః॥

భోభోలవణోదధివేలావవాళీతమాలకందళ్యస త్రిభువనమాలి

సీ. కోకసంతతుల కస్తోకమై తగు ప్రీతి
యును జకోరవ్రజంబున కపార
పారణయు నొసంగఁబటువు లౌ వెలుఁగుల
పూన్కిచే నర్ధవిబోధితమును
నర నిమీలితమును నయినిల్చునటు ఘటిం
పుచు నాభిపల్వలపుండరీక
ముకుళంబు శంఖంబుపోలిక వహియింపఁ
గల్పించి యభిరామ కలనచేఁ జె

తే॥ గీ. లంగు దాని గామోదకీలక్ష్మినలరి
యతిశయిలు భగవంతునిద్దై నదాని
నాయతశ్రీయుతాత్యద్భుతాక్షియుగిని
మోదమలర నిర్విఘ్నమున్గాఁ దలంతు.

మఱియును

మ॥ ఘనకల్పమ్మునఁ గ్రిమ్మఱన్ ద్రిజగముల్ గల్పింప నాభీపదం
బున వర్తింపు చనుకృణమ్మొవని పెన్బ్రజ్ఞన్ బ్రవేశించితి
న్గాని యేదెందెటులుండు నేదిమొదలంచున్నాను లోనూను శం
కను వీడు న్విధి యాజగన్నధికెడన్ గై మోద్పుగావించెదన్. 2

పాఠాంతరము—

తే॥ గీ॥ సృష్టికల్పాంతమునఁ బునస్సృష్టినొదవు
శంకలఱనేని గర్భంబుసారెజూడ
ననువనియొ నాభిపధమునం దధివసించె
నాజగద్గర్భునకు నతులాచరింతు.

మండనమహానీలమణేః కమలాకుచకలశకేళి కస్తూరికాపత్రాంకురస్య భగవతః పురుషోత్తమస్య యాత్రాయాముపస్థానీయా స్సభాసదః- కుతశ్చిద్ద్వీపాంతరాదాగతేన కలహకందళనామ్నా కుశీలవాపశదేన రౌద్రభీభత్సభయానకభూయిష్ఠంకమపి ప్రబంధమభినయతా నిత్యంకిలాయ ముద్వేజితో జీవలోకః-తత్ కస్యచిదభిమతతరసభాజః ప్రేక్షణికస్య ప్రయోగానుజ్ఞయా నాట్యవేదోపాధ్యాయ బహురూపాంతేవాసీ మధ్యమదేశీయ స్సుచరితో నామ భరతపుత్రోహం భవద్భిరనుగ్రాహ్యః॥

శ్లో॥ ప్రీతిర్నామ సదస్యానాం।
ప్రియా రంగోపజీవినాం।
జిత్వా తదపహర్తార।
మేవ ప్రత్యాహరామి తాం॥ 3

గ॥ (ఆకాశే కర్ణందత్వా) కింబ్రూథ-, వైదేశికో భవా నసమగ్రపాత్రః కథమీదృశే కర్మణి ప్రగల్భత ఇతి (విహస్య సప్రశ్రయమంజలింబధ్వా-) హంత భోః కిమేవముదీర్యతే భవద్విధానామారాధనే ప్రవృత్తిరేవ మే పాత్రాణి సమగ్రయిష్యతి॥

యతః

శ్లో॥ యాంతిన్యాయప్రవృత్తస్య
తిర్యఞ్చోపి సహాయతామ్।
అపన్థానంతు గచ్ఛంతం
సోదరోపి విముంచతి॥ 4

(నాందియైన తరువాత.)

సూత్ర—పూర్వవనధివన-జాలంబునకు మొలకతమాలంబును భువనజాలంబునకు మకుటేంద్రనీలంబును నగు నీ జగన్నాథదేవుని సేవింపవచ్చిన సభ్యులారా! కొండొక ద్వీపాంతరమునుండి వచ్చిన కలహకందళుండును కుశీలవాధముఁ డొకఁడు రౌద్రబీభత్సభయానక భూయిష్ఠంబగు నెద్దియో ప్రబంధమునుబ్రయోగించి లోకమును మిగుల వ్యాకులపెట్టెను గావున నిపుడు మీకందఱకు నానందంబుగ నుండు రసములతో నలరు నాటకమును బ్రదర్శింప సెలవిడి నాట్యవేదోపాధ్యాయునికి బహురూపాంతేవాసినై మధ్యమదేశమునుండి వచ్చిన "సుచరిత" నామకుఁడనగు నన్ను ననుగ్రహింతురు గాక!. ఏమనిన,

తే. గీ. సకలసభ్యావళియు మానసమ్ములందుఁ
జెందు బ్రీతిని రంగోపజీవితతికిఁ
*బ్రియ మతిప్రౌఢిఁ దదపహారిని జయించి
యిదిగో! తత్ప్రతివ్యాహృతిగూర్చు నితఁడ కనుఁడు!.. 3

(ఆకసమునఁ జెవియొగ్గి)

ఏమనుచున్నారు? విదేశసుఁడవు నసమగ్రపాత్రుఁడవు నగునీవీ కార్యమెట్లు నెరవేర్తువనుచున్నారా?

(నవ్వి, వినయముతోఁ దోసిలిపట్టి)

అయ్యో! తామే యిట్లు సెలవిచ్చుచున్నారేమి? మీవంటి వారి నారాధించుటయే పాత్రముల సమకూర్చును. ఎట్లన,

కం॥ సంతసమున నగుఁ దిర్య।
గ్జంతువులును గూడఁ దోడు సన్మార్గునకున్।
సంతతధర్మవిహీనున్॥
వింతగ సోదరుఁడుఁ గూడ వీడుంగాదే! 4

*ప్రియము + అతిప్రౌఢియనియు, ప్రియ + మతి ప్రౌఢియనియు చదువనగును.

(పునరాకాశే కర్ణందత్వా)

కిం బ్రూథ। "తర్హి ప్రహితోయమస్మాభిః పత్రికా" ఇతి (ప్రవిశ్యనటః పత్రికాందదాతి, సూత్రధారోగృహీత్వా వాచయతి) యత్రసర్వపురుషార్థరసస్యందిని-

శ్లో॥ చేతశ్శుక్తికయానిపీయ శతశః శాస్త్రామృతాని క్రమా
ద్వాన్తై రత్నరమూర్తిభిః సుకవినా ముక్తాఫలైర్గుంభితాః।
ఉన్మీలత్కమనీయనాయకగుణగ్రామోపసంవల్గనా
ప్రౌఢాలంకృతయోలుఠన్తి సుహృదాంకంఠేషుహారస్రజః। 5

శ్లో॥ తస్మైవీరాద్భుతారంభ
గంభీరోదాత్తవస్తవే
జగదానన్దకన్దాయ
సందర్భాయ త్వరామహే॥ 6

[మరలఁ జెవియొగ్గి]

ఏమీ! "అట్లయిన నిదె మేము పత్రిక నంపుచున్నాము"ను చుంటిరా?

(నటుఁడు వచ్చి పత్రిక నిచ్చుచున్నాఁడు)

సూ—(పత్రికనందుకొని చదువుచున్నాఁడు)

సీ॥ మానసంబను వినిర్మలమహాశుక్తిచే
సకలశాస్త్రామృతసారములను
వేమారుఁ గవిసార్వభౌముండు లెస్సగాఁ
గడఁకతోడుతఁ గ్రోలి క్రమముమీర
నక్షరాకారత నలరారు నలచారు
ముక్తాఫలావళుల్ మొనసి కురిసి
కూర్పునేర్పు దలిర్ప రుతరచారుతా
కలితనాయకగుణగ్రామసీమ
తే॥ గీ॥ నెనయఁ జేసిన లసదలంకృతిత నెసఁగి।
మాననీయతరాచ్ఛోక్తిమాలికాళి।
నిరతము సుహృద్గళంబుల నీటుమీరఁ।
దనరు నెది సర్వపురుషార్థదాయి యగుచు॥ 5

అట్టి

కం॥ వీరాద్భుత సద్రస గం।
భీరంబు, నుదార మమిత విశ్వావనంబా।
ధారంబతి చారుకథా
పూరంబగు సత్ప్రబంధముఁ వినఁదగుఁ॥

సూత్రి [విమృశ్య, సహర్షస్మితమ్]

మారిష! రామాయణ మితిశృణోషి తత్ప్రభవతః
కవితావతారప్రథమతీర్థస్య వల్మీకజన్మనో మునేః
సరస్వతీనిర్యాసోయశశ్శరీర మిక్ష్వాకూణామ్

నటః—అథకిమ్?

సూత్ర—తత్ప్రతిబద్ధబన్ధానుబన్ధినీ పరిషదాజ్ఞా।

నటః—(విహస్య) అహో! సకలకవిసార్థసాధారణీఖల్వియం వాల్మీకీయా సుభాషితనీవీ!

సూత్రి... మారిష! కిముచ్యతే ?

శ్లో॥ అపికథ మసౌ రక్షోరాజస్తథా నక్తంచరో
మపికథ మభూ దిక్ష్వాకూణాంకులే గరుడధ్వజః।
అపికథ మృషౌ దైవ్యోవాచః స్వాంః ప్రచకాశిరే।
సుచరితపరీపాకః సర్వః ప్రబన్ధకృతా మయమ్॥ 7

తత్రితావన్నిరూపయామి రూపక మభినవ మీదృశమ్।
(ముహూర్త మివ స్థిత్వా। స్మరణమభినీయ। సోల్లాసమ్)
అస్తిమౌద్గల్యగోత్రసంభవస్య మహాకవే ర్భట్టశ్రీ
వర్ధమానతనూజన్మన స్తన్తుమతీనందనస్య మురారేః
కృతి రభినవ మనర్ఘరాఘవం నామనాటకమ్।
తత్ప్రయుఞ్జానాః సామాజికా నుపాస్మహేః

(విచిన్త్య సహర్షమ్)

సూత్ర- (విమర్శించి)

(సంతసముతోఁగూడిన చిరునగవుతో)

మారిష! కవితావతారమునకు మొదటి రేవుగ నొప్పు పూజ్యుఁడైన వాల్మీకిమహర్షి నుండి వెడలిన వచోనిచయములతో నొప్పుచు నిత్యోత్సుకులకుఁ గీర్తిశరీరమై యలరారు రామాయణ గ్రంథ మీావెటిఁగినదేగదా!

నటు—అవు నెఱుఁగుదును.

సూత్ర—ఆకథననుసరించిన నాటకమును బ్రదర్శింపుమని సభ్యుల యభిప్రాయము.

నటు—(నవ్వి) ఔరా! యీ వాల్మీకి సుభాషిత మల్లకవిజాలమునకును మూలధనమై యలరారుచుండునే!

సూత్ర—మారిష! అందులకు సందియమేమి?

ఉ॥ ఏటికి ముజ్జగాల నలయించెనొ యాదనుజాధినాథుఁ డ
ల్లేటికి మాధవుండు జనియించెనొ యారఘువంశమందు నా
డేటికెసంగెనో ఘనమునీశ్వర వాగ్వితతుల్ తమంత, ము
మ్మాటికదెల్ల సత్కవిసమాజము పున్నెపుఁ బాటయేసుమీా! 7

అందును మిక్కిలి చక్కనగు నొక్క రూపకమును నిరూపింతును.

(కొంచెమూరకుండి జ్ఞాపకము నభినయించుచు నుల్లాసముతో)

ముద్గలగోత్రోద్భవుండును దంతుమతీవర్ధమాన తనయుండును నగు "భట్టమురారి" మహాకవి రచించిన "యనర్ఘరాఘవ"మను నాటకమును బ్రదర్శించి సభ్యులను సంతోషపెట్టుదును.

(యోచించి సంతోషముతో)

అహాో! రమణీయాఖల్వియం సామగ్రీ
పరిషదారాధనస్య। యతః।

శ్లో॥ మద్వర్గ్యా రసపాఠగీతిగతిషు ప్రత్యేక ముత్కర్షిణో।
మాద్గల్యస్య కవే ర్గభీరమధురోద్గారా గిరాం వ్యూతయః।
ధీరోదాత్తగుణోత్తరో రఘుపతిః కావ్యార్థబీజం ముని।
ర్వాల్మీకిః ఫలతిస్మ యస్య చరితస్తోత్రాయ దివ్యాగిరః॥ 8

అయంతు ప్రాచేతసీయం కథావస్తు బహుభిః ప్రణీతమపి ప్రయుఞ్జా
నోనాపరాధ్యతిశోత్రియ పుత్రిః। పశ్య।

శ్లో॥ యదిక్షుణ్ణాపూర్వైరితిజహతి రామస్య చరితం।
గుణై రేతావద్భి ర్జగతిపునరన్యో జయతికః।
స్వమాత్మానం తత్తద్గుణగరిమగంభీరమధుర।
స్ఫురద్వాగ్బ్రహ్మణః కథముపకరిష్యంతి కవయః॥ 9

ఉపక్రమమాణశ్చసకవిః స్వనిర్భాసశబ్దబ్రహ్మణ మాచార్యం
ప్రాచేతసం గిరంచ దేవతా మేవముపశ్లోకితవాన్।

శ్లో॥ తమృషిం మనుష్యలోక।
ప్రవేశవిశ్రామశాఖినం వాచామ్।
సురలోకాదవతార।
ప్రాంతరఖేదచ్ఛిదం వన్దే॥ 10

శ్లో॥ ధాతుశ్చతుర్ముఖీకంఠ।
శృంగాటక విహారిణీమ్।
నిత్యం ప్రగల్భవాచాలా।
ముపతిష్ఠే సరస్వతీమ్॥ 11

ఆహా! నాకు గల సామగ్రి యంతయు మిక్కిలి చక్కనిదై సభ్యులనానందపెట్టుటకుఁ దగినదై యున్నది గదా! ఎట్లన—

శా. పారజ్ఞుల్ రసపారగీతిగతులన్ వర్గ్యాళియం దెల్లరున్,
చారూక్తిజ్ఞుఁడహో! మురారికవి, యీసత్కావ్యనిర్మాత, మున్
సారోక్తుల్ దగ వామలూరుజమహాసన్మానిబేర్కొన్న యా
ధీరోదాత్త గుణోత్తరుం డిన కులోద్భూతుండె వర్ణ్యుండిటన్॥ 8

పెక్కుఅచేఁ బ్రయోగింపఁబడిన వాల్మీకివిరచితంబయిన యీ రామకథనే మఱలఁ బ్రయోగించుటవలన నిక్కవికి పరాధమును లేదు.

ఉ॥ వాడిరి పెక్కురంచు రఘువర్యపవిత్ర విచిత్ర సత్కథన్
వీడినచో నికెన్నఁ బృథివీస్థలినిన్నిగుణమ్ము లన్యుఁ డె
వ్వాఁడు వహించి మించు? మఱి వారల చారుగభీరవాక్తతిం
బోడిమిఁ జూపనోపు టెటు? పూర్ణగుణాళిపరుల్ కవీశ్వరుల్॥ 9

గ్రంథారంభమున నిక్కవి స్వయముగ వెడలిన శబ్దబ్రహ్మము గల యాదికవియగు వాల్మీకిమహర్షిని, మరియు వాగ్దేవతను నిట్లు వర్ణించి యుండెను.

ఉ. నాకమునుండి మర్త్యభువనంబునకుం డిగివచ్చు వాణి క
స్తోకపథశ్రమాపనుతిఁ జూపఁగనోపి తదీయపూర్ణ సౌ
ఖ్యైకనిదానమై మిగుల నింపలరారు విశాలవిశ్రమా
నోకహమై చెలంగిన ఘనున్ ముని నాదికవి న్నుతింపుదున్. 10

కం. నలువనలుమొగములందగు
నల గళశృంగాటకంబునందుఁ దిరుగుటన్
బలుకుల నెలజాణాసనం
బలవడు నప్పలుకు కలికి ననయముఁ గొలుతున్. 11

నటః—(సహర్షమ్) భావ, తత్ప్రస్తూయతామ్। అస్య హి మహాద్గల్యానాం బ్రహ్మర్షీణా మన్వయమూర్ధన్యస్య మురారినామధేయస్య బాలవాల్మీకే ర్వాఙ్మయ మమృతబిందునిష్యన్ది కర్ణతల యతి కౌతుకం మే॥

సూత్ర—మారిష! స్థానే భవతః కుతూహలః ఈదృశమేవైతత్।
తథాహి॥

శ్లో॥ తత్త్రాద్య గుజ్జ్వలకకుత్స్థకులప్రశస్తి
సౌరభ్యనిర్భరగభీరమనోహరాణి
వాల్మీకివాగమృతకూపనిపానలక్ష్మీ
మేతాని బిభ్రతి మురారికవే ర్వచాంసి॥ 12

(నేపథ్యే గీయతే).

శ్లో॥ దినకర కిరణోత్కర్షః
ప్రతిజాగరః కోఽపిజీవలోకస్య।
కమలముకుళాంకపాళీ
గతమధుకరకర్షణావిసర్గః॥ 13

(ఆకర్ణ్య)

సూత్ర—కథ ముపక్రాంతమేవ నర్తకైః, యదియం దశరథోత్సంగా ద్రామభద్రాకర్షిణో విశ్వామిత్రస్య ప్రవేశికీధ్రువా॥

(పురోఽవలోక్య ససంభ్రమమ్)

అయే, కథమత్రైవ తత్రభవతః కమలయోనిజన్మనో మునే రాయతనా త్ప్రతినివృత్తేన ఋత్విజా వామదేవేన కిమపి తద్వాచి

నటు—(హర్షముతో) బావ! జాలమేల? వేగ ముపక్రమింతము. మున్గలాన్వయశిరోమణియు బాలవాల్మీకియు నగు మురారి కవిశేఖరునమృతోపమానములగు చక్కని వాక్కులు నాకు మిక్కిలి మక్కువను గలిగింపుచుండును.

సూ—మారిష! అగును. నీవేడుక యుక్తమే. అతని వాగ్ధోరణి యట్టిదియే.

కం. నిరుపమకాకుత్స్థయశ
స్సురభిళములు, ప్రథమసుకవిశుభవాగమృతా
కరరూపనిపానమ్ములు,
సురుచిరలముహో! మురారిసాబగుబలుకుల్. 12

(తెరలో ధ్రువాగానము చేయఁబడుచు)

కం. సరసతరం బతిసురుచిర
సరోజముకుళాంతపాళిసంగతమధులి
డ్వరకర్షణచణ మెద్దియొ
సరసిజహితకరము జీవజాగరమెసఁగున్. 13

సూత్ర—(విని) నర్తకు లాడనారంభించిరి, కాఁబోలును, దశరథు నంకమందుండు రామభద్రు నాకర్షించు విశ్వామిత్రు రాకను సూచించు ధ్రువాగానము వినవచ్చుచున్నది.

(ఎదుటఁజూచి తొట్రుపాటుతో)

ఇదిగో! దశరథమహారాజు పూజ్యుండును బ్రహ్మమానస పుత్రుఁడునగు వశిష్ఠు నాశ్రమమునుంచి తిరిగివచ్చిన ఋత్విక్కగు

కమభినీయమానో మహారాజో దశరథస్తిష్ఠతి తదేహి ! నన్వయో
స్తృతీయేన భవితవ్యమిత్యావామప్యనన్తరకరణీయాయ సజ్జీభ
వావః॥



(ఇతి నిష్క్రాన్తౌ)।

—* (ప్రస్తావనా) *—



వామదేవుఁడు చెప్పుచున్న గురుసందేశముల నాలకింపుచుఁ గూర్చున్నవాఁడు. కాఁబట్టి యిఁక నిచ్చ్వగున్నకడ మూడవవాఁడుండరాదు. రమ్ము! మనమును దానికగు ననంతర కరణీయములు సిద్ధము చేయుదము.

(వెళ్లుదురు.)

—: ఇది ప్రస్తావన :—



# అనర్ఘరాఘవే

—(౦)—

(తతః ప్రవిశతి యథోపదిష్టో దశరథో వామదేవశ్చ)

దశరథః॥— అహో! బహుధా శ్రుతమపి భగవతో వశిష్టస్యాను

శాసనం నవం నవమివ ప్రమోదమాతనోతి మామ్॥

వామదేవః॥

శ్లో॥ మధుకైటభదానవేంద్ర

ప్లవవిస్రామివమేన మేదినీం

అధివాస్య యదిక్ష్వాకుభిః

శ్చిరమేనాముపభుంజతేన రేంద్రాః॥ 14

దశ—(సవిమర్శస్మితమ్) సఖే! వామదేవ!

శ్లో॥ తస్యాజ్ఞయైవ పరిపాలయతో ధరిత్రీం

కర్ణోపకంఠపలితంకరణీ జరేయమ్।

యద్గర్భరూపమివ మాం మనుశాస్తి సర్వ

మద్యాపి తన్మయి గురుర్గురుపక్షపాతః॥ 15

వామ—మహారాజ! కిముచ్యతే? సమానవృత్తేరపి క్వచిదేవ కస్య

చిత్తాదృశా ప్రసాదమైశ్వరికమ్। తథాహి తత్రభవాన్।

శ్లో॥ సాధారణో రఘూణాం।

గురుర్భవన్నపి విశేషదృష్టిస్తే।

నామోదయతి కిమిందుః।

కుముదం పునరస్య సర్వస్వమ్ 16

# అనర్ఘరాఘవము

## — ప్రథమాంకము —

(తరువాత కూర్చుండిన దశరథ వామదేవులు ప్రవేశింతురు.)

దశ—ఔరా! పలుమారు వినియున్నదే యైనను బూజ్యుఁడైన యీ వసిష్ఠుని యాదేశము క్రొత్త క్రొత్తదియై సంతస పెట్టుచున్నది!

వామ—

ఉ॥ ఆమధుకైటభాసురులదా మొదటన్గను నామగంధియా ।
నామిషమే సుమీ, యరయ నాదిని మేదిని, గానదీనికిన్ ।
భూమిభుజుల్ నిజాచ్ఛతరభూరియశంబులచే సువాసనల్ ।
వేమరు నీతుకే ననుభవింతురు, సూనసముప్ప నెప్పుడున్॥ 14

దశ—ఋషీ! వామదేవ!

చ॥ అనయమునుం దదాజ్ఞ నె ప్రజాళుల నేలుచు నెంతొ సంతస
బనువయి యుండఁ గర్ణముల యొద్ద, నిదే పలితంబుఁ జూపఁ జొ
చ్చెను జరయైన మానకిటు చెప్పెను నిప్పుడు నన్ను చిన్ని బా
లునకును బోలెనౌర! యతిలోలతనుండు గుణుండు నాయెడన్॥ 15

వామ—రాజచంద్రమా! ఇట్టులనదనేమి? సమానవర్తనునకైనను నొక్కొక్కరిచోఁ గను చెల్మి మెండుగానుండుట లోకస్వభావమే అట్లే యిమ్మహాత్మునకును

చ॥ సరిగనె మీరఘుప్రవరు సంతతి కంతకు నొజ్జయయ్యుఁ దాఁ
గర మనురక్తి గౌరవముఁ గాంచును నీయెడ సంతతంబు, నా
నరయఁగఁ జందురుండు ముదమందఁగఁ జేయనిదెద్ది? యైనను
సుచిరకైరవమ్మునని సౌమ్యముఖమ్ము నెమ్మి గాంచదే! 16

దశ—వామదేవ! మమహి గురువచన శ్రవణ తృష్ణామంకుశీకరోతి శ్రోత్రవృత్తి రింద్రియానుసారిణో హృదయమహాగజస్య। తన్న కించిదపరమవశిష్యతే।

వామ—మహారాజ! నిశ్చైవమభిహితమ్। ఇదంతు సర్వసందేశ సంగ్రహకారికాం కారికామతి ప్రయత్నేన భగవాన్ భవంత మనుస్మారయతి।

దశ—(సాదరమ్) అవహితో౽స్మి। కిమాజ్ఞాపయతి।

వామ—

శ్లో॥ హుతమిష్టంచ తప్తంచ।
ధర్మశ్చాయం కులస్య తే।
గృహాత్ప్రతి నివర్తంతే।
పూర్ణకామాయదర్థినః॥ 17

దశ—(సహర్షమ్) సుష్టు శిరసి కృతమాచార్యవచనం। కించ।

శ్లో॥ అస్మద్గోత్రమహత్తరః క్రతుభుజామద్యాయమాద్యోరవి।
ర్యజ్వానో వయమద్యనో భగవతీ భూరద్య రాజన్వతీ।
అద్యస్వం బహుమన్యతే సహచరైరస్మాభిరాఖండలో।
యేనైతావ దరుంధతీపతిరపి స్వేనాను గృహ్ణాతినః। 18

వామ—రాజర్షే, సహజానుభావగంభీరమహిమానో యూయమేవ తాదృశాయయశసే। వయంతు కేవల ముపదేష్టారః।

దశ—ఇదె నాశ్రోత్రవృత్తి వేర్వేరు తలంపులకుం జొరఁబాఱుమానస మను నేనుఁగునకు గురువాక్యములు వినుటయందలి యాసక్తి నంకుశముగాఁ జేయుచున్నది. కావున నింకను నాయన సెల విడిన దేమయిన నుండినఁ జెప్పుము.

వామ—రాజోత్తమా! అంతయుఁ జెప్పివైచితిని. అయిన నన్నిటికిని మిక్కిలి ముఖ్యమగు నీయంశమును మాత్రము మిమ్ము బాగుగా జ్ఞాపకముంచుకొనుమన్నారు.

దశ—అత్యాదరమున వినుచున్నాఁడ నేమి సెలవిచ్చిరి ?

వామ—

ఉ. కూటమిమీఱఁ జేరి, తనకోరిక దీరినఁ దేరి, యర్థి నీ।
ద్వారమునుండి వెండియు ముదమ్మునఁ గ్రమ్మఱ నీకడే సదో
దారమఘ మ్మఘమ్ములుప్రశస్తమ్ము, హుతమ్ము, సతమ్ము నీ కులో
దాతులు దారు గోరెడువిధమ్మగు ధర్మపథమ్ము, నమ్ముమీ॥ 17

దశ—గురువాక్కులు శిరసావహించితిఁ. ఆహా! యమ్మహాత్ముఁడు తనకుఁ దాసుఁడై మాయందెంత ప్రేమాతిశయమునుజూపెను!

చ॥ ఇపుడుగదా, మదన్వయమహిష్ఠుఁడు సూర్యుఁడు దేవముఖ్యుఁడై
టిపుడుగదా, ముగంబుగొనుటేంద్రుఁడు మా చెలిమిం దలంచి; మే
మిపుడుగదా, సమున్నతి వహించి రహించుట యజ్వలందు; దా
నిపుడుగదా, యుదారవిభుపీ యిలకుంట, గురుండిటుంటచేఁ॥ 18

వామ—రాజర్షీ! మిమ్మువంటి సహజానుభావగంభీర స్వభావులగు మహారాజులు కువలయమును దమంతనె తాము చక్కఁగ

శ్లో॥ ఉన్ముద్రయతిహి కుముదాకర
మశరన్నిశానిశాతనిస్తుషోపి తుషారకిరణః।
సపునస్తుకిముచ్యతే భగవా
న్ద్వితీయ పరమేష్ఠీ వసిష్ఠః॥ 19

అపిచ।

శ్లో॥ ఇదం వోయాజ్యానా ముదితముదితం యత్కులమభూ।
ద్యదిష్టం వా కుర్వ న్నకృత సగరః పూర్త ముదధిమ్।
అసౌపూర్వేషాం తే సుచరితపతాకా యదమర।
స్రవంతీ కృత్స్నాయాం త్రిభువనగురో స్తస్య విభవః॥ 20

కించ-

శ్లో॥ కౌశికస్స్వీకృతస్యాపి।
యదాజ్ఞాతిక్రమా దభూత్।
త్రిశంకోరుపభోగాయ।
నద్యౌరపి న భూరపి॥

నేలుచు నీలాటి యశస్సమాజములకు భాజనములగు చుందురు మాబోంట్ల ముపదేశించువారముమాత్రిమే; అయినను,

తే. గీ. సలుపు హిమరశ్మి యశరన్ని శానిశాతి।
రహితతుషుఁడయ్యెఁ గుముదాకరప్రబోధ।
మనఁగ నీకె భగవంతుఁ డన్వ్యాబ్దసూతి।
యగు వశిష్ఠుఁ డానర్చునా నబ్బురంబె!

(పాఠాంతరము)

ఉ॥ పీ్రతిదలిర్ప నెప్పుడును వింతవికాసము మీఱఁ గైరవ
వ్రాతము నేలఁజాలు స్వకరప్రికరమ్మ కరమ్మ విమ్మచుక్
శీతకరుండు, శారదనిశీథిని పేరిటిసాంద్రరాపునన్॥
వీతతుషుండుఁ బూర్ణుఁడయి వెల్గెడునప్డికఁ జెప్ప నేటికిన్॥ 19

ఇంతియగాక,

చ॥ అగును సిరంతరోచ్ఛ్రయము, యాజ్యులరై తగుమీకులంబునా
సగరకృతేష్టపూర్తమయి, సాగరము ప్పెడునాఁ బతాకయై
తగును భగీరథాభిదు నుదారచరిత్రికు వేల్పుటేఱునా,
నగణితమా త్రిలోకగురువైన వసిష్ఠ విశేషమే సుమీ! ॥ 20

మరియు నెక్కు లేల!

క॥ ఆకౌశికమునిఘనకృప
కాకరమైనను దిశంకుననుభవమునకా।
నాకము, నీలోకమునం।
గాకుండుట యితనియానఁ గడచుట నెగదా!॥ 21

ప్రతీహారీ—జయతు జయతు దేవః। దేవ! భగవాన్ కౌశికో ద్వారమధ్యాస్తే।

దశ—(ససంభ్రమమ్) కిం। కౌశికః।

వామదేవః—అహా ముపైత్య శ్రౌతేన విధినా పురస్కృత్య ప్రవేశ్యామి తపోనిధిమ్। (ఇతి ప్రతీహార్యాసహా నిష్క్రాంతః।)

దశ—(సహర్షమ్)

శ్లో॥ యః క్షత్రదేహం పరితక్ష్య టంకైః।
స్తపోమయైర్బ్రాహ్మణ ముచ్చకార।
పరోరజోభిః స్వగు రగాధః।
సగాధిపుత్రోఽపి గృహానుపైతి॥ 22

(తతః ప్రవిశతి వామదేవోపదిశ్యమానవర్త్మా విశ్వామిత్రః॥)

విశ్వా—సఖే! వామదేవ! త్వమధునైవ వసిష్ఠాశ్రమాదాగతోఽసి। కచ్చిత్కుశలీ తావదరుంధతీనామ్నా పతివ్రతామయేన జ్యోతిషా సహచరితధర్మా తత్రభవాన్ మైత్రావరుణిః।

వామ—విశేషేణ పునరద్య యాజ్యకుల ముపతిష్ఠమానే చిరంతనప్రణయిని కౌశికే।

విశ్వా—సఖే! వామదేవ। చిరేణ దశరథో ద్రష్టవ్య ఇతి సర్వమనోరథానా ముపరివర్తామహే॥

వామ—(సవినయమ్) భగవన్! కుశికనందన! ధన్యః ఖల్వయం రాజా సావిత్రో య మేవమనురుధ్యంతే భవంతోఽపి।

(ప్రవేశించి) ప్రతీహారి—దేవా! జయమగుఁగాక! పూజ్యులగు విశ్వామిత్రులు ద్వారమువద్దకు వచ్చియున్నవారు.

దశ—ఏమి? విశ్వామిత్రుఁడా!

(అని తొందఱగా లేచుచు ఇటు నటుఁ జూచుచున్నాఁడు)

వామ—నేను వెళ్ళి యాతపోనిధిని శ్రౌతవిధిచేఁ బురస్కరించుకొని వత్తును. (ప్రతీహారితోఁ గూడ వెళ్లును)

దశ—ఆహా! యెంతపున్నెము!

చ. తపములపేర మీరు నిశితంపుఁటులుల్ కొని, క్షత్రిగాత్రిమే।
నిపుణుఁడు చెక్కిమిక్కిలి యనింద్యతరంబగు దీప్రివైప్రిస।
ద్వపువునుఁ జేసె, నానుగుణభవ్యతరుఁడు, రజఃపరుండు బల్
విపులయశుండు గాధిజుఁడె! వేయిదె నాయిలుఁ సొచ్చివచ్చునే! 22

(తరువాత వామదేవుఁడు చూపు మార్గమున విశ్వామిత్రుఁడు ప్రవేశించును)

విశ్వా—మిత్రి! వామదేవ! నీవిప్పుడే వసిష్ఠాశ్రమమునుండి వచ్చితివంటివి. అరుంధతి పేరితపోజ్యోతితోఁ గూడ ధర్మము నాచరించుచుఁ బూజ్యుఁడైన వసిష్ఠమహర్షి కుశలముగ నున్నవాఁడు గదా?

వామ—విశేషించి యిప్పుడు! చిరకాలమిత్రుఁడైన కౌశికుఁడు యీ జ్యనింటికి విచ్చేయుటవలన,

విశ్వా—వామదేవా! బహుకాలమునుండి దశరథుని జూడవేడుక

రెల్లకోర్కెలకు మొట్టమొదటిదై గట్టిగ మనసున బట్టియున్నది

వామ—(వినయముతో) ఆర్యా! కౌశికనందనా! మీరిట్టి ప్రేమాతిశయము గనుబరచుటచే నీరవికులతిలకము గుదశరథుఁడు ధన్యుఁడైనాఁడు

విశ్వా—సఖే! ధన్య ఏవాయమ్।

శ్లో॥ నమన్నృపతి మండలీ మకుట చంద్రికా మూర్ధని।
స్ఫురచ్చరణ పల్లవ ప్రతిపదోక్త దోస్సంపదా।
అనేన ససృజే తరాం తురగమేధ ముక్త భ్రమ।
త్తురంగఖుర చంద్రిక ప్రకర దంతురా మేదినీ॥ 23

(పురోవలోక్య సహర్షమ్)

శ్లో॥ చిరాదక్ష్ణోర్జ్యాడ్యం శమయతి సమస్తాసురవధూ।
కచాకృష్టిక్రీడా ప్రసభ సుభగంభావుక భుజః।
త్రిలోకీ జంఘాలోజ్జ్వల సహజ తేజా మనుకుల।
ప్రసూతిః సుత్రామ్ణో విజయ సహకృత్వా దశరథః॥ 24

సఖే, వామదేవ, ఇయమనేనపీయూష తుషార
సీకరాసారవర్షిణీ సుజన సంవాద కౌతుక మేఘలేఖా
పౌరస్త్యేనేవ మరుతా లోకనాథేన సహాస్రి శిఖరీ క్రియతే।

వామ—భగవన్! అద్యఖలు దిలీపకుల కుశల కల్పలతా సవాం
కురగ్రంథిభిరుద్గీర్యంతే కిసలయాని। యదత్ర భవానపి త్రిభు
వన సనాతన గురురేవ మస్మైన్నరేంద్రాయస్పృహయతి।

(ఇతి పరిక్రామతః।)

విశ్వా—నెచ్చెలీ! ఇతఁడెప్పుడును ధన్యుఁడే.

లయగ్రాహి॥

మ్రొక్కెడు నృపాలకుల చొక్కపు కిరీటములఁ।
జెక్కినమణిద్యుతులఁ బిక్కటిలు జ్యోత్స్నన్।
జక్కఁగ వహించి తళుకెక్కు పదపల్లవము।
నిక్కపు భుజాబలము నెక్కుడుగఁ దెల్పన్।
మిక్కిలి జగద్విదితి కెక్కు హయమేధశతు।
లక్కజపులీలఁగను మక్కువ నొనర్పన్।
బెక్కులు గురాలు తను డెక్క గుఱుతుల్ వఱల।
నొక్కిఝుల యాతయును ద్రొక్కియిడి యుంటన్॥ 23

(ఎదుటఁజూచి సంతోషముతో)

మ॥ సురవైరిప్రమదాకచగ్రహకలాశుంభన్మహాబాహుఁ డ
క్షరకీర్త్యాచితుఁ డుజ్జ్వలత్త్రిజగతీజంఘాలతేజుండు, ని
ర్జరలోకేడ్జయమిత్రకుండు మనువంశప్రోద్భవుండైన పం
క్తిరథుండద్దిరె! పెద్దకాలమునకున్ దృగ్గోచరుండయ్యె మా కిప్పుడున్ 24

ఆహా! అమృతరసబిందువులను జిందు నీసుజనసంవాదకౌతుకమును మేఘలేఖను తూర్పుగాలివలె నీలోకనాథుఁడు సహస్రశిఖరముల నందించుచున్నవాఁడు.

వామ—త్రిభువనసనాతనగురువులగు మీరలిట్టులీ నృపతిని బ్రేమించుటచే నేఁడీదిలీపకుల పూర్వపుణ్యకల్పలత చిగుర్చుచున్నది.

(ఇట్లిరువురు నడచుచున్నారు.)

దశ—(సహర్ష సంభ్రమ మాసనాదుత్థాయ ఉపసృత్యచ)
భగవన్ । కుశికనందన । ఐక్ష్వాకః పంక్తిరథోభివాదయతే ।

విశ్వా—స్వస్తి భవతే సపరివారాయ ।
(ఇతి సర్వే యథోచిత ముపవిశన్తి)

దశ—(సప్రశ్రయమ్ భగవన్, విశ్వామిత్ర!
శ్లో॥ కచ్చిత్కాంతారభాజాం భవతి పరిభవః కోపిశైవాపదో వా।
ప్రత్యూహేన క్రతూనాం నఖలు మఖభుజో భుంజతేవాహవీంషి!
కర్తుంవాకచ్చిదంతర్వసతి వసుమతీదక్షిణాః సప్తతన్తుః।
యత్సంప్రాప్తోసి కింవా రఘుకుల తపసామీదృశోయం వివర్తః 25

విశ్వా—(విహస్య)
శ్లో॥ జనయతి త్వయి వీర దిశాంపతీ
నపిగృహాంగణమాత్ర కుటుంబినః।
రిపురితి శ్రుతిరేవ నవాస్త్వపి
ప్రతిభయోన్నతి రస్తు కుతస్తునః॥ 26

అపిచ।

శ్లో॥ దత్తేంద్రాభయదక్షిణైర్భవిభ్రమాద్భుతభుజాసంభారగంభీరయా।
త్వద్వృత్త్యాశిథిలీకృతత్రిభువనత్రాణాయ నారాయణః।
అంతస్తోషతుషారసౌరభమయశ్వాసానిలాపూరణ।
ప్రాణోత్తుంగభుజంగతల్ప మధునా భద్రేణ నిద్రాయతే। 27

దశ—(హర్షసంభ్రమములతో ముందుకు నడచి సమీపించి)
మహాత్మా! ఇక్ష్వాకువంశ్యుఁడగు పంక్తిరథుఁడు నమస్కరిం
పుచున్నాఁడు (నమస్కరించును)

విశ్వా—(వినయముగ) ఆర్యా! విశ్వామిత్రమునిసత్తమా!

మ॥ విపినావాసులు లేకనే మృగములో పీడించునో, లేక హ
వ్యపరుల్గారో పశుఖాశనుల్, సవనవిఘ్నావాప్తిఁ జేఁ గాక కా
శ్యపిచేఁ గూర్చుసుఖంబెదే నొదవి తీవ్రై, కాదిదస్మత్కులా
త్తపురాపుణ్యపురాశికిట్లగు పరీవర్తంబు పెక్కేటికిన్॥ 25

విశ్వా—(సస్మితముగ) రాజోత్తమా!

చ॥ నిరతిశయంబు గుటుంబములు నిర్భయలీల నిజాంగణమ్ములన్
స్థిరముగనుండ మేలుగనఁజేసి దిగీశులఁగూడఁ గాచునీ
యురుపరిపాలనం బెసఁగుచుండఁగ నొందును విన్కియైన లే
శరియుఁ మాకుఁ ద్రిప్రతిభయంబిఁక నెట్లగునయ్య! యారయన్ 26

మరియును

చ॥ అలఘుభర్తృనిర్భయంబును జూపగనోపు నీ భుజా
బలమును శౌరి లోకపరిపాలనభారముదీటి లోని పే
ఱులమిని జల్లనై కలపులీనెడు నూర్పులగాలిఁ గ్రోలి బల్
బలుపును జూపు పాఁదోరపాన్పున హాయిగఁ జేయునిద్దురన్ 27

శా॥ దర్పోద్దామయుదారదక్షిణభుజాత్తత్రాణతన్ మీరు ని
వృత్తిం గాంచసంశిథిలీకృతాఖిలజగద్బ్రంబావనుండై హృదం
చత్తోషాతిసుశీతసౌరభమయశ్వాసానిలాపూరణా
త్యుత్తుంగోరగశయ్య నిష్ఠ హరి యొంతో హాయినిద్రించెడిన్ 27

దశ—(సవైలక్ష్యస్మితమ్) భగవన్, విశ్వామిత్ర।
అభ్యమిత్రీణస్య తత్రభవతః సునాసీరస్య
నాసీరపూరకేణ పదాతిపరమాణునా మయాపి
కదాచిదుద్ధృతం ధనుః తన్మాం లోయ మలీక లోక
ప్రవాదో భవంతమ ప్యాప్యాయయతి।

విశ్వా—(సోత్ప్రాసస్మితమ్) సఖే,

శ్లో॥ త్రైలోక్యాభయలగ్నకేన భవతా వీరేణ విస్మారిత।
స్త్రజ్జీమూతముహూర్తమండనధనుఃపాండిత్య మాఖండలః।
కించాజస్రమఖార్పితేన హవిషా సంఫుల్లమాంసోల్లస।
త్సర్వాంగీణవలీవిలుప్తనయనవ్యూహః కథం వర్తతే॥ 28

వామ—మహారాజ. భూ కాశ్యప, యథాహ భగవాన్ కౌశికః।
స్వయమనేకధా సుధర్మాయా మధ్యక్షీకృత మహామపిబ్రవీమి।

శ్లో॥ త్వయ్యర్థాసనభాజి కిన్నరగణోద్గీతైర్భవద్విక్రమై।
ర స్తఃసంభృతమత్సరోపి భగవా నాకారగుప్తా కృతీ।
ఉన్మీలద్భవదీయదక్షిణభుజారోమాంచవిద్ధోచ్చర।
ద్బాష్పైరేవ విలోచనై రభినయ త్యానంద మాఖండలః॥ 29

దశ—(సస్మితమ్) వామదేవ, త్వమపి భగవ స్తం గాధినందన
మను ప్రవిష్టోసి ?—

శ్లో॥ ఏతస్మిన్ సమరాంగణప్రణయినే తిష్ఠేత కః ప్రజ్వల।
ద్దంభోళిద్యుతిమండలోద్భటభుజ స్తంభాయ జంభారయే।

దశ—(సిగ్గుతోఁగూడిన చిరునగవుతో) ఆర్యా!
శత్రుసంహారదక్షుఁడగు నాసునాశీరుని సేనాపూరణమాత్ర మునకుగాఁ దీసికొనఁబడిన యొకసామాన్యపు కాలిబంటనగు నేనును నొకపరి విల్లెక్కువెట్టితిని. అంత మాత్రమున లోకులూరక కల్పించిన గొప్పదనము మిమ్ముఁగూడ నానందపెట్టుచుండెంగావచ్చును.

విశ్వా—(సోత్ప్రాసముగా) ఔనౌనది నేనెఱుఁగనిది కాదు,

చ॥ అరులఱ నీవె లగ్నకఁడవై పోజనేలుచు నూట వింట, నే
ర్పెఱి యది మింట మబ్బుతొడవంట జనింప నిలింపభర్త నీ
యురుమఖభవ్యహవ్యతతు లూరుచు సారెకుఁ జక్కమెక్కమై
కరమురువై పఖుల్ కనులు గప్పగ, నెప్పలెవిప్పఁడెప్పుడున్॥ 28

వామ—(నవ్వి) భూలోక దేవేంద్రుఁడవనఁదగు నో మహారాజా!
కౌశికమహర్షి చెప్పినది యథార్థమే. నేనును బలుమారు దేవసభలోఁ జూచియున్నాను.

మ॥ దివి సర్థాసనవాసు నిన్ సురలు గీర్తింపన్ మదిన్ గల్గు నీ
ర్ష్యవెసం గప్పి త్వదీయదక్షిణభుజాసంజాతరోమాంచవి
ర్ధవివృద్ధోచ్ఛలదస్రువాఃకణసంతానమ్ములం గ్రమ్మ చ
క్షువులంబట్టియె గట్టునై నభినయించున్ శక్రుఁడానందమున్॥ 29

దశ—(చిరునగవుతో) వామదేవా! నీవును విశ్వామిత్రమహర్షి నే యనుకరింపుచుంటివా! ఆలకింపుము.

చ॥ రణమునుగోరి ఘోరభిదురంబు కరంబునఁబట్టి నెట్టనన్
కణకణమందుచుండు బలు గాటవు టగ్గి కణంబు లొల్కు, నీ

నిర్యద్భిర్బహిరేవ రోష దహన జ్యోతి స్ఫులింగై రివ।
స్త్వైరజ్యక్భిరవీక్షణైః సమతనో దాగ్నేయ మస్త్రంద్విషామ్॥ 30

విశ్వా—(సగౌరవం దశరథబాహూ మామృశన్)
రాజర్షే! వశిష్ఠ శిష్య!

శ్లో। సంవృత్తోఽయం యది తవభుజచ్ఛాయయాసంప్రతీంద్రో
నిర్విఘ్నశ్రీరియమభినవా కీదృశీ తే ప్రశస్తిః
ఇక్ష్వాకూణాం లిఖితపతితా స్వర్వధూగండపీఠ।
క్రీడాపత్రప్రకరమకరీపాశుపాల్యంహి వృత్తిః 31

దశ—భగవన్; సర్వాద్భుతనిధే! భగవంత మనుగంతు ముక్తి
ప్రత్యుక్తి కయా కేవయమ్। ఏవంకిల త్రిశంకు సంకీర్తనోపా
ఖ్యానపారదృశ్వానః పౌరాణికాః కథయంతి।

శ్లో॥ తాప్రోత్కంపితాప్రదశపరిషన్మౌళిమాణిక్యమాలా।
బాలాదిత్యప్రకరకిరణస్మేరపాదారవిందే।
ప్రాచీమేనాం భువనరచనామన్యథా నిర్మిమాణే।
కార్పణ్యోక్తిస్త్వయిరచిత వానతరాయంమహేంద్రః॥ 32

(సహాస్య)

శ్లో॥ జవాదారాద్ధుం త్వాముపనమతి వర్గే దివిషదా!
మపవ్యస్తో మందై రజనిరథహాంసైః కమలభూః।
నియచ్ఛాంభోజిహ్వాం నతివ చరితేభ్యః కిముతతే।
సుధాసధ్రీచీనామతిపతతి హాచా మవసరః॥ 33

(అంజలింబధ్వా) భగవన్, ప్రసీద తావత్।

క్షణముల బారి వైరులులూర్ణ జ్వలనాస్త్రముగాగ రోషభీ
షణతనెసంగు జంభరిపుసంగరరంగమెవండు ద్రొక్కెడున్॥ 30

విశ్వా—(దశరథుని భుజములమీఁదఁ దట్టుచు)
వశిష్ఠ శిష్యుఁడవగు నోరాజర్షీ !

మ॥ అకలంకస్థిరలక్ష్మి నీభుజము చాముండాయునాయద్రి భే
దికనన్నే డిది మీఁకుఁగ్రొత్తయొకమే ? తెల్లంబె యిక్ష్వాకుజా
తికి స్వర్గప్రమదాకపోలతలభిత్తిప్రస్ఫురత్కేళి కా
మకరీపాలనవృత్తి వ్రాసి పఠియింపంబడ్డదే, యెప్పుడున్॥ 31

దశ—సర్వార్థ్యభూతావధీ! తపోనిధీ! మిమ్ముత్తరపత్త్రరములతోనైన
ననుసరింప మే మెంతవారము ! త్రిశంకు చరితముఁ బౌరా
ణికు లిట్లు చెప్పుచుందురు.

చ॥ అలుకవహించి తొంటిగతి కన్యగతిన్ జగతిన్ రచింపుచో।
బలువెరపొంది వేలుపులు భవ్యభవత్పదపద్మయుగ్మమున్।
విలసితమౌళిసన్మణిరవిప్రభలన్ వికసింపఁజేయు, వే।
ల్పులదార దీనవాక్కులను మ్రొక్కక యాపని నాపనోపెనే॥ 32

(నవ్వి)

చ॥ అమరసమూహ మెంతొ రయమూరగనిన్గొలువంగఁ జేరుచోఁ
గమలజు తేరు చాలవెనుకంబడె సంచలమందయానతన్।
విమలము లౌ భవత్కథలు పెక్కులవన్నియు నెన్నుచున్న నీ
యమృతరసప్రసారకము లౌపలుకుల్ విన వేళమించెడున్॥ 33

(దోయిలిపట్టి) మహాత్మా ! అనుగ్రహింపుము !

ఉత్తరోత్తరేషాం మహోత్సవానాం కదాచిదపిన తృప్యంతి పుంసాం హృదయాని యదియంత్వదుపస్థానసులభసంభావ నాతిప్రసంగసంగీతనర్తకీ మే చిత్తవృత్తిర్నియోగానుగ్రహ

యన్స్పృహయతి। అపిచ।

శ్లో॥ ఏతాభి స్తవకౌతుకోక్తిభిరపి త్రైవిద్యమూర్తేరివ।
త్వష్టస్యామరశిల్పినా దినకృతో వచ్ఛేద వేదాక్షరైః।
పూతాస్స్మో వయమద్య యద్యపి శిరస్యాజ్ఞామపి స్యామహం।
వోఢుం విష్టి రనర్ఘతా రవికులే కల్పాంతమున్మీలతు॥ 34

విశ్వా—ఐందుమతేయ! కిమన్యన్నియోజ్యమ్!

శ్లో॥ నిర్ముక్తశేషధవళై రచలేంద్రమూర్ధ।
సంక్షుబ్ధదుగ్ధమయసాగరగర్భగౌరైః।
రాజన్నిదం బహుళపక్షదళన్మృగాంక।
చ్ఛేదోజ్జ్వలై స్తవ యశోభి రశోభి విశ్వమ్॥ 35

పునరిదానీమపి॥

శ్లో॥ యశస్తోమా నుచ్చై రుపచిను చకోరప్రణయినీ
రసజ్ఞాపాండిత్యచ్ఛిదురశశిధామభ్రమకరాన్
అపిత్వత్తేజోభి స్తమసిశమితేరక్షతుదిశా
మసౌయాత్రామైత్రీం నభసినితరా మంబరమణిః॥ 36

గ॥ కింతు కతిపయదివసా నాయుధసధ్రీచా రామభద్రేణ సన్నిహిత వైతానక్రియాణా మస్మాక మాశ్రమపదం సనాథీకరిష్యతే॥

ఇదె, నాచిత్తవృత్తి నేడు నీరాకవలనఁ గలిగిన గౌరవమున కలరియాడుచు నియోగానుగ్రహమున కెమురుజూచుచున్నది. జనులడెందములెందును ముందుముందుకానుండు మహోత్సవములకెన్నడును దృప్తినొంది యూరకుండవుగదా !

మరియు మహాత్మా,

ఉ॥ వేలుపుశిల్పిసాననిడి వేదమయుర్ణ రవిఁజక్కఁదిద్దుచోఁ ।
దూలిన యోగమాత్రరపు తున్కలనందగునీదుకౌతుకో ।
త్ర్యాళులనైనఁ బావనులమైతిమినేడు; త్వదాజ్ఞఁగూడ మా।
న్మౌళినిదాల్తు, మాసుడఁనర్ఘత శాశ్వతమై చెలంగఁగాఁ॥ 34

విశ్వా—ఇందుమతీనందనా ! వేరే నియోగించునదేమున్నది.

చ॥ విలులితకంచుకాహిప నవీనరుచిర్ణ మధనోజ్జ్వలత్సుధా।
జలనిధిగర్భజాతరుచిజాతమురీతిని గృష్ణపక్ష సం
దళితమృగాంకఖండసముదాయము చాయను నీయశంపు గుం
పులు చెలగం జగంబుగడుఁబొల్పునుగాంచుచుమించునేగదా॥ 35

ఐనను—

చ॥ సరసచకోరికాళుల రసజ్ఞలనై ఫణిఁ బాపనోపి చం
దిరికయటన్న భ్రాంతినిడు శిరనికీరితిమిాఱుగాత, నీ
యరిదిమహామహస్సె తిమిరావళి నావలికొత్త, రిత్తయం
బరమణిమింటఁదొంటి తమివారక వారకసంచరించుతఁ॥ 39

ఇదిగాక మిమిపుడు కొన్నిజన్నముల నొనర్పనున్నవారము గావున మాయాశ్రమ పదములను గొన్నిదినములాయుధపాణియై రామభద్రుఁడు రక్షింపవలయును.

అపిచ॥

ప॥ మద్ధ్యేకృత్యఘనంధినోతిజలధిస్స్వైరంబుభిర్మేదినీం
హంతిస్వైఃకిరణైస్తమిస్ర మరుణం కృత్వాంతరాళే రవిః
త్వం రామాంతరితశ్చపాలయ నిజైరేవ ప్రతాపైఃప్రజా
మీదృక్కోఽపి పరోపకారసుహృదా మేష స్వభావోహివః॥ 37

కించ॥

ప॥ దృష్టస్సాధుదసురవిజయీ నాకినాంచక్రవర్తీ।
మాతోన్యన్యాయఃకథయతి యథావారుణీ దండనీతిః।
పాతాళేంద్రా గహిభయ మధాస్త్యేవ నిత్యానుషక్తం।
తన్నఃపుణ్యైరజని భవతా వీరరాజన్వతీ భూః॥ 38

దశ॥ సవిషాదం-స్వ గ॥ కథమిదమస్మాకం సకలలోకశోకశం కోద్ధరణశీతళేభ్యః కౌశికపాదేభ్యో రామభద్రప్రవాసవైమనస్యమ భ్యుత్పత్స్యతే—దృష్టంవానిశ్శేషామృతనిష్యందినీనా మిందుకిరణకం దళీనాం కమలినీనిమీలన మాత్రకస్థానం — (విమృశ్య) కాగతిః— (ప్రకాశం)॥

ప॥ కూర్మరాజభుజగాధిపగోత్ర
గ్రావదిక్కరిభిరేకధురీణః
మాంప్రసూయకథమద్యవిగీతో
హోపరార్థవిముఖోరఘువంశః।39

విశ్వా। గ॥ రాజర్షే మమకాకోహి రాజపుత్రేషు రాజ్ఞా ముపలాలనక్లేశాయ కేవల ముపయోగస్తుప్రజానామేనయత్తే తత్॥

చ॥ ఇల! కల మేఘమధ్యనిడియుచ్చు నిజాంబులెవార్ధి సూర్యుడున్
బలుతమమాత్మదీప్తుల నె వాఘ్రననూరునిమధ్యనిల్పి, మ
ర్త్యులనటునీసమర్థత నె బ్రోవుమురామునిమధ్యనుంచి, యా
నలఘుపరోపకారపరులై తగుమీకిదినైజమేకదా!॥ 37

మరియు,

మ॥ అసురానీకజయుండా యల్లమరలోకాధీశ్వరుండా ప్రచే
తను దండంపునినీతిరీతి నలమాత్స్యన్యాయమే తెల్పు, సా
ధ్వసదంబే యహిబాధ నెప్పుడును బాతాళం, బటుల్ గాక యీ
రస రాజన్వతియయ్యెన్ బడసిపీరా! పుణ్యసారాప్తిచేన్॥ 38

దశ—(విషాదముతోఁడనలో) లోకములశోకములనెల్ల నిర్మ్మాలి పఁ
జాలు నీ కౌశికమహర్షి వలనను రామప్రవాసహేతుకమైన
వైమనస్యము సంభవింపనున్నదేమి? అవును, సుధారసధారా
పూరములం జిల్కు చంద్రకిరణముల వలననైనను గమలినికి
నిమీలనము గలుగుచుండుటఁ జూచుచుంటిమిగదా! అకటా!
యిపుడేమిచేయుదును? (ప్రకాశముగ)

చ॥ చిలువలఱేనితోఁ గమఠశేఖరుతో ఘనదిగ్గజాలితో।
కులగిరిపాళితో సరిగఁ గుంభిని నూనఁగఁ దానె చాలుచున్।
బలుయశమందిరయిప్పురఘువంశమయో! ననుగాంచినేటితోఁ
జులకదనంబు నొందెనునె! చూచుచునుండఁ బరార్ధహీనమై॥ 39

విశ్వా—రాచతపసీ! రాజులకుఁ బుత్త్రులందలి మమకారము కేవ
లము నుపలాలనక్లేశమునకే, యుపయోగమునకుఁ బ్రజలదే!

ప॥ కష్టా వేధవ్యధాకష్టో
సిత్యంచ వహనక్లమః।
శ్రవణానామలంకారః।
కపోలస్యతుకుండలం॥ 40

దశ—సవినయోపరోధం గ॥ భగవన్ పరమనుగృహీతావయమేవ మత్రభవతాసంభావ్యమానాః కింతుపునరకృతాస్త్రః క్షీరకంఠశ్చ మేవత్సోయమితి పరిముగ్ధోస్మి॥

విశ్వా—గ॥ విహస్య సఖే తత్రభవంతౌ మైత్రావరుణి మృషిం పురోధాయా చరితబ్రహ్మచర్యస్య ధనుర్వేదసంస్కారా స్తావదస్య భృశాశ్వప్రసాదా దస్మాస్వాయతంతే॥

దశ—(సవినయోపరోధం) భగవన్నుచ్ఛ్వసితమపి రఘురాజబీజానాంత్వదాయత్తమేవ కిముతకార్ముక విద్యాసంప్రదాయః శంకేసహస్రకిరణకులైకపక్షపాతే నైవ సహస్రపరివత్సరాన్ భగవంతం భృశాశ్వముపాసీనో దివ్యాస్త్రమంత్ర మధ్యగీష్ఠాః

విశ్వా—గ॥ అలంచ తేరామభద్రోపిబాలోయమితి సంభావనయా ద్యావాపృథివ్యో స్తిమిరతిరస్కారిణీం తరణిరణుతరోపి నిజతేజసాతిరస్కరోతి

దశ—భగవన్ కుశికనందన కస్యతాన్యశీతలినా జిహ్వయాత్మా మపి బ్రువాణమధరోత్తరేణ (అపవార్య) వామదేవ! ఏవమత్ర భవాన్ కౌశికోబ్రవీతి॥

కం॥ కోఁడొక వేధవ్యధయు, న
ఖండపువహనశ్రమంబుఁ గర్ణములొందన్ ।
గుండలములమండనతను ।
గండశిలంబులె వహించుఁ గాదె! నృపాలా! 40

దశ—(వినయముతో నిర్బంధింపుచు) పూజ్యులైన మీరిట్లు మమ్ము బహూకరించుటచే ధన్యులమైనారము. కాని మా రాముఁడింకను నకృతాస్త్రుఁడగు పసికూనగానుంటచే నాకేమియును దోచకున్నది.

విశ్వా—(నవ్వి) మిత్రుఁడా! పూజ్యుఁడైన వశిష్ఠునిచే బ్రహ్మచర్యము నందియున్న యీతని ధనుర్వేదసంస్కారములు భృశాశ్వ ననుగ్రహమున మాయందధీనములై యున్నవి గదా!

దశ—(వినయముతో నుపరోధింపుచు) ఆర్యా! కార్ముకసాంప్రదాయము మాత్రమే కాదు. రఘురాజబీజముల యుచ్ఛ్వాసము గూడ మీయధీనమే. రఘుకులపక్షపాతము చేతనే వేయు వత్సరములు భృశాశ్వునుపాసించి దివ్యాస్త్రమంత్రాధ్యయన మొనర్చి యుందురని తలఁచెదను.

విశ్వా—రామభద్రుఁడు బాలుఁడని నీవు సందియమునొందఁ బని లేదు. తరణి యణుతరుండయ్యును దన తేజమున భువికిం దివికిం బన్నియున్న దట్టమగు చీకటి తెఱను దెరలించుచుండలేదే!

దశ—మహాత్మా! అట్లు కానిమ్ము. నీవు కోరుటయు మేము లేదనుటయునా? అట్లు చెప్పుటకు సాహసించునంతటి తేలికనాలుక యేరికైననుండునా? (చేచాటుగా, వామదేవునితో) వామదేవా! కౌశికుఁడీలాగున నడుగుచున్నాఁడు!

వామ—రాజర్షే! కిమత్రప్రష్టవ్యోఽయ

ప॥ కౌశికోర్థీ భవాన్దాతా
రక్షణీయో మహాన్ క్రతుః
రక్షితా రామ భద్రశ్చే
దనుమన్యామహే వయం॥ 41

అపిచ,

ప॥ జగతీభార ఖిన్నానాం
విశ్రామో భవతామయం
యద్యథా కామసంప్రాప్తి
ప్రీతార్థిముఖదర్శనం॥

కించ విశేషేణచ,

ప॥ పూరయితుమర్థికామాన్
మైత్రావరుణేన గోత్రగురుణా తే
సందిశతా సందిష్ట
స్సమాధి దృష్టస్సఏవార్థః॥ 43

దశ—ఏవమేతత్,

ప॥ ధ్యానమయదృష్టిపాత
ప్రముషితకాలాధ్వవిప్రకర్షేషు
విషయేషు నైష్టికానాం
సర్వపథీనా మతిఃక్రమతే॥

విమృశ్య,

వామ—రాజోత్తమా! ఇంక మమ్మడుగవలసిన దేమున్నది ?

చ॥ అనుగునతండు కౌశికమహాముని రాజట! కీర్తిమీఱఁగా
నిడివెడివాఁడవీవట! యహీనమఖంబుసురక్షితంబు గాఁ
బడునట! పూనిదాని పరిపాలనచేయునతండు రామభ
ద్రుఁడెయట! సంతసింపక నిరోధమొనర్తుమె? మే ము దీనికిన్ 41

మరియు,

కం॥ తగఁగోర్కెదీఱి ప్రీతుం ।
డగునర్థి మొగంబు చూడనయ్యెను నేనిట్ ।
జగతీభర పరఖిన్నుల ।
రగుమీఁకిది విశ్రమమ్ము మగుఁజుమ్మ! నృపా! 42

మరియు విశేషించి,

కం॥ ముందుగ సర్థులకోరిక ।
లందించుచుటుంచు నన్వయాచార్యుఁడు, ప్రీ ।
తిందగ నాచేననిచిన
సందేశంబిదె, నృపాల! సందియమేలా ? 43

దశ—అగునాలాగుననే,

కం॥ ధ్యానము ను దృష్టి కలిమిం ।
బూని నిరాఘాటవృత్తిఁబొల్చుచు వెస నెల ।
దేనియు నెపుడేనియునగు ।
వానింబొడగంతు రిష్టఁబడయు మహాత్ముల్ ॥ 44

(విమర్శించుకొని)

ప॥ క్రియాణాం రక్షార్థైమిదశరథముపాస్థాయవిముఖే ।
మునావిశ్వామిత్రే భగవతిగతే సంప్రతిగృహాన్ ।
తపోలేశక్లేశా దుపశమితవిఘ్న ప్రతిభయే ।
ప్రవృత్తే వాయజ్ఞై రఘుకులకథైవా స్తమయతే ॥ 45

(మునింప్రతి) జగద్గురో గాధినందన,

ప॥ త్వంచదీక్షిష్యమాణోమే
రామభద్రం ప్రతీక్షసే
తన్నఃపతివ్రతావృత్తి
మియంచరతి మేదినీ॥ 46

(నేపథ్యాభిముఖ మవలోక్య) కః కోఽత్రభోః

(ప్రవిశ్య దౌవారికః) కిమాజ్ఞాపయతి దేవః

దశ—ఆహూయతాం రామభద్రః

వామ—లక్ష్మణశ్చ

దశ—(సస్మితం) గ॥ పృథక్క్రియతాం పేక్షీ నాయమనఘః సఖలు
ప్రకాశమంతరేణ తుహినభాసుర్జిహీతే

(దౌవారికో నిష్క్రాంతః)

(తతః ప్రవిశతో రామలక్ష్మణౌ)

రామః—(సహర్షస్మితం)

ప॥ సురాధీశ క్రోధా జ్జగదపరధాతుఃక్రతుమపరే
పురాణబ్రహ్మాణో భువనపితర స్సృష్టచకృతాః
ధృతాస్తుష్టేనామీబహిరపిచ వైశ్వానరపథా
త్కథాపౌరాణీయచ్చరితమితి హాస్యప్రథయతి। 47

శా॥ శశ్వత్ప్రీతిన హీనయజ్ఞములకున్ సంరక్షగావింప బల్ ।
విశ్వాసంబునఁగోరియున్ దశరథోర్వీనాథుచేరిక్తుఁడా ।
విశ్వామిత్రుని దత్తపోలవమె నిర్విఘ్నాధ్వరుంజేయుచో ।
విశ్వంబుదిఁక రాఘవాన్వయకథావిస్ఫూర్తి వర్తించునే? 45

(మునితో) జగద్గురూ! గాధినందనా!

మ॥ మరియుంబెక్కులు వాక్కులేమిటికిఁదఙ్ మా రామభద్రుండు కా
పరిగానీ వేదా దేవతావ్రతముసల్పఙ్ మానసంబుండుఁ ద।
త్పరతన్ జెందెదవేని మాధరణియున్ బాతానదానుంగమున్
బరముంబా పతిదేవతావ్రతము సల్పన్గోరెతున్ మా యెడన్॥ 46

(తెరవంకఁజూచి) ఎవఁడురా? అక్కడ?

ద్వారికుఁడు—(ప్రవేశించి) దేవా! ఏమి సెలవు?

దశ—రామభద్రుని తీసికొనిరమ్ము!

వామ—లక్ష్మణునిగూడను!

దశ—(చిరునగవుతో) దానికి వేరు యత్నమక్కరలేదు. చంద్రుఁడు ప్రకాశమును విడచియుండఁడుగదా!

(ద్వారికుఁడు వెళ్లును.)

తరువాత రామలక్ష్మణులు ప్రవేశింతురు)

రామ—(సంతోషముతో)

ఉ॥ వేలుపుఱేనిపై నలిగి వేఱుగతిఙ్ జగతిఙ్ రచింపుచో ।
వేలుపు లార్య! మానుఁడని వేడను వేళకె ధాతృసప్తకం ।
బోలిసృజించియుంచె మహిమాన్నతినంచుఁ బురాణమెంచునా।
మేలివ్రతాలపేటియగు మేటికి మా యుపచారమేటికో!॥ 47

గ॥ కథంసోపి భగవానస్మాభిరుపచరిష్యత (ఇతిపరికామ్రన్ పురోవలోక్యహర్షాతిశయం నిరూపయన్) నూనం వినయ విస్రమ యోః తాత వామదేవయోః తృతీయా ప్రశాంత పావనీయ మా కృతిస్సభగవాన్ విశ్వామిత్రో భవిష్యతి॥

లక్ష్మణః—(సాశ్చర్యస్మితం) ఆర్య!

ప॥ అయమయమీదృశప్రశమ విశ్వసనీయతను
ర్భువన భయంకరీః కథమదత్త రుషోపిమునిః
స్థితమిద మేవవా మృదుమనోజ్ఞ తుషారతమా
స్తమసిసతిజ్వలంతిసహాసైవ సుహశామధయః॥ 48

రామః—వత్స! లక్ష్మణ! ఏవం మురవగాహ గంభీర చరితాశ్చిత్రీ
యంతే మహాంతః

అపిచ,

ప॥ వ్రితవిహితకరిభిరప్సరోభి
స్సహజగదస్య నిగృహ్ణతో గృణంతి
సమదమరశిరః కిరీటరోచి
మురకులితరోషత మాంసిచేష్టితాని॥ 49

వామదేవః—(దృష్ట్వాసహర్షం) కథమాగతో రామభద్రః (మునిం
ప్రతి) భగవన్॥

ప॥ బ్రహ్మజ్యోతిర్వివర్తస్య
చతుర్థాదేహయోగినః!
ఋశ్యశృంగ చకోరంశః
ప్రథమోయం మహాభుజః॥ 50

(ఇట్లు నడచుచు సంతోషాతిశయములతో సరూపించుచు) ఇదిగో నాన్నగారును, వామదేవుఁడుగారును, ముక్కాలి వినయావనములై యుండ నెంతయు శాంతమూర్తియై యొప్పు నమ్మాడనయతఁడమ్మహాముని యగావచ్చును.

లక్ష్మ—(అబ్బురముతోఁగూడిన చిరునవ్వుతో) అన్నయ్యగారూ!

ఉ॥ వింతగు నింతశాంతరస విశ్వసనీయతనుర్ఘ ఘనున్మునిన్।
దొంతరగాజగాల్వణకి తోణ్కెడు కిన్కలునెట్లువట్టె? నా।
సంతతమెంతొ మార్దవమెసంగు సుశైత్యనిధుల్ మహాషధుల్।
సుంతమంబుఁదోపవశి చూపుచుమండవె? చండదీప్తులన్॥ 48

రామ—లక్ష్మణా! దురవగాహములైన గంభీరచరితములు గల యీలాటిమహాత్ములెంతయు నద్భుత చర్యలుగలిగియలరుచుందురు

మఱియును,

చ॥ సతతముఁ దెల్పుచుందురు సద్వ్రతనిఘ్నకృనుద్ధతాప్సరః।
పవిత్రతులపొంగడంగ దివిభస్మముసేయగడంగియున్ నమ
ద్దితిజసపత్నమాళిమణిదీప్తుల తాకునలోకభీకరా।
తతనిజరుట్టమంబఱిముదంపడు నిమ్మునిచేష్టితమ్ములన్॥ 49

వామ—(చూచిసంతోషముతో) అదుగో! రామభద్రుఁడు నచ్చినాఁడు. (మునితో)

చ॥ ఘనుఁడగు ఋష్యశృంగముని కల్పనచేసిన యద్భుతాధ్వరం।
బున నలుమేనులెంతయును బొల్పునుగాంచియెసంగునట్లుగా।
జనిఁగను బ్రహ్మతేజపులసద్ఘన నస్ఫురిణామమునుందు నీ।
యనఘగుణౌఘశాలి తొలియంశమునుమ్ము! మునీంద్రచంద్రమా॥50

విశ్వా—గ॥ (సహర్షసంభ్రమమనవలోక్య) వామదేవకిము చ్యతే।
ఆరణ్యకేషు ప్రకృష్టతమం కిమపి బ్రాహ్మణ్యమృష్యశృంగస్య న కేవలమమునా వత్సేన బ్రహ్మర్షిర్విభండకః పుత్రివతాం ధురమారోపితః రాజర్షిర్దశరథో౾పి।

వామ—భగవన్నేవమేవ॥

విశ్వా—వామదేవం ప్రతి

వ॥ యే మైత్రావరుణిః పురోహితవతాం వంశే మనోర్జజ్ఞిరే।
తాస్తావైనయికైః క్రియావిధిభిరేవేషాం తుయుష్మాదృశః।
తేషామంచలమేవ తే దశరథస్సంప్రత్యమీ యేపునః
జాతాస్తే ధ్రువమృశ్యశృంగతపసా మైశ్వర్యమిక్ష్వాకవః॥ 51

(రామ లక్ష్మణా వుపసర్పతః॥)

వామ—వత్సౌ భగవాన శేష భువన మహనీయో మహాముని
ప్రణమ్యతాం.

(రామ లక్ష్మణావుపసృత్య)-భగవన్ విశ్వామిత్ర సావిత్రౌ రామ లక్ష్మణా వభివాదయే తే।

విశ్వా—గ॥ వత్సౌ వాయుష్మంతౌ భూయాస్తాం (మితి భుజాభ్యాం పరిగృహ్య సరోమాంచంనిర్వర్ణ్యన్-సబహుమానం॥)

విశ్వా—(సంతోష సంభ్రమములతోఁ జూచి) వామదేవా! చెప్పెడి దేమి? వనవాసులం దత్యుత్తముఁడు నీ ఋష్యశృంగమహర్షి దగు బ్రాహ్మణ్యము మిగుల శ్రేష్ఠతరమైనది గదా! యీతనివలన కేవలముఁ నా బ్రహ్మర్షియగు విభండకుఁడు మాత్రమే కాక రాజర్షియగు నీదశరథుఁడుఁ గూడఁ బుత్రవంతులలో నగ్రేసరుఁడైనాఁడు.

వామ—ఆర్యా! అగునది నిశ్చయమే.

విశ్వా—వామదేవా!

చ॥ గురుఁడు వసిష్ఠుఁడా మునిని గోత్రమునందగి మిమ్ము బోటులే।
ర్పరచిన సద్విధుల్ గొనిన వారలలోఁ దుదివాఁడు మీకుఁ బం।
క్తిరథుఁడె; పైనిటఁ బొడమి తేజము గాంచఁగనున్న వారలె।
ల్లరునల ఋష్యశృంగుప్రబల వ్రతసంపద పెంపునఁ జమున్॥ 51

(రామ లక్ష్మణులు సమీపింతురు.)

వామ—బాలులారా! ఎల్లలోకములకు వందనీయుఁడగు నీమహర్షికి నమస్కరింపుఁడు.

రామలక్ష్మణులు—(సమీపించి) మహాత్మా! విశ్వామిత్రా! రవివంశజులగు రామలక్ష్మణులు నమస్కరింపుచున్నారు.

విశ్వా—చిన్నికొమరులారా! దీర్ఘాయువు నంది పెంపొందుదురుగాక! (భుజములతోఁ గౌఁగలించుకొని) (పులకాంకురములతో బహూకరింపుచు రాముని నుద్దేశించి) (తనలో)

స్వ॥ ప॥ వసిష్ఠోక్తైస్సూక్తైర్దధతిజగతామాభ్యుదయికీం
ధురం సంప్రత్యేతే దినకరకులీనాః క్షితిభుజః
గృహే యేషాం రామాదిభిరపికలాభిశ్చతసృభిః
స్వయం దేవోఽంశైస్త్రీనకుతుకచారీ విజయతే॥ 52

కించ,

ప॥ త్వం తాస్తాస్సమ్రత వాన్యచోదశగయాస్త్వతీప్రితయే యజ్వభిః
స్వాహాకారముపాహితం హవిరపిత్రేతాగ్నిరాచామతి
త్వాం తత్రోదజలేశయం క్రతులిహః పృథ్వీమువాతీతర
న్నుద్వృత్తాదశకంధరప్రిభృతయో నిగ్రాహితారస్త్వయా॥ 53

వామ—సస్మితం వత్సావయమతిభవాన్ భవంతో నేతుమాగతః

రామలక్ష్మణౌ—యదభిరుచితం భవతే తాతపాదాయచ॥

ఉ॥ శ్రీరమణిం సదామొదనుజేర్చి ముదంబుధిఁదేలుచేలుపే
వీరలయుంట రామముఖనిశ్రితనామ కళాచతుష్టయం
బై రహిమీాఱె, నీరవికులాగ్రిణులింక వసిష్టసూక్తులం
భారముఁబూని లోకములబాధలడంత్రుగదా! ముదంబునన్॥ 52

ఇంతియకాక,

సీ॥ నీవేకదా! వేడ్క నెగడనీకై దంగ
ములనొప్పుచుంను రుక్కులదలంతు।
నీకై కదా! యజ్వలోకంబుమోదంబు
దగవేల్చుహావ్యముల్ బాల్చునగ్ని।
నిన్నేకదా! పాలమున్నీటిలోనుండి
యిలకుడిగ్గఁజేసి రెల్లసురలు!।
నీచేగదా! యింక నిగ్రహింపంబడఁ
గలరు రావణముఖ్య ఖలసురాసు।

తే॥ గీ॥ లకట! నిను మానవునిగాఁగ ననుదినమ్ము।
దలఁచుచుందురెఱుంగక ధరణి నరులు।
మహితగుణములపోగ్రిన! సేమముల తావ!
మాననీయపవ్రిభావ! మహానుభావ!॥ 53

వామ—(చిరునవ్వుతో) వత్సలారా! ఇన్నుహర్షి మిమ్ముఁదోడ్కొని పోవచ్చినాఁడు.

రామలక్ష్మణులు—నాన్నగారును మీాకు నానతిచ్చిన నభ్యంతర మేమున్నది?

దశ—తౌ సస్నేహమాదాయ కౌశిక ఇత్యర్ధోక్తే మన్యూత్పీడనిగృహ్యమాణ కంఠో వామదేవస్యముఖమీక్షతే॥

వామ—ఇమౌ తే రామలక్ష్మణావిత్యర్పయతి
(విశ్వామిత్రః సాదరంప్రతిగృహ్ణాతి) (నేపథ్యే శంఖధ్వనిః)

వామ—(నిమిత్తమను మోదయమానో దశరథముల్లాసయతి.)

(పునర్నేపథ్యే॥) వైతాళికః॥ సుఖాయమాధ్యందినీ సంధ్యా భవతు దేవస్య॥ సంప్రతిహి,

ప॥ కిరతిమిహిరేవిష్వద్రీచః కరానతివామనీ
స్థలకమఠవద్దేహచ్ఛాయా జనస్యవిచేష్టతే
వనగజముఖోత్క్షిప్తైర్నీరాప్యైరపిత్రసరేణుభి
శ్శిశిరమసృణామేణాః కచ్ఛస్థలీమధిశేరతే॥ 54

అపిచేదానీం॥ గ॥ పటీరతరుకోటరమధ్యమధ్యాసీనాః॥

ప॥ ప్రత్యక్షరస్రుతసుధారసనిర్విషాభి
రాశీభిరభ్యధికభూషితభోగభాజః
గాయంతికంచుకవినిర్గత రోమహర్ష
స్వేదోర్మయస్తవగుణా నురగేంద్రకన్యాః॥ 55

విశ్వామిత్రః—సఖే! దశరథ! ప్రియమపితథ్యమాహ వైతాళికః

ప॥ మందోద్ధూతైశ్శిరోభిర్మణివరగురుభిః ప్రౌఢరోమాంచదండ
స్ఫాయన్నిర్మోకసంధిప్రసరదవిగళత్సమ్మనస్వేదపూరాః

దశ—(వారిరువురకు స్నేహముతోనందుకొని కౌశికునితో) మునివర్యా! (ఇట్లనపలుకుచు డగ్గుత్తికతోఁ బలుకలేక వామదేవుని మోమువంకఁజూచు చున్నాఁడు.)

వామ—మహాత్మా! ఇదిగో! మీరామలక్ష్మణులు (ఇచ్చుచున్నాఁడు)

విశ్వా—(సాదరముగాఁ బ్రీతిగ్రహింపుచున్నాఁడు)

(తెరలో శంఖధ్వని).

వామ—(శుభశకునమునకు సంతసింపుచు)

(దశరథుని సంతోషపెట్టుచున్నాఁడు.)

(మరల తెరలో వైతాళికుఁడు) మాధ్యందినసంధ్య దేవరకు సుఖమును గలిగించుగాక. ఇపుడు

తే॥ గీ॥ నట్టనడిమింట రవియుంటఁ బొట్టివగుచు।
మెట్టతాఁబేటి వలెనాడ మేనినీడ।
వనకరులు నోటితుంపురుల్ వరపఁజలువ।
నెనయునను బచ్చికలఁబండుకొనుచు లేళ్లు॥ 54

మఱియు, నిపుడు చందనతరుబృందకోటరంబులంజేరి,

తే॥ గీ॥ అక్కఱనులెల్ల నమృతోమ్ముల్ గ్రక్కవిసము।
డక్కుకోరలు పడగలఁ జక్కవరలఁ।
బొరలఁబుల్కలుఁ జెమ్మటల్ పొరయనురగ।
బాలికలు నీనుగుణములఁ బొడుచుచున్నె॥ 55

విశ్వా—మిత్రమా! దశరథా! వైతాళికుఁడు ప్రియమునకుఁ జెప్పుచున్నను, అది యథార్థమేసుమీ!

సీ॥ ఉరువులొంతనాల బరువులొనొందల
లొక్కింతమెల్లగా నూఁగుచుండ।

జిహ్వాయుగ్మాభిపూర్ణాననవిషమసముద్గీర్ణవర్ణాభిరామం
వేలాశైలాంకభాజో భుజగయువతయస్త్వద్గుణానుద్గృణంతి॥ 56

దశ—సవైలక్ష్యస్మితమధోముఖస్తిష్ఠతి॥
విశ్వామిత్రః రాజర్షే! ప్రత్యాసీదతి దీక్షాప్రవేశకాలః — తదేవంవిధ మధురగోష్ఠీభంగనిష్ఠురాణాం ప్రథమే వయం తావదభ్యవితు మిచ్ఛామః॥
దశ—గ॥ (రామలక్ష్మణావవలోక్య) (బాష్పభరతరంగితలోచనో మునింప్రతి) భగవన్నిత్యర్ధోక్తే వాక్స్తంభం నాటయతి॥
వామదేవః—(ససంభ్రమం) భగవన్ కుశికనందన ! సాధయ శివాస్తే పంథానో వత్సయోశ్చ రామలక్ష్మణయో (రిత్యుత్థాయ సర్వే యథోచితమాచరంతి॥)
విశ్వా—ఏవమాస్యతాం భవద్భిరితి (రాజపుత్రాభ్యా మనుగమ్యమానో నిష్క్రాంతః)॥
దశ-గ॥ (దీర్ఘముష్ణంచనిశ్వస్య) వామదేవ! నూనమిదానీ మస్మానివ భగవంతమపి కౌశికమకారణవత్సలం వత్సలయతి వత్సో రామభద్రః॥

మేలగుర్వాటు నాటికంచుకసంఘ
లందుఁబుట్టియుఁ జాలునందకుండు।
బలుహర్షపుంజెమ్మటల పూరములుమీఱుఁ
గడకొండలందుండు కలికిచిలువ।
చెలువలుచెలువంబు వెలయఁగాఁబలుచనౌ
నిరునాలుకలకల్మి నెనయునోళ్ల।

తే॥ గీ॥ వక్రరంబుల యసమత్వఘక్కిదోఁప।
నవియునివియును బెనఁగొనియల్లుకొనఁగ।
నొక్కమారుగ నిరుగీతు లుగ్గడించి।
పాడుదురుపాళి, నీమేలిపటుగుణాళి!॥ 56

దశ—(సిగ్గుతోఁగూడిన చిరునగవుతోఁ దలవంచుకొనుచున్నాఁడు)

విశ్వా—రాజర్షి! దీక్ష పూనవలసిన సమయము సమీపించుటచేత నీలాటి మధురమైన సద్గోష్ఠికి భంగముకల్గించు కఠినులలో మేమే మొదటివారము కావలసివచ్చినది.

దశ—(రామలక్ష్మణులనుజూచి కన్నీరుగ్రమ్మఁగా, మునితో) ఆర్యా (ఇట్లురపలుకుతో వాక్స్తంభనమును బొందును)

వామ—(తొట్రుపాటుతో) అయ్యా! కుశికనందనా! నీకును రామ లక్ష్మణులకును మేలగుఁగాక!
(అందఱును లేచి యథోచితముగా నిలచియుందురు.)

విశ్వా—సరే! మీరుండుఁడు! (రామలక్ష్మణులతోఁగూడ వెళ్లును.)

దశ—(నిట్టూర్పుబుచ్చుచు) వామదేవా! రామభద్రుఁడు నిజముగ నునకుఁబలెనే యకారణవత్సలుఁడగు నాకౌశికునకుఁగూడఁ బ్రియుఁడైనాఁడు. కాని,

వ॥ కశ్చిదస్మద్వయో గాతిఁ
దుఃఖీ దుఃఖాకరిష్యతి
అపూర్వవిషయాలోక
సుఖీ వాసుఖయిష్యతి॥ 57

వామ—రాజర్షే వయం కౌశికో వేతిక్వపునరేష కన్యాంతిభాగో రామభద్ర మాధుర్యస్యపశ్య॥

వ॥ యదిందోరన్వేతి వ్యసన ముదయం వాసిధిరపా
ముపాధిస్తత్రాయంజయతిజనికర్తుః ప్రకృతితా
అయంకస్సంబంధో యదనుహరతేతస్యకుముదం
విశుద్ధాశుద్ధానాంధ్రువమనభిసంధప్రణయినః॥ 58

దశ—విమృశ్య ఏవమేతత్,

వ॥ రత్నాకరోజనయితా సహజశ్చవర్గః
కింకథ్యతామమృత కౌస్తుభ పారిజాతాః
కింత్వైరచిత్యమిహతత్త్వ వరస్యదేవ
తత్త్వాంతరంకుముదబంధురయంయదిందుః॥ 59

గ॥ పునరవలోక్య కథంలోచనపథ మతిక్రాంతస్స రామలక్ష్మణో భగవాన్ తద్వయమపి వత్సప్రావాసమర్హనసం దక్షిణకోసలే శ్వరదుహితర ముపేత్యదేవీం సాంత్వయామః॥ ... ... *

ఇతి నిష్క్రాంతాస్సర్వే—ప్రథమోంకః.



కం॥ మనల నెడఁబాయుటతమునఁ।
బెనువగపును బూని మునిని విసివించునొ ? యిఁక
గనని విషయములఁ గనుగొని।
ఘనసౌఖ్యముపూని సుఖముకలిగించెదునో ?॥ 57

వామ—రాజర్షి పుంగవా! రామభద్రుని మంచితనమునకు మనమ
నియుఁ గౌశికుఁడనియు భేదమేమి ? చూడుము !

మ॥ జనికర్త్రుల్ శ్వాము కాఁణంబగుట నాసూదరింబనక జాదుప్పెం
పునకస్తాంగతికుబ్బుసుపొక్కలను దెల్పున్నాయమాఁగా కి దే
యనుబంధంబలక్రైరవంబు నటులేయాచుండెదుకగాన నెం
దునువిగ్రైతుహింకుల్ నిజంబుగ విశుద్ధుల్ శుద్ధులందెంతయున్॥58

దశ—(విమర్శించి) అగును నిజమే.

కం॥ జనకుఁడు రత్నాకరుఁడట !
యను జన్మముల స్మృతికౌస్తుభాద్యములట ! యై।
నను జంద్రుఁగుమదబంధుం।
డనుటకచింత్యమెదొ కారణాంతరముండుకా॥ 59

(ఎదుటఁజూచి) ఏమీ ! రామలక్ష్మణులతోఁగూడ సమ్మని
వరుఁడు కన్నోరఁగి దూరమరిగినాఁడు ! కావున మనమును నంతిపురి
కేగి బాలురయెడబాటునకు మిగుల మదికలగియుండు కోసలపుత్రి
యగు దేవి ననునయింపుదము. రమ్ము !

(ఇట్లాదరును వెళ్లుమరు.)

(ఇది ప్రథమాంకము)

సంపూర్ణము.



# అనర్ఘరాఘవే

## — ద్వితీయోంకః —



(తతః ప్రవిశతి యజమాన శిష్యః)

శిష్యః—అయే! ప్రభాతప్రాయైవ రజనీ! తథాహి

శ్లో॥ తమోభిః పీయన్తే గతవయసి పీయూషవపుషి ।
జ్వలిష్యన్మార్తాండోపలపటలధూమైరివ దిశః ।
సరోజానాం కర్షన్నళినయ మయస్కాంతమణివత్
క్షణాదన్తః శల్యం తపతిః తిరద్యాపినరుచామ్ ॥

అపిచ,

శ్లో॥ జాతాః పక్వపలాండుపాండుమధురచ్ఛాయాః కిరస్తారకాః ।
ప్రాచీమంకురయంతి కాశ్చనరుచో రాజీవ జీవాతవః ।
లూతాతన్తువితానవర్తులమితో బింబం దధచ్చుంబతి ।
ప్రాతః ప్రోషితరోచిరంబరతలాదస్తాచలం చంద్రమాః ॥ 2

(సర్వతోవలక్యచ)





# అనర్ఘరాఘవము

## —: ద్వితీయాంకము :—



(తరువాత దర్భలుపట్టుకొని యజమాని శిష్యుఁడు ప్రవేశించి యెదుటఁజూచి)

ఔరా! రాతిరి తెల్లవారవచ్చినదే! అదిగో!

ఉ॥ ఎంతయు వాసివాసెశశి యెల్లెడనల్లెను మందనుండుభా
స్వంతుశిలాళిగ్రక్కుపొగ చాట్పునఁజీఁకటిపెంపు, పద్మినీ
కాంతుఁడు కంజగర్భగతగాఢతరాళి శరాళినయ్యాయ
స్కాంతములాగులాగునవెసన్ వెడలింపజనింపఁడొకనున్॥ 1

(పాఠాంతరము)—

ఉ॥ ఎంతయుఁబెంపువాసె రజనీశుఁడు; చీఁకటి, మందనుండుభా
స్వంతుశిలాళిగ్రక్కు పొగచాడ్పున దిక్కులఁగప్పె; నబ్జినీ
కాంతుఁడు కంజగర్భములఁగల్గు నళిప్రదరాళి, నయ్యాయ
స్కాంతశిలంబలెంగడు వెసన్వెడలింపుచుఁ దోఁచడొకనుణ॥ 1

శా॥ చుక్కల్ నక్షపలాండు పాండురతరాంశుల్ గ్రక్కెనున్ బ్రాఁచిఁబొ
పెక్కన్ దమ్మికిజీవనౌషధములౌనే వేరుచుల్ స్వాంశుప్రుల్
స్రుక్కన్ గుండ్రవిసాలెపట్టువడువై సొంపేసుబింబానసీ
చుక్కిణ వేకువనింగినుండి శశియుస్తగ్రావమున్ జేరెడుణ॥ 2

—(అంతటను గలయఁజూచి)—

ప॥ దిఙ్మాణ్డలీ మకుటమణ్డనపద్మరాగ
రత్నాంకురేకిరణ మాలిరిగర్భితేపి
సౌఖప్రసుప్తిక సుధువ్రతచక్రవాళ
వాచాలపంకజవనీ సరసాస్సరస్యః॥ 3

అపిచ,

ప॥ ప్రాచీవిభ్రమకర్ణికా: కమలినీసంవర్తికాస్సంప్రతి
ద్వైతిసోంరమణీయమంబరమణేర్యాద్యా ముచ్చరంత్యేరుచః
స్తోకోచ్ఛ్వాసమపీనముత్సుక తయాపంభూయకోశాద్బహి
ర్నిష్ప్రాక్ప్రమ్రభునరోఘసంభ్రమవశాదంభోజముజ్జృంభతే॥ 4

అపిచ,

ప॥ ఏకద్విత్రిచతుఃక్రమేణ గణనామేషామివాస్తంయతాం
కుర్వాణాస్సమకోచయద్దశ శతాన్యంభోజసంవర్తికాః
భూయోపిక్రమశః ప్రసారయతితాః సంప్రత్యమూనుద్యత
స్సంఖ్యాతుంసకుతూహలేవ నళినీభానోస్సహస్రంకరాన్॥ 5

కించ,

ప॥ ప్రత్యాసన్నసురేంద్రసింధుర శిరస్సిందూరసాంద్రారుణా
యత్తేజస్త్రిసరేణవోవియుదితః ప్రాచీనమాతన్వతే
శంకేసంప్రతియావదభ్యుదయతే తత్స్వవ్సృటంకోస్మృజా
రజ్యద్భిఃబరజశ్ఛటావలయితోదేవ స్త్విషామీశ్వరః॥ 6

పురోవలోక్య,

గ॥ కథమిద ముదయాచల మౌళిమాణిక్య మర్కమండల మద్యాపి నవిహాయస్థల మలంకరోతి — తదస్మద్గురోర్విశ్వామిత్రాయమాన

మ॥ సకలాశాపటలీశిరోమకుట భాస్వద్రత్నపుణ్మోల్కఁ, యు
ష్ణకరుండై కనుఁ గర్భితుండయి యుండన్నిందుసౌఖ్యప్రసు
ప్తిక భృంగార్భటులన్ సరోజవనులెంతేఁ బ్రౌఢవాచాలతన్।
బ్రకటింపన్ సరసంబులౌచు సరసుల్ బల్ సందడుల్చెందెడున్॥ 3

మఱియు,

మ॥ సవిదిగ్విభ్రమకర్ణికా కమలినీసావర్తికా ప్రాయముల్।
రవికాంతుల్ డివిరెండొ మూఁడొనుచిమీఁద న్దానిచేఁదమ్మిసుం।
తవికాసంబె వహించియున్నపుఁ బ్రమోదంబూనిలోనుండియొం।
తొవడిన్వేఁవ్వతేట్ల సందడులనస్తోకంబుగావిచ్చెడున్॥ 4

మఱియును,

ఉ॥ ఒక్కటి రెండు మూఁడు మఱియొక్కటి యంచును మిన్కులిన్కునన్।
ష్ఠాళ్కకరుక్కె లెక్కిడఁగనోయనమోష్ఛివ నేయి రేఖలే।
యక్కరముల్ సహస్రమిపుడల్లన రాఁగములయ్యెగ్రమ్మఱన్।
లెక్కకు మిక్కువంబలె, బలే! విడువందొడఁగెం గ్రమమ్ముగాన్॥ 5

ఇంతియగాక,

చ॥ హరిహయకుంభికుంభసముదంచితకుంకుమపంకమైత్రిచే।
నరుణితను పొచ్చు తేజపరమాణులు ప్రాచినిదోఁచనొప్పుచో।
ప్పరయఁగఁ ద్వష్ట్రృశాణకషణారుణ బింబలవప్రజశ్ఛటా।
పరివృతుఁడై వడిం గమలబాంధవుఁడుత్తోఁచునటంచుఁ దోఁచెడున్। 6

(ఎదుటనుజూచి)

ఇదియేమి? యింకనుఁ బొడుపు కొండకుఁ దలమూఁకాడై వే
కెలుఁగు, వెలుఁగకున్నవాఁడు. పోనిమ్ము, యీయవకాశమునందే

యజ్ఞస్య కులపతేః కౌశికస్యా దేశాత్సమిదాహరణాయ ప్రస్థితోఽస్మి తత్ త్వరితతరం (గచ్ఛామీతి పరిక్రామతి.)

(ప్రవిశ్య సంభ్రాంతో వటుః)

వటు—ఆర్య! కిమప్యాశ్చర్యం భీషణం చ వర్తతే॥

హరిస్వ—(సచమత్కారం పరివృత్య) సఖే! కిమాశ్చర్యం భీషణం చ

వటు—రామ ఇతి క్షత్రియకుమార ఆగత ఇతి శ్రుత్వా కౌతూహలేన తం ప్రేక్షితుం ధావన్ సాతపోవన పర్యంత ప్రతిష్ఠితా ప్రస్తరపుత్రికా సత్యమేవ మానుషీభూయ మమ సమ్ముఖం పరాపతితా తాం ప్రేక్ష్య ఉత్తరాసంగ వల్కలమపి ఉజ్ఝిత్వాపలాయితోఽస్మి॥

హరిస్వ—(విహస్య) సఖే! సాధుకృతం. శ్రుతా దిష్ట్యా హి తే జీవతః పునరావృత్తిః।

వటు—తస్మాద్రక్షతు మామార్యః అస్యా దుష్టరాక్షస్యా ముఖాత్।

(ఇతి వేపమానః పాదయోః పతతి)

హరిస్వ—(విహస్య) (ఉత్థాప్యాలింగ్య చ) వయస్య! శ్రుణోషి భగవతో గౌతమస్య మహర్షేః రహల్యాం నామ ధర్మదారాః

వేగముగానేగి గురుననుమతిబూఱకుండ జేన్నమునకుఁగాఁ దీసికొని రమ్మనిన దర్భలు వేళకందఁజేయుదును. (అని వెళ్లుచున్నాఁడు.)

(భయపడుచు నటుఁడొకఁడు ప్రవేశించును.)

వక్రనాసుఁడు—హ్రస్వబాహా! ఇప్పుడు నాకెంతయును వెఱపుగాను వెఱుగుగాను నున్నయది.

హ్రస్వబాహుఁడు—(చమత్కారముగఁ దిరిగిచూచి) సఖా! వక్రనాస! ఏమి వెఱుగు? భయమెందుకు?

వక్ర—రాముఁడను రాకొమరుఁడెవ్వఁడో వచ్చినాడనివిని యాతనిని జూడవేడుకతో వేగముగా వెళ్లుచుండఁగా నాతపోవన ప్రాంతమున నిలువఁబడియుండిన యొకరాతిబండ చూచుచుండ నిట్టె నిజముగ నాకన్నులయెదుటనే యొక మానవకాంతయై చేర చేర నడచి నామీఁదకు రాఁజొచ్చినది. ఆమెనుఁజూచి గుండెలునీరయిపోయి పైబట్ట జారిపోవుటయైనం గనిపెట్టక చటాలున నీతట్టునకుఁ గాలికొలఁదిఁ బరుగెత్తుకొని వచ్చితిని.

హ్రస్వ—(నవ్వి) వెచ్చెలీ! బాగుగాఁజేసినావు. పుణ్యవశమునఁబ్రతికి తిరిగివచ్చి నాకంటఁబడితివి పోనిమ్ము!

వక్ర—ఆర్యా! ఆదుష్టరాక్షసి వాతంబడకుండ నన్ను గాపాడవలయును.

(వడ వడ వణఁకుచు నతని పాదములపైఁ బడుచున్నాఁడు.)

హ్రస్వ—(నవ్వి) (లేవనెత్తికౌఁగలించుకొని) మిత్రుఁడా! ఉచథ్య పుత్రుఁడగు పూజ్యుఁడైన గౌతమమహర్షికి ధర్మపత్నియగు నహల్యయనునామెను నీవు వినియుండలేదా?

వశ్రి—శు్రిణో౽మియాజనకవంశ పురోహితస్య తత్రభవతశ్శతానంద స్యజననీ॥ తతస్తతః,

హా్రిస్వ—సేయం పురుహూతఖండితచారిత్రస్య దీర్ఘతపసోము నేర్గన్యానా నిజమేవతదింద్రియదౌర్బల్యమేవం వివర్తమాన మనుభవాతీసంప్రత్యస్య రఘురాజపుత్రస్య తేజసా తస్మా దంధకారాన్నిరముచ్యత-తదలమావేగేన

వశ్రి—అహో! ఆర్యప్రసాదేనపునరపిజీవలోకేప్రతిష్ఠాపితో౽స్మి-తథా ౽శంకాజ్వరోద్వ్యాపినూం నపరిత్యజతితస్మాదార్య! ముహూ ర్తం విశ్రామ్యతాం।

హా్రిస్వ—సఖే! భయమితఃకిమేతద్బ్రాహ్మణస్య తత్పర్యవస్థాపయా త్మానం (మిత్యుపవిశతః)

వశ్రి—(చిరం విమృశ్య సవిస్మయం) కథం విషయమృగతృష్ణార్ఘళం ఝళ్యాంభగవతా హరిణాపిహరిణతా విడంబ్యతే॥

హా్రిస్వ—సఖే! సానుబంధీవిభవాః - అల్పీయాం ఖల్వయంలోకః। కథమైహికసుఖాస్వాదలుబ్ధై ర్యాభయస్యా రాత్రియః పరా హణ్యంతే - * * * *

* * * * *

వశి—ఔను, వినియున్నాను, ఆమె యిప్పుడు జనకవంశమునకుఁ బురోహితుఁడై యున్న శతానందుని తల్లి గాదా? తరువాత,

హ్రస్వ—అవునామె పూర్వమింద్రుని వలనఁ బాతివ్రత్య భంగము నొంది మహాతపశ్శాలియగు నాగౌతముని కోపముచే నట్టి దుస్థితిని బొందియుండెనుగాదా? ఆమె మరల నిపుడీ రఘురాముని తేజోవిశేషమున నయ్యంధకారమునుండి తప్పింపఁ బడియెంగావచ్చును. కావున నీవిట్లు జడియఁబనిలేదు. ఇఁక నది విడువుము.

వశి—(కన్నులువిప్పి యెదుటఁజూచి) ఆర్యా! నీయనుగ్రహమువలన మఱల జీవలోకమునఁ బ్రవేశింపఁగలిగితిని. కాని యింకను నన్ను శంకాంకురము విడువకున్నది. కావున నింక నొక ముహూర్తకాలమిట్లు నిలువనిమ్ము.

హ్రస్వ—నెచ్చలీ! బ్రాహ్మణునకు భయమననేమి? స్థిమితపడుము! స్థిమితపడుము! (కూర్చుండురు.)

వశి—(చాలసేపు విమర్శించి యాశ్చర్యముతో) ఆర్యా! ఏమిది! భగవంతుఁడగు నమ్మఘవంతుఁడుఁగూడ విషయమృగతృష్ణికల యందు లేడియై సంచరించినాఁడు.

హ్రస్వ—మిత్రమా! బాగుగానడిగినావు. యేమిచెప్పుదును? లోకము మిక్కిలి నీచతమమైనది. భ్రాంతిగా దూరదృష్టిందక్కి మిక్కిలిపొగరెక్కి యసత్యములయ్యును నిక్కముగాఁదోఁచు నతితుచ్ఛతరంబులగు సుఖపరంపరలందు పశుప్రాయులగు

వశ్రి—మన్యే ఏతస్యాః మునిగృహిణ్యాః పుణ్యపరిణామో రామ
ప్రవాసే కారణం।

హ్రిస్వ—ఇదం తావత్ప్రథమం।

వశ్రి—(సప్రార్థనమ్) ఆర్య! ద్వితీయమపి శ్రోతుమనేన తే వచనేన
పర్యుత్సుకోఽస్మి యత్కథనీయమ్-

హ్రిస్వ—సఖే! త్వయికిమకథనీయంనామ - అస్తి కిష్కింధాయాం
పురందరస్యనందనో వాలీనామ ప్లవంగరాజః - తంచరజ్య
చరచక్రివర్తినా దశకంధరేణ ప్రివృద్ధమైత్రీక నీమవలోక
వానరాచ్ఛభల్ల గోలాంగూల ప్రభృతీనామాచార్య స్సర్వా
మాత్యానుమతో జాంబవా నిద మవాదీత్।

వశ్రి—(సకౌతుకం) తతస్తతః॥

హ్రిస్వ—రాజన్ మాయావినీ రాక్షసజాతిః విశేషతశ్చమహేం
ద్రావస్కంద కందళితవిక్రమః పితృవైరీ తవాయంరావణః అ
పిచ త్వదీయదోర్మూలనిపీడనగళిత పౌరుషోనవిశ్వాజయాతి
ప్రస్వయమాశంకనీయః నాపిసామంతాంతర జిఘృక్షయా
మాతరాశవర్తిని సముద్రలఘుసముత్థః తదనేనసురాసుర
విజయినాపి విరుద్ధమండలేనరాక్షసరాజేన మైత్రీ స్వనథాన

మూఢమానవులెన్నెన్ని రాత్రులను నిరర్థకముగాఁ గడపుచుండుటలేదు? సామాన్యమానవులే యిట్లుండ త్రిలోకాధిపత్యము వహించిన యిట్టి భోగపరాయణుల మాటజెప్పనేల?

వక్రి—ఆర్యా! ఇచ్చటికీ రామచంద్రునిరాకకు కారణ మీమునిపత్నిపుణ్యపరిపాకమని తలఁచెదను.

హ్రస్వ—ఇది యొకటిది.

వక్రి—(సప్రార్థనముగ) ఆర్యా! నీచెప్పినమాటచేనతనివలనఁ గలుగనున్న రెండవ కార్యముఁగూడ వినవేడుకవొడముచున్నది.

హ్రస్వ—మిత్రమా! నీకును జెప్పఁగూడనిదెద్ది? వినుము. కిష్కింధయనుపురంబున నింద్రుని కొమరుఁడగు వాలియను వానరరాజొకఁడుగలఁడు. అతనికి సర్వరాక్షస చక్రవర్తియగు రావణాసురునితో గాఢమగుమైత్రి యుంటంజూచి తక్కిన యెల్లమంత్రుల సమ్మతినిఁబడసి యాకపిభల్లూకములకు గురువగు పెద్దమంత్రి జాంబవంతుఁడవ్వాలితో నిట్లు చెప్పినాఁడు.

వక్రి—(వేడుకతో) తరువాత! తరువాత!

హ్రస్వ—"రాజా! రక్కసులు మిక్కిలి మోసగాండ్రు. అందును విశేషించి నీతండ్రితోడి యుద్ధంబునందు కపటవిజయమును నిజపరాక్రమంబు చేసెనని ప్రగల్భములాడు నీరావణుఁడు నీకు పితృవైరియు నవిశ్వసనీయుఁడునై యున్నవాఁడు. ఇంతియగాక వెనుక నీవీతనిని జంకనిరికించికొని మిక్కిలి నొక్కిపిడచుటచే స్రుక్కి పౌరుషంబుదక్కి యున్నవాఁడే కావున నితఁడు

నుబంధినీ కించ సర్వథైయమనుపకారిణీ పౌలస్త్యేషుప్రీతి
రితి భగవానిహోదాహరణం హరిణాంకశేఖరః॥

తథాహి॥

ప॥ ఉక్షారథోభూషణ మస్థిమాలా
భస్మాంగరాగో గజచర్మ వాసః
ఏకాలయస్థేపి ధనాధినాథే
సఖ్యాదశేయం త్రిపురాంతకస్య॥ 7

వక్ర—అహో! స్థవిరశ్శల్లూకస్యమంత్రోపన్యాసః పరిహాసకుశలతాచ!
తతస్తతః।

హరిస్వ—తతశ్చతద్వచనంజరాప్రలపితమిత్యపహసతిహరీశ్వర ఉపాం
శుతదనుత్వా మహామాత్యస్య కేసరిణఃపుత్రో హనూ
మాన్ కుమారం సుగ్రీవమాదాయ ఋశ్యమూకంనామ
పర్వతదుర్గమనుప్రవిష్టః

త్రిలోక విజయుండను సందియమును గూడ నొందఁబనిలేదు గదా! మరియు నీకు సామంతరాజులతోఁ దటస్థించు యుద్ధములందు సాయపడు ననుకొనుటకైనను నెక్కడనో మహాసముద్రమున కవ్వలనున్న యీతనివలన నదియును నదనునకు సంభవించుట దుస్తరము. కాఁబట్టి యతఁడెంత సురాసుర విజయుఁడైనను దుష్టసమాజముతోఁ గూడిన వాఁడగుటచే నీతనితో మైత్రి యేరికైనను ముప్పుఁదేక తప్పదు; ఇంతియకాదు. ఈపౌలస్త్యుల డెందమునందుఁ బరోపకారబుద్ధి యించుకయునుండదనుట కలయీశ్వరుఁడె యుదాహరణము చూడుడు.

శా॥ కట్టం బట్టనదంతిచర్మ, మలదం గందం బనాబూది, మైఁ
బెట్టంసొమ్ములటన్న నెమ్మ, లెటకేవిచ్చేయ నెద్దే రథం
బ, ట్టేకాసనహాసిమైధనదుసఖ్యం బొంతయుంబూరి లోఁ
జుట్టంబైన పురాసురారికి; భళీ, చోద్యంబు లీసఖ్యముల్ !॥ 7

శక్ర—ఆహా! యేమి! యీముదుసలి భల్లుకము నుంత్రోపన్యాస ప్రౌఢిమయుఁ బరిహాసకౌశలంబును! తరువాత, తరువాత.

హ్రస్వ—తరువాత ముదిమిని మదిదప్పి చెప్పఁజొప్పని యప్పలుకు లొక్కింతయు లెక్కసేయక యక్కపినాథుఁడు వెక్కిరించి నంతట మిక్కిలి రహస్యముగ నాజాంబవంతు ననుమతిఁబడసి మహామాత్యుఁడగు కేసరియనువాని కొమరుఁడగు హనుమంతుఁడు యువరాజైన సుగ్రీవుందోడ్కొనిపోయి మునిశాపమున వాలికిఁ జొరశక్యముగాని ఋష్యమూకమను పర్వతంబునం బ్రవేశించినాఁడు.

వక్రి—ఆర్య! సమారుతిర్నామ త్రైలోక్యైకమల్ల ఇతిశూయతే।

హారిస్వ—అథకిమ్,

వక్ర—ఆర్య! యథాతథా వా భవతు స్వామిసావ్యేవ. తంపరిత్యజ్య నసదృశస్తా దృశస్యమహాభాగస్య ప్రతికూలపరిగ్రహః॥

హారిస్వ—(విహస్య) సఖే! పురైనకిలా యమనూంజనేయో భగవతస్స హస్రకిరణా ద్వ్యాకరణవిద్యా మధీయాన స్తదాత్మజన్మనో వానరయోనే స్సుగ్రీవస్య సాహాయక మభిప్రాయజ్ఞో గురు దక్షిణీచకార॥

వక్రి—హుం తనుచితమేవ గురుపుత్ర స్సబ్రహ్మచారీ వానువర్త్యేత ఇతి తతస్తతః

హారిస్వ—తతశ్చ అహింభయో పజాపజర్ఝరం సుహృద్గృహా ఇత్యు పశ్రుత్య రాక్షసరాజః ఖరదూషణత్రిశిరోభిర్మహామా త్యైర ధిష్ఠితమాత్మబలైకదేశం సింధోరుదీచీకూలే వాలిపరిగ్రహా య ప్రహిణోత్॥

వక్రి—కథమపరిహీన మిత్రధర్మోపి రాక్షసః॥

హారిస్వ—సఖే కిముచ్యతే॥

వక్రి—(సాకూతముగా) ఆర్యా! ఆయాంజనేయుఁడు త్రైలోక్యమల్లుఁడని చెప్పుకొనుచుందురు.

హ్రిస్వ—సందియ మేమి ?

వక్రి—(అనుమానముతో) ఆర్యా! ఎట్టివాఁడయిన నగుఁగాక! ప్రభువు ప్రభువేకదా! యతనిని విడిచి యాతవానితోఁ బ్రతికూలత వహించుట మాత్రమంత యుక్తముగా నుండలేదనుకొనెదను.

హ్రిస్వ—(నవ్వి) సఖా! మొదలనె యాయాంజనేయుఁడు సూర్యభగవానునియొద్ద శబ్దశాస్త్రాధ్యయనమొనర్చి తదభిప్రాయమెఱిఁగి యతనికి వానరస్త్రీయందు జనించు కుమార సుగ్రీవునకు సాహాయ్యమొనర్చుచుంటయే గురుదక్షిణగా నిచ్చియున్నాఁడు గాదా!

వక్రి—అట్లయిన సరియే. గురుపుత్రునకతఁడు తోడునీడయైయుంట యుక్తముగానే యున్నది. తరువాత, తరువాత!

హ్రిస్వ—తరువాత నెచ్చెలియగు వాలియింట నీలాటి గృహకలహములవలనఁ గలిగిన వెత్తినెఱిఁగి యారాక్షస రాజగు రావణుఁడు మిత్త్రుఁడగు వాలికిఁ గాపుగా నుండుటకుఁగాను ఖరదూషణ త్రిశిరుల యాధిపత్యముతోఁ గొంత సైన్యమును సంద్రమున నుత్తరభాగమునందు విడియించి యున్నాఁడు.

వక్రి—ఇదియేమి! రక్కసిఱేనికి మిత్త్రధర్మజ్ఞతకూడ నుండెనా ?

హ్రిస్వ—నెచ్చెలీ! యేమనవచ్చును? అతనికినచ్చిన నేమిచేసినను జేయఁగల మహా సాహసుఁడుగదా!

రావణః ఖల్వసౌ॥

ప॥ ప్రియాకర్తుం కస్మైచన నిజశిరఃకర్తనరస
ప్రహృష్యద్దోర్ద్రుమాంచ స్సపరమిహాలంకాపరిబృఢః
విలక్షవ్యాపారం కిమపిదదృశుర్యస్యదశమం
శిరస్తే మూర్ధానః క్షణహృతపునర్జన్మసుభగాః॥ 8

వశి—(సకౌతుకం) తతస్తతః॥

ప్రహస్త—సుకేతుసుతా నాగసహస్రబలధారిణీ తాటకానామ రాక్షసీ
తస్మాద్వనీకాదాగత్య మనుష్యమండలవిహారకౌతుకాదిమా
మస్మదీయాంభూమిమధివసతి॥

వశి—నాగసహస్రబలా స్త్రీతిమయా అశ్రుతపూర్వం ఖల్విదం॥
తతస్తతః॥

ప్రహస్త—తతశ్చా స్యాశ్చకమానశ్చ్యుతవిధేః ప్రత్యూహాం కులప
తేరిమాం రామలక్ష్మణా వాసితవాన్॥

వశి—జానే రామ ఇతి రాక్షసానాముపర్య వతీర్ణః ఖల్వేషః॥

ప్రహస్త—సఖే ఏవమేవైతత్ రామభద్ర ఇత్యయం కోపిచతురక్షరో
రాక్షసశిక్షాసిద్ధమంత్రః విశేషతః పునరిదానీం కౌశికేన భగ
వతా బ్రహ్మజ్యోతిష స్తాదృశం వివర్తం దివ్యాస్త్రమంత్ర
పారాయణ మాశ్చర్యమధ్యాసితః॥

చ॥ ఎతనికొ ప్రీతిగాఁ బులకలే తమిఁ దెల్పెడురీతిగాఁ దృటిన్
హృతిపునరుద్భవంబులు వహించెడు తొమ్మిది, కల్గదయ్యెఁద
ద్గతియనివిన్న నాపదవదానిహసించెడుభాతిగా స్వశీ
ర్షతతిని దుంచుకొన్న యలరావణుఁ డేవిధికింకఱం కెఱుఁగ ?॥ 8

వక్రి—(కుతూహలముతో) తరువాత, తరువాత.

హ్రస్వ—తరువాత సుకేతుఁడను దైతేయుని తనయ వేయేనుగుల బలముగల తాటకయనునొక మోటురక్కసివచ్చి మనుజ మండలములందు విహరించువేడుక కలదయ్యె: మనయాప్రాంత భూములందె సంచరించుచున్నది.

వక్రి—ఏమి! యెంతయు వింతగానున్నది! నాగసహస్రబలయగు నొకయబల యుండునని యెన్నడును వినియుండలేను. తరు వాత, తరువాత.

హ్రస్వ—తరువాత నాకరాళ రక్కసిచలనఁ దనచేయుజేన్నమునకే మైన నంతరాయము సంభవించునో యను సందియమునంది మన గురువుగారీ రామలక్ష్మణులను దోడ్కొని వచ్చినారు.

వక్ర—ఈరామభద్రుఁడీ రాక్షసవధార్థమై యుద్భవించెననుకొనెదను.

హ్రస్వ—అగునాలాగుననే, "రామభద్ర" యనునది రాక్షస సంహారకమగు నెదియొ నాలుగక్షరముల ప్రసిద్ధ మహామం త్రము. పైగానిప్పుడు, పూజ్యుఁడగు కౌశికమహర్షి బ్రహ్మ తేజో వివర్తమగు నత్యద్భుత ప్రభావముగల దివ్యాస్త్రమ హామంత్రమును గూడ నితనికిఁ బూర్తిగా నుపదేశించి యున్నాడు.

వక్ర—మన్యేమంత్రమయీభిరస్త్రదేవతాభిస్సమం బలాతిబలే శక్తీ
రామేసంక్రమిష్యత ఇతి॥

హ్రాస్వ—అథకిం తదాసంవృత్తమేవ॥

వక్ర—ఆర్య! ననుభణామినిజా ఏవమంత్రశక్తయో నిజా ఏవాస్త్రవిద్యాః తత్ కిమిత్యాత్మనః క్రతువిఘ్నోపశమే రాఘవస్య గౌరవమర్పయతి తత్రభవాన్ కౌశికః? అథవా ప్రాఘూణికహస్తేన సర్పమారణం ఖల్వేతత్॥

హ్రాస్వ—సఖే అనభిజ్ఞోఽసిస్వయంప్రయోగా దంతేవాసిభిః ప్రయోగో మహిమానమాచార్యాణా ముపచినోతి॥

పశ్య,

ప॥ స్థానే స్వశిష్యనివహైర్వినియుజ్యమానా।
విద్యా గురుం హి గుణవత్తరమాతనోతి।
ఆదాయశుక్తిషువలాహక విప్రకీర్ణైః।
రత్నాకరో భవతివారిభిరంబురాశిః॥ 9

వక్ర—ఆర్య! శోభనంమంత్రయసే అన్యత్పునరపిప్రష్టుకామోస్మి॥

హ్రాస్వ—తత్కిం॥

వక్ర—కథం సర్వథానిగూఢం వానరాణాంషాడ్గుణ్య మార్యేణ ప్రతిపన్నం॥

వశి—అట్లయిన నమ్మంత్ర స్వరూపిణులగు నస్త్రాధిదేవతలతోఁ గూడ బలాతిబలలను శక్తులుగూడ శ్రీరామభద్రునియందు సంక్రమింపఁగలవను కొనెదను.

హాస్వ—కాకేమి? అదియునైనది.

వశి—(అనుమానింపుచు) ఆర్యా! నాకొక సందియము వొడము చున్నది. తనదయిన శక్తియుఁ తననయిన యస్త్రవిద్యలును గదా! అట్టులయిన నిప్పుడు మన గురువుగారు తన యజ్ఞ సంరక్షణగౌరవము నారాఘవునియం దారోపించు చున్నా రేమి? (నవ్వి) ఇది యింటికరుదెంచిన పైవానిచేఁ బాముకు జుపించుటకావచ్చును.

హాస్వ—అయ్యయ్యో! మిత్రమా! నీవు తెలియకున్నావు. స్వయముగానొనర్చినచేతకంటెఁ దనశిష్యులచేఁజేయించినయదియె గురువునకు కరంబు ప్రీతిభాకరంబై వరలుచుండును.

చూడుము,

తే॥ గీ॥ తగినచోటఁగొంది శిష్యసంతతుల విద్య।
యరయ నాచార్యునే గుణోత్తరునిజేయు।
తనజలమె మబ్బులిడ శుక్తులనుగ్రహించి।
యబ్ధి రత్నాకరుండయి యలరుఁగాదె॥ 9

వశి—ఆర్యా! అగును నిక్కమే నీవు చక్కఁగా వక్కాణించితివి. ఇఁకనొక్కటిగూడ నడుగ వేడుకపడుచున్నాఁడను.

హాస్వ—అదియేది?

వశి—అంత మహారహస్యముగఁ జరిగిన యావానరుల మంత్రమం తయు నీకెట్లు తెలియవచ్చినది?

హారిస్య—సర్వమేతదయోధ్యాయాత్రాయాం సమాధిమయేనచక్షు
షాసాక్షాత్కృత త్రిభువనవృత్తాంతస్య తాతవిశ్వామిత్రస్య
ముఖా దశ్రౌషం

(సర్వతోఽవలోక్య) అహో! ప్రాభాతికీ త్రిభువనలక్ష్మీః

తథాహి॥ ప॥ ప్రత్యగ్రజ్వలితైః పతంగమణిభిర్నీరాజితా భానవః
సాంద్రైః కురువిందకందళరుచః ప్రాచీమలంకుర్వతే
ప్రౌఢధ్వాంతకరాళితస్య వపుషశ్ఛాయాచ్ఛలేనక్షణా
ద్ప్రక్షాళితనిర్మలం జగదహిర్నిర్మోక మున్ముంచతి॥ 10

ప॥ పీతాభ్రశకలకుట్మల శుక్తికోశా
దోషాతనీంతిమిరవృష్టి మధస్స్ఫుటంతః
నిర్యన్మధువ్రతకదంబమిషాద్వమంతి
బిభ్రంతి కారణ గుణానివమౌక్తికాని॥ 11

అపిచ॥ ప॥ వికసితసంకుచితపున
ర్వికస్వరేష్వంబుజేషు కులటాఖ్యాః
కలికాః కథయతి నూతన
వికాసినీర్మధులిహామఘుః॥ 12

(ఆదిత్యంనిర్వర్ణ్య॥)

ప॥ కటుభిరపికఠోరచక్రవాకో
త్కరవిరహజ్వరశాంతిశీతవీర్యైః
తిమిరహతమయం మహోభిరంజ
జయతిజగన్నయనౌఘముష్ణభానుః॥ 13

హారిస్వ—నాకిదియుఁ తయు నయోధ్యకరుగునప్పుడు తన దివ్యజ్ఞాన సంపత్తివలనఁ ద్రిభువనవృత్తాంతవేదియై యలరుచుండు మన గురువుగారె సెలవొసంగి యున్నారు.

(అంతటను దిలకించి) ఆహా! ప్రాభాతిక త్రిభువనశోభ!

చ॥ అరుణ, నవీనసద్రుచుల నర్కశిలాళి నివాళిఁగూర్పఁగా।
నవకురువిందసుందరములౌ నిను రోచులు ప్రోచిఁదోఁచెడున్।
భువన భుజంగమూర్ధ్న నలుపున్గొను మేపారనీడ వేరఁ దా।
నవలను వీడు; క్షాళనమునందకె తోఁడనె స్వచ్ఛమైతగన్॥ 10

చ॥ తమిఁదిమిరంపు వృష్టిఁగొని తామర మొగ్గల పేరిశుక్తికో।
శములిపుడొప్పు విప్పునవెసంగుచు నీర్యదళీవప్రిజంబు పే।
రమరగనోలిఁ గారణగుణాప్తిని గాంచినలీలఁగ్రాలు ను।
క్తైములపరంపరల్వరపుతీరదె! మెచ్చకతీరదెంతయున్॥ 11

తే॥ గీ॥ విచ్చిముకుళించి క్రొన్నెటి విడువఁబోడఁగు।
నంబుజంబులలో నూతనంబుగాఁగ।
విడుచుమొగ్గలఁ గనఁజాలు వీలుఁగూర్పఁ;।
దుమ్మెదల ఝుమ్మరనిక్రొమ్మనుమ్మరమ్మ! ॥ 12

(పైనిఁజూచి సూర్యుని నిరూపించి)

చ॥ అమరెను, నష్టరోచికటువయ్యె స్వశుక్తి సోకి కోకి క।
త్యమిత కఠోరఘోర విరహ జ్వరతాపముఁ బాపనోపు నై।
త్యమె వడిఁజూపు బల్మహిమనంది యమందపులీలఁ గ్రాలుచున్।
దిమిరహతంబులైన జగతీనయనమ్ముల కంజనమ్మదే॥ 13

తదనుజానీహి మాం సమిదాహరణాయ,

వక్రి—అహమపి క్షత్రియకుమారయోర్దర్శనే ఉత్కంఠితోస్మి తత్కథయకథంపేక్షామి॥

హస్వా—(విహస్య) నన్వేతావేవయజ్ఞవాట ముత్తరేణ విహారభూమి షుక్రీడతః తదుపేత్యనిశ్శంకమవలోకయ (ఇతినిష్క్రాంతౌ)

(మిశ్రవిష్కంభః)

---



పాఠాంతరము—

చ॥ తిమిరహతంబులైన జగతీనయనంబుల కంజసంబులై
యమరు నిజద్యుతుల్ కటువులయ్యెను వింతగఁ గోకపాళిక
త్యమిత కఠోరఘోరవిరహ జ్వరతాపము బాపనోపునై
త్యమె వెసఁ జూపజాల్మ్రహీనునంది వెలుంగ నినూడెసంగెడున్॥ 13

కాఁబట్టి యిప్పుడు నన్ను సమిధలుకొనివచ్చుటకు విడిచిపెట్టుము

వశి—నాకా రాకొమరులం జూడ వేడుక మెండుగానున్నది. కావున నెక్కడ వీలుగానుండునో కొంచెము చెప్పుము.

హరిస్వ—(నవ్వి) ఇదిగో! ఇక్కడనే యీయజ్ఞవాటిక కుత్తరపు వైపుననున్న విహారభూముల యందాడుకొను చున్నవారు. అక్కడకు వెళ్లి చక్కఁగ జూడవచ్చును.

(అని వెళ్లుదురు,)

—( ఇది మిశ్ర విష్కంభము. )—



తతః ప్రవిశతో రామ లక్ష్మణౌ॥

రామ—విచిత్రమిదమాయతనం సిద్ధాశ్రమంనామ భగవతో గాధి నందనస్య॥

ప॥ తత్రాద్యక్ష్ణపూల కోపనయనక్లేశాచ్చిరద్వేషిభి
ర్మేధ్యావత్సతరీవిహాస్య వటుభిస్సోల్లుంఠమాలభ్యతే।
అప్యేష ప్రతనూభవత్యతిథిభిస్సచ్ఛాద్వసనా సాపుటై
రాపీతోమనుపర్కపాకసురభిః ప్రాగ్వంశజన్మానిలః॥ 14

లక్ష్మ—ఆర్య అత్రైవకిల॥

ప॥ దేవః కౌస్తుభకింజల్క
నీలోత్పలమయోహరిః।
స్వయం కిమపితత్తేపే
తపః కపటవామనః॥ 15

ప॥ ఇత్థమేతన్మహాతీర్థ
మధ్యాసీనా ద్విజాతయః
అకుతోభయ సంచారా
షట్కర్మాణి ప్రయుంజతే॥ 16

(అన్యతోదృష్ట్వా॥) ఆర్య,

ప॥ పశ్యైతే పశుబంధవేదివలయై రౌదుంబరీదంతురై
ర్నిత్యవ్యంజితగృహ్యతంత్ర విధయోరమ్యాగృహస్థాశ్రమాః
యత్రామీగృహమేధినః ప్రచలితస్వారాజ్యసింహాసనా
వైతానేషు కృపీటయోనిషు పురోడాశం వషట్కుర్వతే॥ 17

(తరువాత రామ లక్ష్మణులు ప్రవేశించుచున్నారు.)

రామ—ఆహా! పూజ్యుఁడగు నీగాధినందనుని సిద్ధాశ్రమమను మం
దిర మెంత సుందరముగా నున్నది!

ఉ॥ ఆయతమా పగన్నగి తృణాశనయన శ్రమమాను నేటితోఁ।
బోయెనటంచు యజ్ఞపశుపున్వటువుల్ గొనివత్తు, హేళనన్ ।
సేయుచు; కమ్మనై పరిమళించెడు తత్పలపాకజాతస ।
ద్వాయువు నాసికాపుటులఁదగ్గయుఁబీల్చి సుఖింతురాగతుల్॥ 14

లక్ష్మ—అన్నయ్యగారూ! ఇక్కడనే కాదా?

తే॥ గీ॥ వక్షమునఁనొప్పు కౌస్తుభ ప్రభలు కేస।
రములునాఁగ్రాల నీలోత్పలములఁబోలె।
వరఁలుదేవుండు కపటంపు వామనుండు।
వ్రతమెనో యొనర్చెనని జనుల్ వలుకుచుంద్రు॥ 15

ఉ॥ అక్కరణిన్నిరంతరము నక్కజమౌనియమంపుఁ బెంపుతో ।
నెక్కరణిన్నయుంబాదవు, నిక్కడనుంచుచు నెమ్మనమ్ములం ।
దెక్కుడునమ్మకమ్ములర నిచ్చెమెయిన్ ఘటియింతురిచ్చటన్।
బెక్కులు నెక్కటంపుఁ బృథివీదివిజుల్ యజనాదిషడ్విధుల్॥ 16

(మరియొకవైపుగఁజూచి)

శా॥ ఔరౌరా! పశుబంధవేదికలనౌ నౌదుంబరశ్రేణులే।
వాగల్గూరుచు నిత్యకృత్యములఁ దోఁపన్జేయ మున్నాశ్రమా ।
గారంబుల్ చెలువారుఁగంటె, యిటవేడ్కన్ వ్రేల్చెడిన్ హవ్యముల్
స్వారాజ్యాసనమిట్టటూఁగఁగ గృహస్థశ్రేణి యాగాగ్నులన్॥ 17

రామః—(సహర్షస్మితం) ఇతోపి తావత్కృతార్థ యావశ్చక్షుషీ. ప్రసన్నపావనోయమృషీణాం సమవాయః ।

ఇదమమీషాం॥ ప॥ పూరయిత్వేవ సర్వాంగ
మతిరిక్తాస్థిరాతతీః
జటారూపేణ బిభ్రాణై
శ్శిరోభిర్గహనంపదః ॥ 18

ప॥ తపః కృశతమైరంగై
స్స్రష్టుమాకారితైరివ
సాయంప్రాత రమీపుణ్య
మగ్నిహోత్రముపాసతే ॥ 19

లక్ష్మణః—(సహాసం) ఆర్య ! రమణీయమితోవర్తతే॥

ప॥ బాలేయతండులవిలోపకదర్థితాభి
రేతాభిరగ్నిశరణేషు సధర్మిణీభిః
ఉత్త్రాసహేతుమపి దండముదస్యమాన
మాఘ్రాతుమిచ్ఛతి మృగే మునయోహసంతి॥ 20

రామః—(పరికామ్య సకౌతుకానురాగం) వత్స ! ఇతోపి తావత్॥

రామ—(సంతసముతోఁగూడిన చిరునగవుతో) తమ్ముఁడా! యిటు రమ్మిందుఁగూడఁ గన్నులకు విందొనరించుకొందము. ఆహా! చూడుమీ ప్రసన్న పావనమగు మహర్షిసముదాయ మెంత ప్రమోదదాయకమై యలరుచున్నది.

కం॥ ఒడలెల్ల నల్లి మట్టిపైఁ।
బడి నాడులు ప్రాకితలలపైఁ బెనగొనిన।
జ్జడమీని జడల జొంపపు।
టడవులడరఁ బొల్తు మునులహా! వాకిటిలోఁ॥ 18

ఆ॥ వె॥ సృష్ట దివ్యదేహసృష్టికిఁ దొరకొని।
తొలుతవ్రాయు నాకృతులో యనంగఁ।
దపములను గృహించు తనువులతో వీరు।
వేల్తు రగ్ని నుభయవేళలందు॥ 19

లక్ష్మ—(నవ్వుచు) అన్నయ్యగారూ! యీవైపు చూడుడు! యెంతయుఁ జెలువొప్పుచున్నది!

చ॥ బలులకునగ్గి యింట మునిపత్నులు దాచినఁజూచి తండులం।
బులు దినఁ గండ దండమునుబూని యుపాత్తని వారదల్పఁగాఁ।
దలకక వే యమాయికతఁ దత్కవదండమె మూరుకొంచు నిం।
పులుదులకించు బాలమృగము న్నగుచు న్గనుచుండి రమ్మునుల్॥ 20

రామ—(మరియొకవైపునకుఁ దిరిగి యత్యాసక్తితో) తమ్ముఁడా! యటుచూడుము!

శ్లో॥ ఆదర్శనప్రసూతి రియమంకణయజ్ఞవేది
నేదిష్ఠమేవ హరిణీ తృణు తే తృణంచ
వత్సీయతాపసకుమారకరోపనీత
నీవారనిర్వృత మపత్యమవేక్షతే చ॥ 21

ఇతశ్చ,

శ్లో॥ విష్వక్తపోధనకుమారసమర్ప్యమాణ
శ్యామాకతండులభృతాంచ పిపీలికానాం
శ్రేణీభి రాశ్రమపథాః ప్రథమానచిత్ర
పత్త్రావలీవలయినో ముద ముద్వహంతి॥ 22

లక్ష్మ—అహో! పశూనామపి ప్రసవవాత్సల్యం అహో! శిశూనా
మపి స్వకర్మతాచ్ఛీల్యం॥

రామ—(అన్యతోవలోక్య)

శ్లో॥ మునివిని యోగవిలూన।
ప్రరూఢమృదుశాద్వలాని బహిరంపి।
గోకర్ణతర్ణకోయం।
తర్ణోత్యుపకంఠకచ్ఛేషు॥ 23

(ఇతిపరిక్రామతః॥)

లక్ష్మ—(అన్యతోవలోక్య) ఆర్య!

శ్లో॥ ఇయమేభిరాలవాలైః
పదే పదే గ్రంథిలాసు కుల్యాసు।
తీవ్రరయా జలవేణీ।
ప్రవహతి విశ్రమ్య విశ్రమ్య॥ 24

చ॥ హరిణి వినూతనప్రసవయై మఖవేదిక చెంతనే తృణో।
త్కరముల నందికొంచు నల తాపసబాలకులెంతయేఖియు న్
మురియుచుఁబెట్టు నివ్వరులు ముద్దెనయందిని యాహు వత్స నే।
మరకదె! మాటిమాటికి సమానపుఁ బ్రేమ చుగన్ను మించెడిన్॥21

ఇదిగో, ఇటు, ఇటు.

చ॥ బలుకుతుకంబుగ్రాల మునిబాలురు వేమరుఁ జామబియ్యముల్।
గలయఁగ నెల్లెడన్బరపఁగా।నవినోళ్లను బట్టి యిట్టటుల్।
సెలగుచుఁబారు చీమగమి చెల్వపు బారులమీరునాశ్రమం।
బుల తెరువుల్ విచిత్రగతిఁబొల్చు; సజీవఁపుముగ్గులంబలెన్॥ 22

లక్ష్మ—ఔరా! పశువుల ప్రసవవాత్సల్యంబును శిశువుల సత్కార్మాచరణ బుద్ధియుఁ దద్దయు రమణీయముగా నున్నవి!

రామ—(వేరొకవంకఁ జూచి)

కం॥ మును మునులెవో సత్కర్మల।
కని తునిమిన, మఱలఁబెరుగు నతిమృదుకుశముల్।
దిను చుప్పిపిల్ల యాశ్రమ।
వనముననదె! కనఁగ వచ్చుఁ బచ్చికపట్లన్॥ 23

(ఇట్లు పరికింపుచున్నారు.)

లక్ష్మ—(వేరొకవైపుఁ జూచి) ఆర్యా!

కం॥ కడువేడ్క నిడుచు నుడుగక।
వడివడి జేనుపిల్లకాలువలు పాదులలోఁ।
బడి బడిబడి విశ్రాంతిం।
బడయుచు వెండియును వడిగఁబాఱుచునిార్చున్॥ 24

రామ—వత్స ! సాధుదృష్టం ॥

శ్లో॥ ఆలవాలవలయేషు భూరుహాం
మాంసళ స్తిమిత మంతరాంతరా
కేరళీచికురభంగిభంగురం
సారణీషు పున రంబుదృశ్యతే ॥ 25

తదేహి భగవతీం కౌశికీమవలోకయంతౌ ముహూర్తమాత్మానం పునీవహే (పరిక్రమ్యావలోక్యచ) క్వచిత్సాంక్రామికోపి విశేషో నైసర్గిక మతిశేతే॥

తథాహి॥

శ్లో॥ జడస్వచ్ఛస్వాదుప్రకృతి రుపహూతేంద్రియగుణో ।
గుణోయద్యప్యేషామయ మయుతసిద్ధో విజయతే ।
తథాప్యుత్కర్షాయస్ఫురతి సరితామాశ్రమపదా ।
మిదానీం వానీరద్రుమకుసుమజన్మా పరిమళః ॥ 26

లక్ష్మ—ఆర్య ! పురస్తా దనుకౌశికీతీర మవలోకయ !

శ్లో॥ త్రైర్మేధాజనన వ్రతప్రణయిభి ర్వ్యాహైర్వటూనా మియం।
సిక్తా నిత్యవసంతవిభ్రమవతీ రమ్యా పలాశావళిః।
ఏతస్యాం హారిణారిపాణిజ సృణిశ్రేణిశ్రియః కోరకా।
గోపాయంతి తపోవనం వనకరిక్రీడాకరాకర్షణాత్ ॥ 27

(నేపథ్యే)

రామభద్ర ! కియచ్చిరమవలోకనేన కృతార్థీక్రియంతే తపోవనవిహారభూమయః॥

రామ—లక్ష్మణా! అవును, నీవు బాగుగఁ గనిపెట్టినావు.

క॥ నిక్కమదె పిల్లకాల్వల।
నెక్కొని వలయములఁబలసి నీరము వాఱున్।
జక్కఁగఁ గేరళనారుల।
చొక్కపు నెఱికురుల యొప్పుసూపు నలలతోన్॥ 25

రమ్ము! ఒకముహూర్తమిప్పుణ్యరాశియగు కౌశికీనదిఁ దిలకించి యంతరాత్మలను బావనముగావించికొందము.

(కొంచెము నడచిచూచి)

ఒక్కొకచో నిట్లు సంక్రమించిన విశేషమే స్వాభావికమును గూడ మించి యలరుచుండును.

చూడుము!

చ॥ చెల్లఁదనంబు మాధురియు స్వచ్ఛతయున్ సహజప్రవృత్తులై।
యెల్లర తూలిఁదేల్పు గుణమెప్పుడు నొప్పెడు, వీని కైసబల్।
కొల్లగ నల్లు ప్రబ్బలుల కోమలపుష్పపరీమళమ్ముచే।
నుల్లసితంబులై యిచటనున్న సమగ్గుణమున్నతిగ్గనున్॥ 26

లక్ష్మ—ఆ కౌశికీ తీరముగాఁ జూడుఁడు!

మ॥ తమిమేధాజనవ్రతాశ, వటుబృందమ్ముల్ల నీరజల్లసి।
క్రమ్ములై నిత్యవసంతవిభ్రమముతోఁ గన్పట్టు నవ్వాతపో।
ధములన్, సింగపుగోళ్ల చందమున నందంబొందు బల్కొరకో।
ఘము కాజేన్గులు దుంచకుండ వనముల్గాపాడు చేపారెడున్॥ 27

(తెఱలో)

రామభద్ర! మిక్కిలి వేడుకతోఁ దపోవనభూములను గృతార్థములఁజేయుచు నింకను నెంతతడ వవలోకించనెంచితివి?

సంప్రతిహి॥

శ్లో॥ పరిణమయతిజ్యోతి ర్వృత్త్యా యజూంషి రుచాంపతిః
కిమపి చ మిథః సావిత్ర్యాఖ్యం రహస్యముపాసతే
గురు రయ మనుష్ఠాస్య న్మాధ్యందినీం సవనక్రియా
మిహ మఖవిధౌ నేదీయాంసం భవంత మపేక్షతే। 28

రామ—(ఆశ్రుతి మభినీయ సానురాగం)

శ్లో॥ వారాంత్రీనభిషుణ్వతే విదధతే వన్యాః స్థితీ
రైణేయ్యాం త్వచి సంవిశంతి వసతే చాపి త్వచం తారవీం
తత్పశ్యంతి చ ధామ నాభిపతతో యచ్చార్మణే చక్షుషీ
ధన్యా వీతరజస్తమా భగవతీ చర్యేయ మాహ్లాదతే॥ 29

(పునర్నేపథ్యే పునస్తదేవ పఠ్యతే 'పరిణమయతీ' త్యాది॥)

రామ—(శ్రుత్వా ససంభ్రమమూర్ధ్వమవలోక్య) కథంగగనమధ్య మధ్యారూఢో నిదాఘదీధితిః। తదేహి యజ్ఞవాట మధిష్ఠాయ భగవతః క్రమేణకృతాహ్నికస్య కౌశికస్య ప్రత్యనంతరీ భవావః॥

(ఇతి పరిక్రామతః)

లక్ష్మ—(సర్వతో దృష్ట్వా) ఆర్య! పశ్య!

శ్లో॥ ఉద్దామద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీనిష్కూజకోయష్టయః
ఘర్మోష్ణప్లవమానసూర్యకిరణక్రూరప్రకారా దృశో
రాయుష్కర్మ సమాపయంతి ధిగమూ ర్మధ్యాహ్న
శూన్యాదిశః॥ 30

ఇదిగో! యిప్పుడు,

ఉ॥ మిత్రుఁడిదే యజార్ణయతమించి రహించును; మానులెల్ల పా।
విత్రముపేరి మంత్రము జపింతురెదోమమునఙ; విశుద్ధ చా।
రిత్రి! భవద్గురుండు చితరీతిని మఖ్యదినాధ్వర క్రియా। 28
సూత్రము నిర్వహించఁదలఁచున్, దలఁచున్నను కౌతనుంటకుఙ॥

రామ—(వినిపించుకొనక, ముక్కలి యనురాగముతో)

చ॥ సలుపుమరిచ్చి మున్కలు త్రిసంధ్యలఁ, బాడుమరిత్రిలోళ్లఁ, జే।
రలుగధరింతుప్రిపట్టు, మెఘురంజలఁదాల్తురుబూది, పంక్తి।
యాకులా భుజియింత్రు, కన్నులకగోచరమైన వెలుంగ కంద్రహా!।
దళితరజస్తమస్కులతిధన్యతమమ్ములు మానిధర్మముల్॥ 29

(మరల తెరలో "మిత్రుఁడిదేయజా" అని చదువుచున్నాఁడు.)

రామ—(ఆలకించి తొట్రుపాటుతోఁ బైకిఁ జూచి) ఏమీ! అప్పుడే వెలుఁగులఱేఁడు నడిగగనంబు నెనసి యొనరుచున్నవాఁడా? అట్లయినఁ దమ్ముఁడా! రమ్ము! యజ్ఞవాటమ్మునకుంబోయి క్రమముగ మాధ్యాహ్నిక క్రియలు నెరపు గురువుగారికి సన్నిహితుల మాదము.

(ఇరువురును నడచుచున్నారు.)

లక్ష్మ—(అంతటఁజూచి ఆర్యా! చూచితిరా!

సీ॥ కడుఁదీక్ష్ణతరములై యుడుకుఁజూపుచునుండు
చండభానుని దీప్తిమండలముల।
గాటమూ కూటమి నాటి యొంతయు మండి
పడుచుండు రవిశిలాపటలివలన।

అంతికతమా చేయం యజ్ఞభూమిః తదేతన్న్యగ్రోధచ్ఛాయామండల మధ్యాసీనా నృత్విజః ప్రత్యవేక్షావహే. గళితయామావనే పునరహాని భగవంతం ద్రక్ష్యావః॥

రామ—ఏవమస్తు॥

(ఇతి పరిక్రమ్య నాట్యేనోపవిశతః)

లక్ష్మ—(పార్శ్వమవలోక్య చ)

శ్లో॥ మధ్యేవ్యోమ క్రీడయిత్వా మయూఖా-
భానోర్బింబే లంబమానే క్రమేణ
స్వైరం స్వైరం మూలతః పాదపానాం
పశ్యచ్ఛాయాః కశ్చిదాకర్షతీవ॥ 31

రామ—వత్స! మధ్యందిన అతీతే దినమప్యతీతమేవ॥

గలిగి యార్పఁగరాని బలుమాటలం బగ్గు
మనుచుండు పెనుపట్టులందుడస్సి।
తీతువుల్ నోళ్లెండి కూఁతలువీడఁగా
నిలఁగల్గు నావిరియినకరాళి।

తే॥ గీ॥ మిళితమై కన్నులకు మిరిమిట్లుఁగొలిపి
గట్టు పుటల వివరంబు గాననీక।
చూపుమాపు నిసీ! కడు శూన్యములగు
దిక్కుమాలిన దిక్కులు దినమునడుమ॥ 30

యజ్ఞవాటిక యిక్కడకు మిక్కిలి చేరువుగానే యున్నది గదా! కనుక యీమఱ్ఱిచెట్టు నీడనుఁజేరియున్న ఋత్విజులం దిలకింపుచు నిక్కడఁ గొంతసేపుండి యెండయుడుగు కొంతశాంతించిన పిమ్మటంజేని యమ్మునివరుంజూతము.

రామ—అగునట్లే చేయుదము.

(ఇట్లు పరిక్రమించి కూర్చొనుచున్నారు.)

లక్ష్మ—(ప్రక్కగాఁజూచి)

చ॥ సడిమినుఁ చుక్కఁ జెక్క నలిసపి్రియు బింబము రుక్కదంబమున్।
బడిబడి నాడఁజేసి యటఁబాసి క్రమంబుగ లంబమానమై।
బుడిబుడి యానమూని చనఁబోఁదరుపాళి మొోళ్లనుండి యే।
తఁడావడిఁదక్కి నీడలను ద్రాడిసిలాగెడు లాగుదోఁచెడున్॥ 31

రామ—(అంతటం బరికించి వత్సా! మధ్యాహ్నసమయమతిక్రమించినది. ఇఁకఁ బవలఁతయుఁ జెరిగిపోయినట్లే అదిగో! చూడుము!

శ్లో॥ గగనశిఖా ముదయాద్రే
రధిరూఢాః కష్టమర్కరథహరయః
అస్తమహీధర మమునా
ఝటితి సుఖేనావరోహన్తి॥ 32

లక్ష్మ—ఆర్య! నూనమద్యపరాపతిష్యంతి రక్షాంసి యదయమధ్వర వేదికాసన్నిధానే హరిస్వబాహుముఖేన భగవానుపాధ్యాయః పరిశాస్తి॥

రామ—(సరోమహుంకారం) వత్స! యద్యేవంస్యాత్!

శ్లో॥ కల్పాంతకర్కశ కృతాంతభయాఙ్కరం మే
నిష్ప్రత్యూహః క్రతువిఘాత కృతామమీషాం
నిరాక్షసాం వసుమతీ మపికర్తుమద్య
పుణ్యాహమంగళమిదం ధనురాదధాతు॥ 33

లక్ష్మ—(విహస్య) కథం రజనీచరవినాశోత్కంఠా విసంస్థుల మార్యహృదయ మతిదీర్ఘదర్శినం కౌశిక మపి నసంభావయతి॥

శ్లో॥ అవిద్యాబీజవిధ్వంసా
దయమార్ద్రేణ చక్షుషా
కాలౌ భూతభవిష్యంతౌ
వర్తమాన మవీవిశత్॥ 34

రామ—కిముచ్యతే తత్రభవాన్ విశ్వామిత్రః॥

ఆ॥ వె॥ పొడుపుఁగొండనుండి కడుఁగష్టముగమింటి।
మీఁదికెక్కినట్టి మిహిరరథఁపు।
టశ్వములు రయాన నస్తాద్రిపైకిట్లు।
చక్కఁదిగుచునుండ శ్రమము దక్కి॥ 32

లక్ష్మ—అన్నయ్యగారూ! నిక్కముగ రక్కసులువచ్చి పడునట్టివేళ యైనట్టులున్నది. కావుననే మిమ్ము గురువుగారు యజ్ఞవేదిక కడకు రమ్మని హరిస్వబాహునిచేఁ బిలిపించుచున్నారు.

రామ—(రోషముతోఁగూడిన యహంకారముతో) వత్స! అట్లగునేని!

మ॥ ఖలవృత్తిం బ్రథితాధ్వర క్రియలువిఘ్నంబొందఁగాఁజేయు వీ
రల ఖండించుటెకాదు భూస్థలిని నైరాక్షస్యమొందింపఁగాఁ
బ్రబలోగ్రాకృతిభాక్కృతాంత భయకృత్ప్రఖ్యాతిఁబెంపొందు నా
విలు పుణ్యాహసుమంగళాచరణ మిష్టేచేయుఁగాఁ జేయునర్॥ 33

లక్ష్మ—ఆర్యా!, రాక్షససంహారమునందలి యతి సంభ్రమమునఁ గలంగిన మీహృదయ మీదీర్ఘదర్శియగు కౌశికమహర్షి యౌన్నతినిగూడ మన్నింపనీయకున్నది. కాని,

కం॥ సదమలమతియై మాయను।
మొదలంట నశింపఁజేసి మునువెనుకలనా।
నదనులను వర్తమానపు।
టదనెగ నొదవించు నీతఁడాంతరదృష్టిన్॥ 34

రామ—అగు నిమ్మహాత్ముఁడట్టివాఁడే, చెప్పెడిదేమి?

శ్లో॥ పరిజ్ఞాతబ్రహ్మతత్త్వోఽపి
స్వర్గీణాయై రేష ఖేలతి
గృహస్థసమయాచార
పరిక్రాంతై స్సప్తతంతుభిః॥ 35

అపిచ,

శ్లో॥ ఆదీర్ఘకృతో విసయసముద్రమహేంద్రవాలి
మందారదామమకరందరసైరివాయుః
పరిక్రాంతకుండలితనూతనభూతసర్గైః
స్త్రైశంకవం చరిత మద్భుత మాతతాన॥ 36

లక్ష్మ—(పురోవలోక్య సహర్షం)

శ్లో॥ స్వాభి రధ్వరచర్యాభి
శ్రౌత మర్థం కృతార్థయన్
అయే కులపతిస్సోయ
మిత ఏవా భివర్తతే॥ 37

(తతః ప్రవిశతి దీక్షితవేషో విశ్వామిత్రః)

రామ—(నిర్వర్ణ్య సబహుమానం) వత్స ! లక్ష్మణపశ్య॥

శ్లో॥ కర్మణా శ్రూయమాణస్య
వ్యంజనై రధికోజ్జ్వలాః
తపస్తేజోమయీ లక్ష్మీ
మద్య పుష్ణాతి మే గురుః॥ 38

విశ్వా—(పరిక్రమ్య సహర్షం) హంత! కృతకృత్యప్రాయమాత్మానం పశ్యామః॥

ఆ॥ వె॥ బ్రహ్మవేత్తయయ్యు స్వర్గకాముకులై గృ।
హస్థవిధులనందు, నందటట్టు।
లితఁడు నధ్వరముల నిటు పూని విహరించు;।
నింతెకాని స్వర్గమితనికేల ?॥ 35

ఇంతియకాక,

ఉ॥ నాకవిభుండె పాదనళినద్వయి వ్రాలఁ దదీయమస్తకా।
స్తోకసురద్రుమప్రసవసుందరదామమరంద ధార నా।
ర్ద్రీకృతుఁడై నరీతి జగతీకృతి నంతటితో నెమాని, వై।
శ్వాకుచరిత్రమద్భుతముగా నొనరింపఁడె! నాఁడె ప్రోడయై॥ 36

లక్ష్మ—(ఎదుటనుజూచి సంతోషముతో)

కం॥ శ్రోత్రార్థంబు కృతార్థం।
బై తగఁదన యధ్వరక్రియల నెంతేనిం।
జాతుర్యమలరఁ గడు వి।
ఖ్యాతి మెయిన్నెరపి మౌని యదె, యిటువచ్చున్॥ 37

(తరువాత దీక్షితవేషముతో విశ్వామిత్రుఁడు ప్రవేశించును.)

రామ—(నిరూపించి మన్ననలో) వత్సా! లక్ష్మణా! చూడుము.

కం॥ శ్రౌతవిధానము నెరపుట।
కై తగు చిహ్నములు మేన నలవరచి తపో।
జ్యోతిర్మయ లక్ష్మికినిదు।
నాతతమగు శోభ, నస్మదాచార్యుఁడహో!॥ 38

విశ్వా—(సమీపించుచు సంతోషముతోఁ దనలో) ఆహా! కృత
కృత్యప్రాయుఁడనయినాను గదా! ఏమన,

శ్లో॥ నిర్వృత్తో బహుతావదధ్వరభుజా మాతర్పణోయం విధి
ర్ధారాయా దేనసమం సుకేతుతనయా చాద్యైవ ఘాతిష్యతే
పాణౌకృత్య పున ర్వృషధ్వజధనుర్ద్వైధం సైకశుల్కాం వధూ
మైత్వా కే సురకార్యదిక్షు చలతి స్వాస్థ్యం విధాతాస్మహే॥39

(రామలక్ష్మణావుత్థాయోపసర్పతః)

విశ్వా—(రామమతిచిరం నిర్వర్ణ్య సస్నేహ కౌతుకం)

శ్లో॥ ఏష వైహారికం వేష
మాదధానో రఘూద్వహః
తత్వ మాంతర మస్మాక
మమృతై రివ లింపతి॥ 40

(ఉభావుపసృత్య) రామలక్ష్మణౌ దాశరథీ అభివాదయేతే॥

విశ్వా—(ఆలింగ్య) వత్సౌ! కిమన్యదాశాస్మహే॥

శ్లో॥ యువాభ్యా మభినిర్వృత్త
యోగక్షేమస్య వజ్రిణః
ఐశ్వర్య ప్రక్రియామాత్ర
కృతార్థా స్సంతు హేతయః। 41

(ఉభౌ తూష్ణీమధోముఖౌ స్తః)

విశ్వా-(విహస్య) కచ్చిద్వత్సౌ సమంతాదుపశీలితోయం సన్నివేశః

ఉ॥ ఆయెను బూర్తి చాలవరకధ్వర, మిప్పుడ యాసుబాహుతో।
మాయలమారి తాటకియు మాయు నికర్క హరువిల్లు సజ్యమున్,
జేయుటె శుల్కమా వధువుఁజేకొని రాముఁడు దేవకార్యముల్,
చేయుచునుండ, నిండుతమిఁ జిత్తమునందు వహింతునెంతయున్ ॥ 39

రామలక్ష్మ—(లేచి యెదురుగా వెళ్లుదురు.)

విశ్వా—(చాలసేపు రాముని నిరూపించి స్నేహకౌతుకములతో)

కం॥ వైహారిక వేషంబున।
నాహా! కోదండధారియై నిల్చి మహా।
బాహుఁడితఁడమృతవీచి స।
మూహములన్ నామనంబు మునుగన్ జేయున్ ॥ 40

(ఇరువురును సమీపించి)

రామలక్ష్మ—దాశరథులగు రామలక్ష్మణులు నమస్కరించుచున్నారు!

విశ్వా—(కౌఁగిలించుకొని) వత్సలారా! ఇఁక నింతకన్నను మాకుఁ గావలసిన దేమున్నది?

అర్కుటవృత్తము—(కోకిలకాకము)

ఒనరఁగ మీరలిర్వురును యోగము క్షేమమునున్
గనుఁగొని తీర్చుచు న్వెలయఁగా దివిజేంద్రుఁడు దాఁ
దన కులిశాదికాయుధకదంబము లూరక త
ద్ఘనవిభవోరు చిహ్నములె కాఁగొని యుండనగున్॥ 41

రామలక్ష్మ—(తలవంచుకొని యూరకుందురు.)

విశ్వా—బాలులారా! యీ యాశ్రమపదమంతయుఁ జూచితిరా?

కచ్చిదస్మదీయా స్తపోవన విహారభూమయో రమయన్తి
ఉపస్నేహయన్తివా గార్హస్థ్యమృషీణాం॥

(ఉభౌసప్రశ్రయం) భగవన్ !

శ్లో॥ రమ్య మేతదరమ్యం వా
కఃపరిచ్ఛేత్తు మర్హతి
కింతు ద్వయాతిగం చిత్త
మద్య నౌ పశ్యతోఽభూత్॥ 42

(ఇతియథోచిత ముపవిశతః)

విశ్వా—(సాకూతస్మితం) వత్సౌ !

శ్లో॥ ఇహవనేషు సకైతవ వామనో
మునిరతప్త తపాంసి పురాతనః
తమివ వా మవలోక్య తపస్వినో
నయనమద్య మనాగు దమీలయన్॥ 43

(ఉభౌముహూర్త మున్మనీ భవతః)

మాతపోవనభూములు మీకాకైమైనరమ్యముగా నున్నయవియా?
ఇమ్మునుల గృహస్థధర్మములు ప్రేమాస్పదముగానున్నవా ?

రామ లక్ష్మ—(వినయముతో)

తే॥ గీ॥ రమ్యమనుచును గాక యరమ్యమనుచు।
నెన్ని నిర్ణయ మొనరింప నెవఁడు నేర్చు।
దీనిఁగనుఁగొన్న మాత్రి మా మానసములు।
పూని ద్వంద్వాతిగపు చర్య! మానివర్య! ॥　　42

విశ్వా—(అభిప్రాయగర్భమగు చిరునవ్వుతో)

కం॥—కా॥

వనమున నిందెక్కతవపు వామనుఁడైన పురా।
తన ముని తొల్లిసల్పెను వ్రతం, బతనింబలె మి।
మ్మును గననయ్యెనేడని తపోధనులెల్లరునున్।
గనులను విప్పిరిప్పుదధికమ్ముగు నిమ్ములరన్॥　　43

పంచచామరము—(పాఠాంతరము)

ఘనుండు దంభవామనుండొకానొకప్డు తొల్లి యి।
వ్వ[illegible]మ్మున మ్ముదమ్మునం దపం బొనర్చె న త్తరిం।
ధనుం బలెన్మిముంగనంగఁ దన్వి దీక్ష నేటి క।
ల్పెనంచు నెంచి కన్నులిప్డు విప్పి రెల్లమానులుౕ॥　　43

(రామ లక్ష్మణులు ముహూర్తకాల ముత్సుకతనొందుచుందురు.)

విశ్వా—(స్వ) అయేకిమప్యుత్సాహవర్ధనాయ పాత్రిగ్భవీయమంతః
కరణ మనుస్మారిత మనయోః తదేతావదేవాస్తు అన్యథా
క్షిపామి (ప్రత్యగవలోక్య) కథముదయగిరికాశ్మీరకేదారస్య
ప్రభాతసంధ్యాలతాయాః ప్రథమ స్తబకో గభ స్తిమాలీ హస్తా
నుహ స్తికయా కుతూహలినీభి ర్దిగంగనాభిఃవారుణీం యావ
దుపనీతః॥

శ్లో॥ అయమపి ఖరరోచిత్కంఠ కోపాయమీన
త్రుస్యనురతిమిరోర్ణాజర్ఝరోపాంత మర్చిః
మదకళకళవింకీ కాకునాందీకరేభ్యః
క్షితిరుహశిఖరేభ్యో భానుమా నుచ్చినోతి॥ 44

అపిచ,

శ్లో॥ మంత్రిసంస్కార సంపన్నా
స్త్వద్వాదన్వతీరపః
పతత్రియీ మయం జ్యోతి
రాదిత్యాఖ్యం నిమజ్జతి॥ 45

రామ—(సర్వతోవలోక్య) వత్స! లక్ష్మణ!

శ్లో॥ తాపనైరివ తేజోభిః
ప్లుష్టనిర్వాణమేచకాః
దిశోజాతాః ప్రతీచీ తు
సముదాచరతి క్రమాత్॥ 46

విశ్వా—(తనలో వీరి యంతఃకరణములు కొంచెముత్సాహమునొందుటకుఁగాఁ బూర్వచరితము నించుక జ్ఞాపకము చేసితిని. ఇదిచాలును. ఇఁక వేరుతలఁపునకుఁ ద్రిప్పనగును. (పడమటివైపుగాఁజూచి ప్రకాశముగా) ఓహో! ఉదయాద్రియను కాశ్మీర కుంకుమపుఁ బంటపొలము నందలి ప్రభాతసంధ్యా లతకుఁ గలిగిన రవిబింబంబను తొలి పువ్వుగుత్తి యత్యాసక్తలగు దిక్సతులచే హస్తాను హస్తికముగా వారుణీకాంతచెంతకుఁ జేర్పఁబడినది. అదిగో!

చ॥ ఎఱుపగురంగుపై పయి నొకించుక చీఁకటినల్పు పొల్పిడన్।
నిరుపమతన్వహించురుచి నించెమునర్చి, నినుండుఁ దా మదా।
కరకరవింకికానికర కల్పితకాకుశుభోక్తియుక్తమా।
నురుతర భూజరాజిశిఖరోపరిభాగమునుంచి డించెడున్॥ 44

మఱియును,

చ॥ నిగమపు సంస్కృతిం బఱపి నిత్యపవిత్రితఁగూర్చి యొంతయున్।
నెగడఁగఁజేయుచు న్జలధినీళులయందుఁ దగ్రియాముయాత్మతన్।
దగు మహనీయ భాస్వదభిధానమున న్విహరించు తేజము।
ప్పుగఁ జరమాద్రినుండి డిగి మున్గుచునుండెను దానుదారతన్॥

రామ—(అంతటం గలయంజూచి)

ఉ॥ కానఁగనౌచునుండె నవెకంటివె! లక్ష్మణ! దిక్కులెంతయున్।
భాను ననూనతేజమున బగ్గున మండినవై ప్రశాంతతం।
బూనుటఁ జేసినాఁగ నలుపుం గొని యుండె నదే, ప్రతీచియున్,
మూనక యిప్పుడిప్పగుఁ, గ్రిమమ్మున నన్నిటితోటిపాటుగాన్॥ 46

కించ,

శ్లో॥ క్వాంచిద్బిభ్రతి భూతి మాశ్రిమభువో వైతానవైశ్వానర
జ్వాలోపప్లవమానధూమవలభీవిభ్రాంతదిగ్భిత్తయః
క్రీయంతే వటవ స్తృతీయసవనస్వాధ్యాయదీర్ఘానపి
స్వర్గా బద్ధమనోహరం ప్రతి ముహుస్సాన్వేదా ప్రియుయుంత
స్స్వరాః॥ 47

విశ్వా—వత్స ! రాఘవ !

శ్లో॥ ఉన్మృక్తాభిర్దివసమనునా సర్వత స్తాభి రేవ
స్వచ్ఛాయాభి ర్నిచులితమివ ప్రేక్ష్యతే విశ్వమేతత్
పర్యంతేషు జ్వలతి జలధౌ రత్నసానౌ చ మధ్యే
చిత్రాంగీయం రమయతి తమస్తోమనీలా ధరిత్రీ॥ 48

లక్ష్మ—(సాశ్చర్యం)

శ్లో॥ తేజోమయంతమోమయ
మన్యతరస్యాం తదేవ దిక్చక్రం
కిమపి విచిత్రాం ధాతు
స్సృష్టి రియం భువనకోశస్య॥ 49

(సర్వతోవలోక్య)

శ్లో॥ చూడారత్నై స్స్ఫురద్భిర్విషధరవివరా ణ్యుజ్జ్వలా న్యుజ్జ్వలాని।
ప్రేక్ష్యంతే చక్రవాకీమనసి నివిశతే సూర్యకాంతా త్కృశానుః।
కిం చామీ శల్కయంత స్తిమిరముభయతో నిర్ఝరాహస్తమిస్రా
సంఘట్టోత్థిప్తసంధ్యానలకణనికరస్పర్ధినో భాంతి దీపాః॥ 50

ఇంతియగాక,

చ॥ జ్వలనగృహమ్ములన్విడి దివమునఁ గ్రమ్మెడు హోమధూమపుర్జ।
వలభులు దిక్సుకుడ్యములపైఁ దగ వ్రాలుచుఁ గ్రాల నాశ్రిమ।
స్థలు లలరుర్జ శ్రుతిన్ స్వరము సంజెను దీర్ఘమయ్యెనఁ బంత మే।
పలర మఱింత దీర్ఘముగ నధ్యయన మ్మొనరింత్రిటన్ వటుల్॥47

విశ్వా—వత్సా! రామభద్రా!

మ॥ పవలెల్లన్ దొలగించి వెండి యిపుడా స్వచ్ఛాయలం దాల్చికొ।
న్నవిధాన న్జగమొప్పెడున్ దమముఁ బల్చల్పాన్న లో రత్నసా।
నువుఁ బర్యంతములందు రత్ననిధులున్ భూరిప్రభల్ గొల్పఁగా।
భువి యెంతేనియు వింతమీఱు రుచితోఁ బొల్పారుఁ జిత్రాం

లక్ష్మ—(సాశ్చర్యముగా) గిర్యై॥ 48

కరిబృంహితవృత్తము.—

ఒక్కపుడు వెలుగొప్పెడును మఱియొక్కపుడు బలు చీఁకటుల్।
పిక్కటిలుచును దిక్కులలమెడుఁ జెక్కు వితముల నక్కటా!।
యక్కజముగను గాన నగు నల యబ్జజుని దగుచర్య దా।
నెక్కరణి సృజియింపఁ గలిగెనొ యిజ్జగము నిటు నేర్పుతోన్॥49

(అంతటం గలయంజూచి)

ఉ॥ పుట్టలు వ్యాళమౌళిమణిపుంజపు రుక్కులఁ గ్రిక్కి, నగ్గి వేఁ।
బుట్టెడుఁ జక్రివాకి మదిఁ బ్రిద్దుశిలగ్నివడి, గాటపుంచమం।
బట్టిటుఁ ద్రోసి దీపనివహంబు లహోరజనీప్రఘట్టనన్।
బుట్టిన సాంధ్యరాగ మలత భుక్కణజాలములీలఁ గ్రాలెడిన్॥ 50

రామ—(విలోక్య)

శ్లో॥ విశ్వం చాక్షుష మస్తమస్తి హి తమః కైవల్య మాపాదిక
పాత్రిచ్యాదివ్యవహారబీజరహితం దిఙ్మాత్ర మేవ స్థితం
గృహ్యంతే భయహేతవో వటుభి రప్యక్షోత్త్రగై ర్భాతి చ
ధ్వాంతేనాతిఘనేన వస్తు వచసా జ్ఞాతః స్వరేణాముకః॥ 51

లక్ష్మ—(సనిర్వేదం)

శ్లో॥ ఆస్సర్వతస్స్ఫురతు కైరవ మాపిబంతు
జ్యోత్స్నాకరంభముదరంభరయ శ్చకోరాః
జాతో యదేష చరమాచలచూడచుంబీ
పంకేరుహా ప్రికర జాగరణ ప్రదీపః, 52

కించ,

శ్లో॥ ఘనతరతిమిరఘుణోత్కర
జగ్ధానామివ పతంతికాష్ఠానాం
ఛిద్రైరమీభి రుడుభిః
కిరణవ్యాజేన చూర్ణాని, ॥ 53

రామ—(చూచి)

సీ॥ కాంచనాంచితమౌ ప్రపంచమెల్లను బొంచు
గాఢాంధకారమొక్కటియె మించు।
నైంద్రాదిదిగ్వ్యవహారమెల్లఁ గృశించుఁ
గడలెల్లఁగూడి యేకత నటించు।
నెంత దృష్టిపటుత్వమేనియు నశియించుఁ
గలవెల్ల భయహేతువులనె పెంచు।
నెఱిచీఁకటులు కంటితెఱ మాదిరి వహించు
రూప భేదపు చూపు మాపు గాంచు।

తే॥ గీ॥ నిట్టులుంటను జనులకు నిదియొ యదియొ।
వీఁడొ వాఁడొ యటన్న విభేద మెన్న।
స్వరము స్పర్శాదికంబులె సాధనత నె।
సంగు లోకమలోక లోచనత నెనయ॥ 51

లక్ష్మ—(విసువుదలతో)

ఉ॥ ఆయిఁకశంక దక్కి రుసుదాళి ముసంపడ వచ్చు నిచ్చనై।
ఆయిఁక జుట్టవచ్చుఁ బెనుగట్టుదరంభరముల్ చకోరముల్।
హాయిగఁ దీయవెన్నెలల, నంబుజజాగరణప్రదీప మ। 52
త్యాయతరూపమిష్ఠు చరమాచలకూటము మాటు నొందెడున్॥

మఱియును,

మ॥ బలితంబౌ తిమిరంబు పేరిటి యలివ్రాతంబు కాష్టౌఘముల్।
దొలువన్ గలిన చిల్లులట్టులుడు సందోహంబులూహింపనై।
యల రంధ్రంబులలోననుండి పడు చూర్ణౌఘంబులంబోలెనిం।
పలరారున్వివరింప నయ్యుడుమయూఖానీకముల్గాంచితే॥ 53

(నేపథ్యే కళకళః)

(సర్వేససంభ్రమమాకర్ణయంతి)

(పునర్నేపథ్యే)

శ్లో॥ నిర్మజ్జచ్చతురంతభ్రమిత కపిలితక్రూరతారానరాస్థి
గ్రంథిదంతాంతరాళ గ్రథిత మవిరతం జిహ్వయా ఘట్టయంతీ
ధ్వాంతేపివ్యాత్తవక్త్రజ్వలదనల శిఖాజర్ఝరే వ్యక్తకర్మా
నిర్మాంతీ గృధ్రరాద్రీం దివ ముపరి పరిక్రీడతే తాటకేయం॥54

కించ,

శ్లో॥ త్రేతాగ్ని కుండపూరంచ
వర్షంతో రుధిరచ్ఛటాః
హింస్రాస్సుబాహు మారీచ
ముఖ్యా నః పరివృణ్వతే॥ 55

విశ్వా—కథం తాటకా! వత్స! రామభద్ర!

శ్లో॥ వితాన మానుశ్రవికం గృహేషునః
ప్రతిష్కిరంతీ కిమియం ప్రతీక్ష్యతే
సుబాహుముఖ్యైస్సమ మాతతాయిభి
ర్గృహాణ చాపం నిగృహాణ తాటకాం॥ 56

రామః—(సఘృణాతిరేకం) భగవన్ స్త్రీయమిమాం॥

(నేపథ్యే)

అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యం తాత విశ్వామిత్ర రాక్షసైః కి
యచ్చిరం పరిభూయామహే ప్రహీయతా మధిజ్యధన్వా దాశరథిః

(తెఱలోఁ గలకలము)

(అందఱును దొట్రుపడుచు నాలకించుచున్నారు.

(మరలఁ దెఱలో)

మ॥ కనుదో యిర్మిడి గ్రుడ్లు పర్వ, బలునాల్కల్ గోరలన్నిక్కఁ గొ
న్ననరాస్థుల్ వ్రేడలించి వేనములు చుక్ ధ్వాంతమ్ముఁ దద్వక్త్రభా
గనలార్చుల్ దొలగింప నోర్దెఱచి, గృధ్రానీకరాదగ్రింబుగా
వినుఁ గల్పించుచు నాడుఁ, దాటక యదే! పెన్బ్రేతికిన్నేత్తువై॥ 54

మరియు,

శా॥ అండన్ హోమపుటగ్నికుండములు రక్తాసారపూరంబులన్
నిండంజేయుచుఁ గ్రూరకర్ముఁడగు నన్నీచుండు మారీచుఁడుఁ
దండ్రుడైన సుబాహుఁడు న్మొదలుగా దైత్యాళులుగ్రాకృతిఁ
జండారావములొప్ప నుప్పరమున న్మామీఁది కుంకించెడిన్॥ 55

విశ్వా—(ఆలకించి సాభిప్రాయముగ) ఏమీ! తాటకయేనా! వత్సా! రామభద్ర!

త॥ అనఘ! మామకయజ్ఞపుం గ్రియ కంతరాయము నర్చు నీ
పెను నిశాచరి నింకఁ జూచెదవే త్వదీయపుఁ జాపమున్
గొనుము వేఁబడిగొన్ము తద్దయుఁ గ్రూరచిత్తులు దుష్టవ
ర్తనులునైన సుబాహుముఖ్యులరాజితోడను దాటకన్॥ 56

రామ—(మిగులఁ గనికరముతో) మహాత్మా! యియ్యబలనా!

(మఱలఁ దెఱలో)

అయ్యో! అయ్యో! రక్షింపుము! రక్షింపు మో తాత! విశ్వామిత్ర! ఇంకను నెంతతడవిట్లు పరిభవమందుదుము? వేగముగా

రామ—(విహస్య, నేపథ్యాభిముఖమవలోక్య) బాలస్తే! హ్రస్వబాహో!
ముహూర్తం ధీరో భవ!

శ్లో॥ అలం కృశిత్వా గురురల్పకోఽయం
విధిస్త్వదాజ్ఞైవగరీయసీనః
నకౌశికస్య త్వయి ధర్మపుత్రే
పుత్రే మధుచ్ఛందసి వా విశేషః॥ 57

విశ్వా—(విహస్య) వత్స! కృతముత్తరోత్తరేణ నన్వయం నేదీయా
నాశ్రిమోపఘాతః॥

లక్ష్మ—(సవ్యథమివ) స్వగతం

శ్లో॥ మీమాంసతే కిమార్యోఽయం
కౌశికే ప్యనుశాసతి
వాచమేషా మృషీణాంహి
శాస్త్రమే వానువర్తతే॥ 58

రామ—(స్వగతం)

శ్లో॥ గుర్వాదేశాదేవ నిర్మోయమాణో
నాధర్మాయ స్త్రీవధోపిస్థితోఽయం
అద్య స్థిత్వా శ్వో గమిష్యద్భి రల్పై
ర్లజ్జాస్మాభి ర్మీలితాక్షైర్జితైవ॥ 59

కింతు,

శ్లో॥ దీర్ఘంపరిజాభిగ తికౌతుకినీభి రాభి
రస్మిన్నకీర్తి పటహే మమ తాడ్యమానే

నెక్కిడిన వింటిలో దాశరథిని బాపవేమి ?

రామ—(నవ్వి, తెఱవంకఁజూచి) బాలమునీ ! హా స్వబాహా ! ఇఁక నొక్క నిముస మోర్చుకొనుము !

కం॥ తొందరనొందకు మిది మా।
కుం దలపనలంతి యయ్యు గొప్పదె; గురుఁడే ?
నందనుఁబలె నినుఁజూచు న।
నం, దగునిను గౌరవింప నాకుం దేనిన్॥ 57

విశ్వా—వత్స ! ఉత్తరోత్తరములతోఁ బనిలేదు. జాలము చేయ వలదు. ఆశ్రమోపరోధము సమీపించుచున్నది.

లక్ష్మ—(సబాధకముగాఁ దనలో)

తే॥ గీ॥ కౌశికుం డానతిచ్చిన కార్యమునకె।
యన్న, యేమొకొ ! వెన్కముందాడుచుండె ?
నెన్నిచూచిన శాస్త్రంబె, యిట్టిరైన।
ఋషుల వాక్యానుసరణంబు నెనయుచుండె !॥ 58

రామ—(తనలో)

తే॥ గీ॥ దేశికుని యాజ్ఞ చేసగు స్త్రీవధయును।
బాపమనరాదు, నేఁడుండి రేపుపోవు।
నస్మదాదుల కలఁతులకైనసిగ్గు।
పోయినట్లులె సుంత కనోమ్ముమనిన॥ 59

కాని,

ఉ॥ దిక్కుల వారు వారుఁగడుఁ దీరని కూరిమి నామ దుర్యశో
ఢక్కను మ్రోయఁజేయ నకటా ! ప్రకటుండు, మహోమయుండు నా

జ్యోతిర్మయేన వపుషా జగదంతసాక్షీ
లజ్జిష్యతే కులగురు ర్భగవాన్ వసిష్ఠః॥ 60

(నే ప థ్యే)

శ్లో॥ అలమిష్ట్వా మఖా న్మ్యార్ఘాః
ఖడ్గధారేయ మస్తి నః
అటవీయా నయం పంథాః
స్వర్లోక ముపతిష్ఠతే॥ 61

రామ—(శ్రుత్వా సరోష సంభ్రమముత్థాయ సవినయమంజలిం బధ్వా॥)

జగద్గురో గాధినందన,

శ్లో॥ దశరథకులే సంభూతం మా మవాప్య ధనుర్ధరం
దినకరకులాస్కందీ క్షోయం కళంక నవాంకురః
ఇతిహి వనితా మేనాం హంతుం మనో విచికిత్సతే
యదధికరణం ధర్మస్యాయం తవైవ వచాంసి నః॥ 62

న క్కులదేశికుండు జగదంతములన్నను సాక్షియౌచుఁ బెం।
పెక్కు వశిష్టమౌనివరుఁ డీ పెనుసిబ్బితి కెట్లు సైచునో ॥ 60

(తెఱలో రక్కసులు)

కం॥ చాలు నిఁక మూర్ఖులారా!
యేలా? త్రిదివంబు గోరి యిష్టులొనర్పన్ ।
జాలెడు మా యసిధారయె ।
యాలోకముఁ జేరు చేరువగు దారినిడన్ ॥ 61

రామ—(విని, క్రోధముతోఁ దొట్రుపడుచు, వినయముతో నంజలిపట్టి)

సీ॥ స్త్రీవధ యొనరింపగా వచ్చుటయె విష
యం బది దశరథునన్వయమున ।
వఱలెడు నొక ధనుర్ధరుఁడ నే నొనరింప
నాసూర్యపర్యంత మగునొ పంక ।
మను శంక ధర్మశాస్త్రనిషిద్ధమని పూర్వ-
పక్షము రెండవ బ్రహ్మపనఁగఁ।
దగు నీదు నాజ్ఞ శిద్ధాంతము మఖరక్ష
తగు నుపయోగ మాధార మీవ।

తే॥ గీ॥ యనుచు ధృతిగాంచి మది సందియముఁ డించి ।
నీదు పలుకెంచి, భరము నీమీఁదనుంచి।
చాపము ధరించి శరమును సాఘటించి ।
తాటకనుదురించి వత్తు శాంతముచహించి ॥ 62

(ఇతి ప్రణిపత్య) మూర్ఖైష్ట తపోధనాః !

శ్లో॥ రజని చరచమూ రమూరపాస్య
న్నయ మహా మాగతఏవ రామభద్రః
కుశికసుతకుశాగ్రతోయబిందో
రిదమనుకల్ప మవైత కార్ముకం మే॥ 63

(ఇతి ధనురారోపయన్ నిష్క్రాంతః)

లక్ష్మ—(సాశంకం స్వగతం) దిష్ట్యాక్షాత్రేణ ధర్మేణ కౌమార మప్య
శూన్య మార్యస్యతావదాసీత్ (నేపథ్యాభిముఖమవలోక్య)
(హర్షం నాటయన్ (ప్రకాశం)
భగవన్! కౌశిక! పశ్య! పశ్య! పురస్తాదార్యే ధృతధనుషి,

శ్లో॥ వాయవ్యాస్త్రవ్యతికరనిరాలంబన స్తాటకేయః
ప్రాస్తో జీవన్ మరణ మసుభి ర్విప్రయుక్తస్సుబాహుః
కృత్తోన్మూక్తా భువి చ కరుణాశ్చర్యబీభత్సహాస
త్రాసక్రోధోత్తరళ మృషిభి ర్దృశ్యతే తాటకేయః॥ 64

విశ్వా—(విలోక్య) వత్స! లక్ష్మణ! విస్మయేన ప్రమోదేనచ పర
వంతోవయం నవాచా మధీశ్మహే వక్తవ్యం వా కిమస్తి నఖ
ల్వియ మద్యతనీ వః ప్రతిష్ఠా॥

శ్లో॥ దిక్పాలాకమకీర్తి ర్ధాతవిజయతో నిర్వ్యాజఫేరోద్ధతా
స్తే యూయం రఘవః ప్రసిద్ధమహసో యైస్సోపి దేవాధిపః
బిభ్రాణై రసురాధిరాజవిజయక్రీడానిదానం ధనుః
పౌలోమీకుచపత్రభంగ రచనాచాతుర్య మధ్యాపితః॥ 65

[మ్రొక్కి, తెలివంకఁజూచి] తపోధనులారా!

తే॥ గీ॥ విడువుఁడిఁక భీతి రాఘవుండిదొ గోవచ్చె!।
డీకొనిన సోఁకుమూఁకల ఢాక వీడఁ।
కౌశికకుశాగ్ర జలబిందు కల్పమనుచు।
మనమున నెఱుంగుఁడీ ధనువెనయుననువు!॥ 63

(అని ధనుష్టంకారముచేయుచు వెళ్లును.)

లక్ష్మ—(సందియముతోఁ దనలో) ఆహా! అన్నయ్యగారు వయస్సునఁ బిన్నలయ్యును క్షాత్రధర్మమునకు సుంతయు లోపము రానీయకుండుటెంతయు భాగ్యవశముగదా! (తెలివంకఁ జూచి హర్షమునటింపుచు, ప్రకాశముగా)
మహాత్మా! కుశికాత్మజా! చూడుము! చూడుము! అదిగో! అన్నయ్యగారు ధనువు చేఁబూనినతోడనే,

శా॥ ఘోరంబై తగు మారుతాస్త్రమగఁటంగూర్పన్ మృతప్రాయుఁడై
మారీచుండు తొలంగెఁ; బ్రాణములకున్ బాసెన్ సుబాహుండును
న్గారుణ్యంబును గ్రోధ మబ్రము భయోత్కంపంబు నవ్వేవ యున్
మీరన్నానులుగాంచెఁ దాటకయు భూమింగూలెఁ గృత్తాంగియై 64

విశ్వా—వత్స! లక్ష్మణ! అద్భుత ప్రమోదములచేఁ బరవశులమై యున్న మేమిప్పుఁడేమియు ననఁజాలము. అయిన ననుటకు మాత్రమేమున్నది? ఇది మీకుఁ గ్రొత్త ప్రతిష్ఠ కాదు.

శా॥ లీలామాత్ర సురారిజైత్రమగు బల్విల్వాని శైలారికిన్।
బాలోమీ సుకపోలపత్ర రచనా పాండిత్య శౌండత్వమున్।
జాలం గ్రాలఁగఁజేయు చాయత యశస్సారంబు లస్మిరుచు।
నిస్తులధామయుతుల్ త్వదన్వయగతుల్ నిర్వ్యాజధీరోద్ధతుల్॥ 65

లక్ష్మ—భగవన్! పశ్య!

శ్లో॥ అద్య నైశాచరీం సేనా
మేనా ముల్లోలయన్నయం
ఆధానం వీరధర్మస్య
నిర్మాయ త్వాముపస్థితః॥ 66

రామః—(పరివిశ్య) (సవైలక్ష్యం)

శ్లో॥ పూషా వశిష్టః కుశికాత్మజోయం
త్రియస్త ఏతే గురవో రఘూణాం
మహామునే రస్య గిరా కృతోపి
స్త్రైణో వధోయం న సుఖాకరోతి॥ 67

(ఆశ్రమమవలోక్య)

శ్లో॥ పరిత్యాసన్నతుషారదీధితికరక్లిశ్యత్తమోవల్లరీ
బల్ల్యాభిర్మఖధూమవల్లిభి రమీ సమ్మీలితవ్యంజనాః
శ్వస్సంచీవరయిష్యమాణ వటుకవ్యాధూతశుష్యత్త్వచో
ఽదాృణాతిథయ స్తపోధనగృహాః కుర్వంతి నః కౌతుకం॥ 68

(పురోవలోక్య)

శ్లో॥ స్ఫురతిపురతోమాద్య న్మార్యచ్ఛకోరవిలోచన
పరికరకిరణశ్రేణీకత్తస్వహస్తఘనం మహః
హృదయలఘిమా మాభూత్రేప యోదృశాం ప్రతిభూరయం
కువలయదృశా మిందు ర్నేత్రే సుధాభి రనక్తి నః॥ 69

శ్లో॥ ఉన్మీలంతి మృణాళకోమలరుచో రాజీవసంవర్తికా
సంవర్తపరివృత్తయః కతిపయే పీయూషభానోఃకరాః

లక్ష్మ—చూడుఁడు ! మహాత్మా ! అన్నయ్యగారు

కం॥ టక్కరి రక్కసి మూఁకలఁ ।
దక్కక చక్కాడి వీరధర్మము గడుఁ బెం ।
పెక్కెడు ఫక్కికి మొదలిడి ।
యక్కజముగ మొక్కవత్తురదె ! మీకడకున్॥ 66

రామ—(ప్రవేశించి) (వెల్లదనముతో)

ఆ॥ వె॥ రఘుకులీనులకును రవియు, వశిష్టుండుఁ,।
గుశికజుండు, మగురు గురులె, యాదుఁ ।
గుశికజుని యనుజ్ఞగొని చేయు స్త్రీవధ ।
యును గలంచు నేమొకో ! మనంబు ! ॥ 67

(ఆశ్రమమువంకఁ జూచి)

ఉ॥ చేరువనొందు చందురు రుచిం దఱుగందు తమంబుఁ బెంచు చే
పారెడు హోమధూమమున వ్యంజనముల్ మఱుఁగంద, నాగతు
ల్గూరుచునంద, శుభ్రతనుఁగూర్చి వటుల్మఱునాడు గట్టఁగా
నాఱఁగవైచు బట్టలలరంద మునీంద్రుల యిష్టు లిమ్మహన్॥ 68

(ఎదుటం జూచి)

చ॥ కడు నే పొందెడు చందమామ పులుగుం గాటుపు కన్గుంపు డా
లిడు చేయూతను దేజపెంపుఁగొన నింకిందీవరాక్షుల్భయుం ।
పడ కుండిప్డెప్రియాగమంబగును దద్వారంబు నాదంచుఁ జా ।
టెడు రేఁజేఁడదె కన్నుదోయి నిడుమండెన్ బల్సుధాధారలన్॥69

ఉ॥ కంజదళంపుఁ బెంపుసుపఁ గంకణమూని బిసోపమంబులై
రంజిలు కొన్నియుంమని కరంబు లగ్రాగ్రములం దగుం తమః ।

అప్యగ్రైర్ధవళీభవత్సు గిరిషు త్య్యుగ్ధోయ మున్మజ్జతా
విశ్వేనేవ తమోమయో నిధిరహో మహ్నాయ ఫేనాయతే॥70

(సనిర్వేదం)

శ్లో॥ ఇందుర్యద్యుదయాద్రిమూర్ధ్ని న విభాత్యద్యాపి తన్మాన్మభూ
న్నాసీరేపి తమస్సముచ్చయ మమూ రున్మీలయంతి త్విషః
అప్యక్ష్ణోర్మ్న మద్గిరంతి కుముదై రామోదయంతే దిశ
స్సంప్రత్యూర్ధ్వమసౌ తు లాంఛనమభివ్యక్తుం ప్రకాశిష్యతే॥

(సహర్షం)

శ్లో॥ కాశ్మీరేణ దిహానమంబరతలం హామభ్రివా మానన
ద్వైరాజ్యంవిదధాన మిందుదృషదాం భిందాన మంధస్సిరాః
పత్యుస్యత్సురహూతపత్ర నవధూదత్తార్ఘదూర్వాంకుర
గ్రాసక్షీబకురంగ మైందవ మిదం బింబం సముజ్జృంభతే॥ 72

ఏతాశ్చ

శ్లో॥ పౌలోమీకుచకుంభ కుంకుమరజస్స్వైజన్య జన్మోద్ధతా
శ్శీతాంశో ర్ద్యుతయః పురందరపురీసీమ్నాముపస్కుర్వతే
ఏతాభిర్గ్లహతీభి రంధతమసాన్యద్గ్రిఘ్నతీభి ర్దిశః
క్షోణీ మాస్తృణతీభి రంతరతమం వ్యోమేవ మోజాయతే॥73

అపిచ,

శ్లో॥ నైవాయం భగవానుదంచతి శశీ గవ్యూతిమాత్రీ మపి
ద్యా మద్యాపి తమాంసి కైరవకులశ్రీచాటుకారాః కరాః
మథ్నంతి స్థలసీమ్ని శైలగహనోత్సంగేషు సంయంథతే
జీవగ్రాహ మివ క్వచిత్క్వచిదపి చ్ఛాయాసు గృహ్ణంతి చ॥ 74

పుంజము పేరి వారిధిని మున్గిన విశ్వము వేగ నిప్డు పై
కిం జనఁబోఁగలంగి కలిగె న్నరుగుం గములుచు నెంచెనై॥ 70

(నిర్వేదంబుగా)

శా॥ ఇంకన్దోఁచుఁడ తొంటిమెట్టనెల, పోనిమ్మేతదగ్రాంశులే
యింక న్జేసెడి నిర్లఁ గన్నులకు హాయిం గూర్చెడి న్గల్వలన్
బొంకం బొందఁగఁ జేసి చేసెడి దిశామోదంబిఁకీ తండ నా
నంకంబు ప్రకటించు మాత్రమునకే యభ్రంబునిష్టాందెడున్॥71

(సంతోషముతో)

ఉ॥ కుంకుమపూతనింగికళికుంతలి మోమునకు న్ద్వితీయ రా
జ్యాం కద మిందుకాంతములకప్పుల క్రొవ్వులవిప్పు నాచునే
గాంకుని బింబ మొప్పె నమరాయతదృక్పరి కల్పితార్ఘ్య దూ
ర్వాంకుర మత్త వృత్త మయి యంకకురంగమెనంగు భంగితోన్॥72

ఇదిగో!

మ॥ ఎరుపుందాల్చి శచీ సతీ వదనమందింపారు కాశ్మీర పు
న్మరువుం బోల్తావతేని డాల్పురల పోల్పుస్తానుగావించెడిన్
దఱుచౌ చీఁకటి మానఁగా దెసల భేదమ్మానఁగా క్షోణిపైఁ
బొరయుం బూనెడు దీన నంతరతమవ్యోమంబు భాసిల్లెడున్॥ 73

మఱియును,

చ॥ కువలయ నాథుఁడింక నిరుక్రోసులు మాత్రపు దూరమేనియున్
దివికెగఁబ్రాక లే డపుడె దీప్తులు కల్వలఁదట్టు సిర్లఁ ద
వ్వవలకుఁ గొట్టుఁ, బెట్టు నగమాటవి పట్టులఁ బట్టుగొన్నిటిన్
జవమునఁ బ్రాణభీతి నవి చాయల గుంపులనాఁ జలింపఁగాన్॥74

(జ్యోత్స్నాతిశయం నిరూప్య)

శ్లో॥ కింను ధ్వాంతపయోధి శేష కతకక్షోదైరివేందోః కరై
రత్యచ్ఛోయమధశ్చ పంకిల ఇవ చ్ఛాయాపదేశాదభూత్
కిం వా తత్కరకర్తరీభిరభితో నిష్కృత్తా దుర్జ్వలం
వ్యోమ్నైవేదమితస్తతశ్చ పతితా శ్ఛాయాచ్ఛలేన త్వచః॥ 75

(పరిక్రమ్య పార్శ్వతోవలోక్య)

శ్లో॥ దలవితతి భృతాం తలే తరూణా
మిహ తిలతండులితం మృగాంకరోచిః
మదచపలచకోర చంచుకోటీ
కబళితతుచ్ఛమివాం తరాంతరాభూత్॥ 76

(విభావ్య)

శ్లో॥ త్రిభువనతమోలుంటాకీనా మహో మిహిరత్విషా
మభిపిధి రసా కోకశ్రేణీ మనస్యవశిష్యతే
క్షుధమపితమస్సాన్ద్రోదతః ప్రవిశ్య వినిఘ్నత
శ్శశధరకరా నచ్ఛిన్నాగ్రాం శ్చరంతి చకోరకాః॥ 77

(అపిచేదానీం)

శ్లో॥ తథాపౌరస్త్యాయాం దిశి కుముద కేదారకలికా
కవాటఘ్నీమిందుః కిరణలహరీ ముల్లలయతి
సమంతా దున్నీలద్బహుళజలబిందు స్తబకినో
యథాఽపుంజాయంతే ప్రతిగుడక మేగాంకమణయః॥ 78

(పరిక్రామన్నూర్ధ్వమవలోక్య)

(వెన్నెలపెంపు నిరూపించుచు)

భాస్కరవిలసిత వృత్తము—

చందురు కరకతకంబులచేఁ స్వచ్ఛంబగు తిమిరజలధికాయి యిదంకున్।
గ్రిందగు బురదలో నీడలుకాకా ఘృష్టుల నెడు నులులోనరఁగఁజెక్కం।
జొందిన ధగధగచే నిటులెంతేఁజెల్వగు నమరపథము యిదియా ౘి 75
తిందెగి యిటునటుఁ దూలినవై ధా త్రింబడి కనఁబడుతోలుకలోనీడల్॥

(తిరిగి ప్రక్కగాఁజూచి)

చ॥ తరుచయియొప్పు పత్ర సముదాయము లెంతయుఁ గల్గియున్నయీ।
తరువులక్రింద నిందురుచి తద్దయునుం దిలతండులక్రియన్।
బరగెడు; నందునందు మదవత్తమముల్ చపలంబులైన చం।
దురుపులుగుల్ దినంగడఁగి తోఁటులఁజిల్లులు వెట్టనోయన్॥ 76

(విశేషముగా భావించి) అక్కటా!

ఉ॥ పూని జగత్త్రియానఁ దమమున్దొలఁగింపుచ దేమి పద్మినీ।
జానికరాళి జెక్కవలస్వాంతములన్నిగిలెన్ శశిప్రభల్।
లోనికిఁ దామెపోయి తృటిలోనహరించును క్షత్తమంబు ల।
ల్లైనను దుశ్చకోరకముల యొయ్యి! యవే మొదలంటమెక్కుడున్॥77

(మఱియునిట్లాడు)

చ॥ గురుజలబిందు బృందముల గుత్తులు గుత్తులు గట్టుటన్ సుధా।
కరమణు లొక్కటొక్కటియుఁ గన్గొనఁగాఁ బెద పెద్దప్రోవులై।
పరఁగెడునట్లు తోడ్తెన నపారముగాఁ బ్రవహింపఁ జేయు రే।
దొరకిరణౌఘముల్గలువదొడ్డికవాటపు మీట మీటుచున్॥ 78

(తిరిగి పైగఁజూచి)

శ్లో॥ తరుణతమాలకోమలమలీమస మేతదయం
కలయతి చంద్రమా వను కళంక ఇతి బ్రువతే
తదనృతమేవ నిర్దయవిధుంతుద దంతపద
ప్రణవివరోపదర్శిత మిదం హి విభాతి నభః॥ 79

కించ,

శ్లో॥ రుచిభి రభితప్తంకోత్కీర్ణై రివ త్రిస రేణుభి
ర్యదుడుభి రపి స్థూలై శ్ఛిద్రై రివ భ్రియతే నభః
ప్రకృతిమలినో భాస్వద్బింబోన్మృజా కృతకర్మణ
స్తదయమపి హి త్వష్టుః కూటే భవిష్యతి చాంద్రమాః॥ 80

లక్ష్మ—(సర్వతోదృష్ట్వా)

శ్లో॥ భూయస్తరాణి యదమూని తమస్వినీషు
జ్యోత్స్నాసు చ ప్రవిరళాని తతః ప్రతీమః
సంధ్యానలేన భృశ మంబరమూషికాయా
మావర్తితె రుడుభి రేవ కృతోయ మిందుః॥ 81

(విహస్య) యథాధర్మమేవైతత్,

శ్లో॥ యత్ప్రియామమయూఖమాలిని తమస్తోమావలీధాయుషాం
నేత్రాణా మపమృత్యుహారిణి పున స్సూర్యోఢ ఏవాత్రథా
అంభోజాని పరాంచి తన్నిజమఘం దత్వేన తేభ్య స్తతో
గౌరాంగీవదనోపమా సుకృత మాదత్తేపతి ర్యజ్వనామ్॥ 82

విశ్వా—(సర్వతోవలోక్య) అహా హా! నామధేయ మాధుర్య
మాత్రాదపరమార్థపారదృశ్వానో విప్రలభ్యంతే!

మ॥ కొమరుం జీఁకటి చెట్టులట్టు గనుఁ దళ్కుల్దేరు నైల్యంబు చం
ద్రమబింబంబునఁ దోఁచెఁ జూచి జనులారా! యేదొకోఁదందు ర
క్రిమ మామాట దయావిహీనుఁడగుచున్ రాహుండు
క్రూరంపుదం
తములన్జేయు వ్రణంపుఁదూటుల ననంతం బట్టు కన్పట్టెడున్॥ 79

మరియు,

మ॥ ఉడులన్పట్టుఁట బట్టి తూలునణులట్లొప్పారు తేజంబులం
బలు ముక్కల్వలె నొప్పు రిక్కలను నభ్రం బొప్పుటంజేసి ము
న్నల యుష్ణాంశుని సానదీర్చి చతురుండా త్వష్ట నైజంపుఁ బె
న్నలినుం జేఁదురుఁగూడ సానపెనయింపం బోలునా నొప్పెడున్॥80

(అంతటంజూచి)

ఉ॥ ఎన్నో యుడుల్దమస్వినుల, కిన్నియె వెన్నెలరేల, నంటగ
న్గొన్నపుడా యుడు వ్రజముఁగూడను జేరిచి సాంధ్యవహ్నిచే
విన్నను మూసలోఁగరఁగి వేధ నిసిన్నిసి చెంచుమంచునో 81
యిన్నలినారి నంచు మదినెంచఁగ నయ్యెడు మాకుఁజూడఁగన్॥

(నవ్వి) యిట్లు కాదగినదే,

చ॥ అసదృశుఁడా సుధాంశుఁడిరు లాయువుఁగప్పిన కన్నుదోయిగా
నసమయ మృత్యుహారి దివసాంతమునం దతిథిత్వమందిఁ రాఁ
గసరి యుపేక్షసేయు నల కంజములం దన దోసముంచి బ
ల్వెసఁగనుఁదాను వానిదగు లేమలమోములఁబోలు మేలిమిన్॥82

విశ్వా—(అంతటంజూచి చిరునవ్వుతో) అకటా! పేరి మాధుర్య
మాత్రముచేతనే నిక్కమెఱుంగక భోగపరతంత్రు లెంతయు
భ్రాంతిజెందుదురుగాని

తథాహి,

శ్లో॥ స్మేరా దిశః కుముదముద్భిదురం పిబంతి
జ్యోత్స్నాకరంభ ముదరంభరయ శ్చకోరాః
ఆః కీదృ గతిమునిలోచనదూషికాయాం
పీయూషదీధితి రితి ప్రథితోనురాగః॥ 83

(రామంచదృష్ట్వా సహర్షస్మితం) కథ మయం కౌమారాంక విజయ పరిత్యాగతోపి తాటకానిగ్రహేణ ఘృణీయమావ స్నహ సానోపతిష్ఠతేవత్సః (లక్ష్మణం ప్రతి) వత్స! సౌమిత్రే! అస్మాక మనేన వృత్తాంతేన ప్రదోషలక్ష్మీ రియమనూద్యతే. పశ్య!

శ్లో॥ నిశాచరాణాం తమసాం నిహంతా
పురోయ ముద్గచ్ఛతి రామచంద్రః
అథోల్లసద్భి ర్నయనై ర్మునీనా
మయం కుముద్వా నజనిప్రదేశః॥ 84

రామః—(విభావ్య)

శ్లో॥ మదయతి యదుత్సన్నో దుగ్ధాంబుధే రయ మంబుధీ
న్నయతి నయనాద త్రేర్జాతో ముదం నయనాని చ
తదఖిలసురశ్రేణీసాధారణప్రణయా శచీ
సహచర చరుస్థాలీ సోమ స్సముజ్జస దీహతే॥ 85

(సలజ్జముపసృత్య) భగవన్! కుశికనందన! అభివాదయే,

చ॥ కలువలవెంతయేలియు వికాసముఁ జెందినఁ జెందనిమ్ము, ది 83
క్కులకిపు డెంతయుం దెలివి గూడినఁ గూడఁగ నిమ్ము కాంతిపం।
క్తుల నుదరంభరుల్ మదచకోరము లానిన నానగనిమ్ము కన్
నలుసితఁ డత్రి, కేటికొ జనంబు మహానుహుఁడన్నుఁ బొంగఁగాన్॥

(రామచంద్రునిఁజూచి సంతసముతోఁగూడిన చిరునగవుతో)
ఏమి! యితఁడు పిన్నవయసున కున్నతిఁ జూపు నిజమగు విజయమును గడువడిం బడసి వచ్చియుఁ దాటకను గీటడంచితి నను సిగ్గుచేత వేగముగా నన్నుఁ జేరకున్నాఁడు. (లక్ష్మణునితో) వత్స! లక్ష్మణా! మన యిప్పటి చంద మా ప్రదోషలక్ష్మి యందము ననుకరింపుచున్నది. చూడుము!

పృథ్వీవృత్తము—

క్షపాచరతమోనిహంతృత నెసంగు నీరామచం।
ద్రుపొల్పుఁ దిలకించు సన్మనుల తుష్టిమద్దృక్చయం।
బుపస్వటను నీప్రదేశము కుముద్వనంబట్టులై।
యపారరుచిపూరము బడసి యారా! రంజిల్లెడున్॥ 84

ఉ॥ ఇందుఁడు దుగ్ధవార్ధి నుదయించుటచే ముద మెల్లవార్ధులం।
బొందఁగఁజేయు; నత్రిమునిపుంగవు కంట జనించి యుంటఁ నా।
నంద మొసంగు నెల్లనయనమ్ములకున్; సహపాఠియైన సం।
క్రందనునట్లు వేల్పునికరంబును బ్రోచు సుధాప్తి నెఁ దగున్॥85

విశ్వా—(సస్నేహ బహుమానమాలింగ్య) వత్స! రఘునందన! ఇత్థమేవ.

శ్లో॥ ప్రకృష్టకర్త్రభిప్రాయ
క్రియాఫలవతో విధీన్
ప్రయుంజానా స్త్వయా వీర!
పరిపాల్యామహే వయం॥ 86

రామః—శిరసాగృహీత మాచార్యవచనమ్,

విశ్వా—(సమరధూళి ధూసరం రామస్య కపోలమున్మార్జయన్) వత్స! యత్ సత్య మధునా నక్తంచరచక్రవ్యతికరేణ ప్రియసుహృదా సీరధ్వజేన వితన్యమానే వైతానే కర్మణి కంపిత మివ మే హృదయం॥

రామ—(సగౌరవం) భగవన్! కఏషసీరధ్వజోనామ? య మద్య తే త్రిభువన దుర్లభోయం ప్రియసుహృచ్ఛబ్దప్రయోగః కమపి మహిమాన మారోపయతి।

విశ్వా—వత్స! శృణోషి విదేహేషు మిథిలాం నామ నగరీం॥

రామః—యత్ర పవిత్రమాశ్చర్యద్వయంజనాః కథయంతి సకలరాజ దుర్ధర్ష మైందుశేఖరం ధను ర్లాంగలముఖోల్లిఖిత విశ్వంభరా ప్రసూతి రగర్భసంభవా చ మానుషీ।

రామ—(సిగ్గుతో సమీపించి) మహాత్మా! కుశికనందనా! నమస్కారము.

విశ్వా—(స్నేహబహుమానములతోఁ గౌఁగలించుకొనుచు) వత్స! రఘునందన! యిప్పుడు మేము,

కం॥ కోరిన కోరిక కర్తకుఁ
గూరుపఁగాఁ జాలునట్టి గురుయజ్ఞవిధు
ల్గూరుచు కొనుచుండుదుమో
వీర! రిపుల దున్మి నీవు విశ్రాంతి నిడన్॥ 86

రామ—గురువచనముల నిదె శిరసావహించి నాఁడను.

విశ్వా—(సమరధూళి గ్రమ్మిన రాముని కపోలమును దుడుచుచు) వత్సా! యిపుడీ రక్కసిమూకల రాక చూచిన నాప్రియమిత్రుఁడగు సీరధ్వజుని జన్నమెట్లున్నదో యని నా మనసు మిగులఁ గలవరపడుచున్నది.

రామ—మహాత్మా! యీ సీరధ్వజుఁడను నాయన యెవరు? ముల్లోకములకుఁ బొంద నలవిగాని 'ప్రియమిత్ర' శబ్దము మీవలన నందుటచే నెంతయు మహామహుఁడని తోఁచుచున్నవాఁడు!

విశ్వా—వత్సా! విదేహదేశములందు మిథిలయను నొక పురముగలదని వినియుందువు గదా!

రామ—అవునుఁ అక్కడనేకదా, రాజులకెవ్వరికి నెత్తనైన శక్యముగాని హరువిల్లును నాఁగేటిచాలున బయల్పడిన భూగర్భసంభవయగు మనుజకన్యయునను నద్భుతములు రెండు గలవని జనులెందఱో చెప్పుచుందురు.

విశ్వా—(విహస్య) అథకిం ?

రామ—(సకౌతుకం) తతః కింతస్యాం ?

విశ్వా—

శ్లో॥ అసౌ సీరధ్వజో రాజా
యో దేవా ద్ద్యుమణే రపి
అధ్యైష్ట యాజ్ఞవల్క్యస్య
ముఖేన బ్రహ్మసంహితాం॥ 87

తస్యచ న్యస్తశస్త్రస్య పురాణరాజర్షే ర్జనకవంశజన్మనో దీక్షా విలోపశంకా పర్యాకులయతి మాం తదేన మాయుష్మంతౌ విధిశేష మస్మదీయం సమాప్య సహైవ మిథిలాం ప్రతిష్ఠామహే.

రామ—(సహర్ష మపహార్య) వత్స! లక్ష్మణ! మమాపి తరుణరోహిణీరమణచూడామణిపాణిప్రణయిని బాణాసనే కౌతుక మస్తి.

లక్ష్మ—(సపరిహాసం) ఆర్యాయా మయోనిజన్మని కన్యాయాంచ.

రామ—(సరోషస్మితం) కథ మస్యదేవ కిమపి ప్రహసనం సూత్రయతి భవాన్ (మునిం ప్రతి) భగవన్! ఇక్ష్వాకుకులగురో యదభిరుచితం భవతే!

—(ఇతి పరిక్రమ్య నిష్క్రాంతాస్సర్వే)—

ద్వితీయోంకః

విశ్వా—(నవ్వి) కాకేమి?

రామ—అయిన, నంను

విశా—

కం॥ అంబరమణి యగు సాశ్వా।
దంబుజహితువలన జనకుఁడ భ్యాసమున।
ర్చెం బరమ భక్తి శ్రుతి రూ।
పంబగు సంహితను యాజ్ఞవల్క్యముఖమునన్॥ 87

అట్టి జనకవంశజుండును సన్యస్తశస్త్రుండును బురాణరాజర్షి యునగు నతని యజ్ఞదీక్షకు లోపమేమయిన సంభవించునేమో యను సందియము నన్ను బాధింపుచున్నది. కావున మన యజ్ఞవిధానము తరువాయి తీరినపిమ్మట నమ్మిథిలాపురమ్మునకుం గూడ మనము వేగముగా వెడలవలసియున్నది.

రామ—(హర్షముతో, లక్ష్మణునివంక తిరిగి) లక్ష్మణా! నాకును నప్పురహరుని కరమునందలరిన శరాసనంబుఁజూడఁ గుతూహలంబు చాల కాలమునుండి కలిగియున్నయది.

లక్ష్మ—(నవ్వుచు) అగర్భసంభూతయగు కన్యనుగూడఁ గావచ్చును!

రామ—(సరోషమగు హాసముతో) ఔర। నీవు లేనిపోని దెద్దియో కల్పించు చుందువు. (మునితో) మహాత్మా! తమ సెలవు ప్రకారమే!

(అందఱును వెళ్లుదురు)

—ః ఇది ద్వితీయాంకము ః—

సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# భట్టమురారిప్రణీతే-అనర్ఘరాఘవే

## తృతీయోఽంకః

(తతః ప్రవిశతి కంచుకీ)

కంచు—(జరావైక్లబ్య విసంష్ఠులాని కతిచిత్పదాని గత్వా ఆత్మానం ప్రతి సఖేదోపాలంభం)

శ్లో॥ గాత్రై ర్గిరా చ వికల శ్చటు మీశ్వరాణాం
కుర్వ న్నహం ప్రహసనస్య నటః కృతోస్మి
త న్మాం పునః పలితవర్ణకభాజే మేనం
నాట్యేన కేన నటయిష్యతి దీర్ఘ మాయుః॥ 1

(పురోవలోక్య) అయె! సీతాపాదమూలోపజీవినీ! కలహంసికా!

కలహంసికా—(ప్రవిశ్య) ఆర్య! ప్రణమామి!

కంచు—వత్సే! కల్యాణీభూయాః!

కల—ఆర్య! చిరేణ కుతోయూయం!

కంచు—(విమృశ్య) కిన్నుకథ్యతే వత్సే! విదితమేవైతద్భవత్యా తత్రాదృగద్భుతం దారకద్వయ మాదాయ భగవా౯ కౌశికో యజమానం మహారాజం సీరధ్వజ ముపస్థిత ఇతి!



# అనర్ఘరాఘవము.

## తృతీయాంకము.



(తరువాత కంచుకి ప్రవేశించును.)

కంచు—(ముదిమిచే నొదవిన వణఁకునఁ దడఁబడు నడుగులతోఁ గొంచెమునడచి విసుపుదలతోఁ దన్నునిందించుకొనుచు)

చ॥ పటుతనడంచి యంగములఁ బల్కులఁ దొట్రుదవించి రాట్సభన్
చటువచన ప్రయోగములు సల్పెడు హాస్యరసప్రబంధపున్
నటునిఁగఁ జేసెఁ, బూసె వదనమ్మునఁ గ్రమ్మర వెల్లరంగు, న
న్నిటు పయిని చిరాయువీఁక నెట్టునటింప ఘటింపనున్నదో ?॥ 1

(ఎదుటనుజూచి) ఏమీ! సీతాకుమారిక యొద్దనుండు కలహంసికయా!

కలహంసిక—(ప్రవేశించి) అయ్యా! నమస్కారము!

కంచు—ఓసీ! నీకు మేలగుఁగాక!

కల—అయ్యా! ఏల నేఁడింత యాలస్యముగ వచ్చుచుండిరి?

కంచు—(విమర్శించి) ఓసీ! చెప్పకపోనేల? నిరుపమానము నత్యద్భుతమునగు బాలకద్వయమును వెంటనిడుకొని కౌశిక మహర్షి మన యజమానుఁడగు జనకమహారాజునొద్దకు వచ్చియున్న సంగతి నీ వెఱిఁగినదే కదా!

కల—ఆర్య ! తయోః ప్రభావం నామధేయంచ శ్రోతు మస్తి మే కౌతూహలం

కంచు—వత్సే ! కథయామి.

శ్లో॥ త్రయస్త్రింశత్కోటిత్రిదశమయమూర్తే ర్భగవత
స్సహస్రాంశో ర్వంశే జయతి జగదీశో దశరథః
యదస్త్రై రస్నిగ్ధై రసురయువతిశ్వాసపవన
ప్రకోపే సిద్ధే నస్ప్రశతి శతకోటిం శతముఖః॥ 2

శ్లో॥ ఇమా తస్య విశాంపత్యు
రాత్మజౌ రామలక్ష్మణౌ
యయో ర్భరతశత్రుఘ్నౌ
వనుజౌ ద్వంద్వచారిణౌ ॥ 3

కల—యథాస్మాకంగృహే భర్తృదారికా సీతా ఊర్మిళా మాండవీ శ్రుతకీర్తిశ్చ (విచింత్యాహర్షం నిరూపయంతీ) కథం మహాకుల ప్రసూతాః ఖల్వేతే కుమారాః (ముహూర్త మివస్థిత్వా దీర్ఘముష్ణంచనిశ్వస్య) కుతో అస్మాకమీదృశం భాగధేయం?

కంచు—భగవతి ! మా విషీద ! సర్వం భద్రం భవిష్యతి దేవబ్రాహ్మణ ప్రసాదాత్.

కల—తతస్తతః

కంచు—తతశ్చ వృద్ధాంతఃపురాణా మభ్యర్థనయా తౌ వికర్తనకుల కుమారౌ దృష్ట్వా నివర్తమానః పురోధసా గౌతమేనా హూయ రాజపుత్రీణాం సౌభాగ్య దేవతారాధనాయ ప్రహితోస్మి.

కల—అగునగును. అయ్యా! వారి జన్మనామములు లెవ్వియో వినఁ
దలఁతు నించుక సెలవిచ్చెదరా?

కంచు—ఓసీ! చెప్పెదను నాలకింపుము.

మ॥ అమరు ల్మప్పుడమియందుఁగోట్లు నిజదేహంబా సహస్రాంశు వం
శమునం బొల్చు నజేయుఁడై దశరథ క్ష్మాపాలుఁడాత్మైక దు
ర్దమ యాజ్ఞాస్త్రపరంపరం దనుజ కాంతాశ్వాస వాతప్రకో
పముఁగల్పించి శతక్రతు స్వాగతశంబస్పర్శనం జేయుచున్॥ 2

తే। గీ॥ ఆమ్మహీపాలు నాత్మజు లలఘుమతులు
రామలక్ష్మణు లన్యోన్య రక్తియుతులు
దోయిగఁ జరింతు రి భరతశత్రుఘ్నులనుఁగుఁ
దమ్ములై తమ్ముఁ బలెఁగవ దాల్చి మెలఁగ॥ 3

కల—మనయింట రాచకన్నియలగు సీతోర్మిళలు మాండవీ శ్రుత
కీర్తులుఁ బలెను, (చింతించి సంతోషముతో నిరూపించుచు)
ఆహా! మహాకుల ప్రసూతులెకదా! యిక్కుమారులు.
(కొంచెమూరకుండి నిట్టూర్పువుచ్చి) మనకెంత యదృష్టమో!

కంచు—ఓసీ! నీవంతగఁ జింతింప నక్కరలేదు. దేవబ్రాహ్మణానుగ్ర
హమువలన నంతయు మేలే కాఁగలదు.

కల—అయ్యా! తరువాత,

కంచు—పెద్దలగు నంతిపురమునందలి వనితలు కోరుటచే నారవికుల
కుమారులను జూడవచ్చుచుండఁ బురోహితుఁడగు శతానం
దుఁడుగారు మన రాచకన్నియలకగు సౌభాగ్యదేవతలను బూ
జించిరమ్మని నియోగించుటచేత దేవతాగృహమునకు వెళ్లితిని.

కల—ఆర్య! సర్వజనమనీషితం నామ తత్రభవత శ్శతానందస్య వచనం?

కంచు—వత్సే! ఏవమేతత్ నఖల్వేతథ్య మగంభీర మాంగిరసో బ్రూతే

కల—తస్మా ద్దార్య! కిమంత్రియసే శంకరశరాసనారోపణవ్యవసాయినో రాజర్షే ర్జనకస్య ప్రతిజ్ఞాసాహసం నిర్వహతి రాఘవః?

కంచు—వత్సే! అస్మాన ప్యయం వితర్క స్తరళీకరోతి,

తథాహి

శ్లో॥ పూర్ణేపి కర్మణి హతేష్వపి రాక్షసేషు
విజ్ఞాయ మైథిలసుతా మపి వీర్యశుల్కాం
బాలం పితుః ప్రియతమం రఘురాజపుత్ర
మేతావతీం భువ మృషిః కథ మానినాయ? 4

కల—(స్మరణ మభినీయ సవిషాదం) ఆర్య! ప్రవృత్తి విశేషలాభేన దుర్మనాయమానా మాత్మానం పాంచాలికాకేళి వ్యాపారేణ వినోదయంతీం భర్తృదారికాం ప్రేక్ష్య ప్రతినివర్తయితు మాగతయా ఆర్యస్య దర్శనేన మయా విస్మృతం అనేన పునా రాక్షసనామగ్రహణేన స్మారితాస్మి.

కంచు—(సవిషాదం) కీదృశీ సా ప్రవృత్తిః యా తవ భర్తృదారికా మపి దుర్మనాయయతి?

కల—యథా కిల సీతాదేవీం ప్రష్టుం దశగ్రీవపురోహిత ఆగతఇతి

కల—(సంతోషముతో) ఆశతానందుఁడుగా రానతిచ్చినది యందఱి సమ్మతినే కాదా ?

కం—కాకేమి ? ఆయాంగిరసుఁడెప్పుడును దూరమారయక పల్కు వాఁడు కాఁడు.

కల—అట్లయిన మీరేమి యూహించెదరు ? నారుసి విల్లెక్కిడవల యునను మనరాజుగారు పూనిన సాహసప్రతిజ్ఞ నీ కుమార రాఘవుఁడు నిర్వహింపఁగల్గునా మఱి ?

కంచు—ఓసీ! నేనును నావితర్కమునసే తొట్రుపడుచున్నాను.

కాని,

సీ॥ వధఁజెందెం దనుజాళి; యధ్వరము నిర్వర్తింపనయ్యెన్ యథా।
విధిగా; మైథిలిం జగంబులెరుఁగన్ వీరత్వమే శుల్కము।
త్వధికం బిప్పథ, మైన బాలు జనకాత్యంతప్రియుని వంశవా।
రిధి చంద్రున్నన పీటి కేటికి, మహార్షి స్వామి తాఁదెచ్చెనున్॥

కల—(జ్ఞాపకము నభినయించుచు, విషాదముతో) అయ్యో! కొం డొక వార్తావిశేషముఁ గలంగిన మనమ్ముతో బొమ్మల పెండ్లి వేడుకచే వినోదింపఁ జేయుచున్న సీతాకుమారిం జూచి యనయమెము తెలిసికొని పోవచ్చియు నిప్పుట మిమ్ముఁ జూచి యది మఱచితిని. యిప్పుడు మరల నీ దనుజనాను గ్రహణముచేతఁ దలఁపునకు వచ్చినది.

కంచు—(విషాదముతో) ఓసీ! రాజపుత్రి మనసు గూడ నొచ్చు నవార్త యేమి ?

కల—"సీతాదేవి నడుగుటకు దశకంఠ పురోహితుఁడు వచ్చెనని"

కంచు—(తతో౽వజ్ఞాంనాటయన్) సహర్షస్మితం కథ మేతావదపి కార్యం వత్సా జానకీ జానాతి య దనేనోద్యతేన దుర్మనీ భూయతే ?

కల—నూన మిదానీ మస్యాః కృతావతారమంగళాని అంగాని యౌవనస్య పంథాన మీక్షంతే.

కంచు—(విహస్య) సహర్షం దిష్ట్యాచిరస్య జీవద్భి రస్మాభి ర్యౌవన వతీ వత్సా వైదేహీ ద్రష్టవ్యా సస్మితం తతస్తతః।

కల—భవతు తన్నకిమపియుష్మాభిశ్శ్రుతం మయా కిమపి నకథితం॥

కంచు—వత్సే! నతావదర్థోయ మద్యాపి రాజగోచరీ భవతి ? యది చస్యాత్కి-మేతావతా పర్యవస్యతి ?

కల—హా తాతో రావణో దేవీం పరిణేష్యతి !

కంచు—

శ్లో॥ హస్తే కరిష్యతి జగత్త్రయజిష్ణురోఽపి
క స్తాదృశీం దుహితరం జనకేశ్వరస్య
ప్రాణాధికం విపులబాహుభృతా మపీదం
త్రైయంబకం కిమపి కార్ముక మంతరాయః॥ 5

నాపి దశకంధరానురోధేన స్వయం ప్రతిజ్ఞా మన్యథాకరిష్యతి మహాక్షత్రియో విదేహరాజః తన్నకించిదేతత్.

కల—ఏవం భవతు ఆర్య! కుత్ర సాంప్రతం తౌ రామలక్ష్మణౌ ?

కంచు—(ఎఱుఁగనట్లు నటించుచు) ఈ యుదంతమున మనసు కలఁగు నంతపాటి దయ్యెనా? సఖి?

కల—ఆర్యా! అగురు అదృష్టవశమున సముద్వేద్యావనమై విరాజిల్లుచున్నది.

కంచు—సరే, అట్లయిన నీకుఁ జెప్పనేల? చిరకాలము జీవించి యున్నందుకు మనకీ వేడుక కూడ కనఁబడుచున్నది.

కల—కానిండు నే నేదియునుఁ జెప్పనులేను; మీారేమియును విననులేదనుకొనుఁడు.

కంచు—ఓసీ! నీ చెప్పిన యివ్వర్తమాన మింకను రాజుగారికిఁ దెలియకుండునా? తెలిసిన నేమి? యింతమాత్రమున నేమగును?

కల—ఏమగుట యేమి? వాని యాశ బుగ్గిగాను! ఆ రావణనిశాచరుఁడు మన సీతం బెండ్లి యాడును!

కంచు—(నవ్వి)

తే॥ గీ॥ కడఁగి ముల్లోకములు గెల్చుఁగాక పేర్మి।
జనకజనుఁ గేల గ్రహియింపఁ జాలు నెవఁడు।
విపుల భుజాలకై ప్రాణాతిగపు విధాన।
నడుమ నడ్డుండె! నదె! ఫాలనయను విల్లు!॥ 5

ఇదిగాక మహాక్షత్రియకుల సంభవుఁడగు జనకుఁడు రావణుఁడెంత నిరోధించినను దన ప్రతిజ్ఞను విడుచువాఁడును గాఁడు. కనుక యిది యట్లున్నఁడును జెరుగదు.

కంచు—నన్వేతావేవ దేవతాగార వేదికాయాం,

శ్లో॥ మునీ కౌశిక వైదేహౌ
గౌతమా నభిరాధ్యతః
ఢౌకితౌ జ్ఞానకర్మభ్యాం
మోక్షస్వర్గావివస్వయం॥ 6

త దేహి కియచ్చిర మస్మాక మాగతానాం కన్యాంతఃపుర
మేవ గచ్ఛావః॥ *

(ఇతి నిష్క్రాంతౌ)

-(మిశ్రవిష్కంభః)—



కల—(నిట్టూర్పువుచ్చి) అట్లేయగుఁగాక! అయ్యా! ఇప్పుడా రామ
లక్ష్మణు లెక్కడనున్నారు?

కంచు—అదిగో! యీ దేవతాగృహ వేదియందె లక్ష్మణసమేతుఁడు
శ్రీరామచంద్రుఁడు,

తే॥ గీ॥ దముల౯ గౌశిక జనక గౌతముల౯ దరిసి।
వినయమున నొప్పుచుండె; నమ్మనుల వైన।
పుణ్య సత్కర్మ సుజ్ఞానముల౯ దనంత।
వచ్చు స్వర్గసమేతాపవర్గ మనఁగ!॥ 6

(యథామూలము) అదిగో! దేవతాగారవేదికయందే

పాఠాంతరము—

తే॥ గీ॥ దముల౯ గౌశిక జనక గౌతముల౯ దరిసి।
వినయమున నొప్పుచుండి రాఘవుల వైన
జ్ఞాన కర్మలచేఁ దాము గానెవచ్చి।
పొల్చు నపవర్గమును స్వర్గమును ననంగ!॥ 6

కావుట్టి రమ్ము! తపవమ్యో నంతిపురికిం బోవుదము!

(ఇద్దఱు వెళ్లుదురు.)

—(ఇది మిశ్రవిష్కంభము.)—



(తతః ప్రివిశతి జనకో విశ్వామిత్రిశ్శతానందో రామలక్ష్మణౌ చ)

జనకః—(సహర్షం) భగవన్ ! విశ్వామిత్రి !

శ్లో॥ లుంప న్నదృష్టజామాతృ
సంపదా శుచ మద్య నః
త్వదాగమనజన్మాయ
మానంద స్సుదినాయతే॥ 7

అపిచ,

శ్లో॥ అద్య ప్రిదక్షిణశిఖావలయః కృశాను
రశ్నాతి మే జనపదేషు వషట్కృతాని
త్వత్తేజసి స్ఫురతి శాంతికపౌష్టికేషు స్వాంచ
స్త్రిచం శిథిల మాంగిరసో బిభర్తి ॥ 8

విశ్వా—సఖే! సీరధ్వజ! చిరస్య శాంతః పుష్టశ్చ తవాయం జనపదః॥

శ్లో॥ యత్ర త్వం బ్రిహ్మమీమాంసా
తత్త్వజ్ఞో దండధారకః
పురోధా శ్చైవ యస్యాయ
మంగిరః ప్రిపితామహః ॥ 9

(సస్మితం) జామాతురదర్శనజన్మా తవాయం శోకః పున రస్మాక ముపశమయితు మవశిష్యతే ? కించ శోకహర్తాతునామ లోకయాత్రైవ భవతః, తథాహి,

(తరువాత జనక, విశ్వామిత్ర, శతానంద, రామలక్ష్మణులు
ప్రవేశింతురు.)

జనక—(సంతసమున విశ్వామిత్రునితో)

తే॥ గీ॥ మౌనిచంద్ర! యదృష్టజామాత్రివాప్తి।
మదినొదవు చింతనంతయు మాన్చజేసి।
భవ్యతరమగు నీరాక నవ్యసుఖము।
నించుటను నేడె సుదినమై మించుచుండె.॥ 7

మఱియును,

చ॥ అనఘ! ప్రదక్షిణార్చి యయి యగ్ని హవిర్గ్రహణంబొనర్చు, మ
జ్జనపదపాళి నిప్పుడిక శాంతికపౌష్టిక కర్మలం గనుం
గొనఁ దన సుక్రియా గౌతమునకున్ శిథిలమ్ముగఁ బూననౌను నీ
ఘనతరమైన తేజము ప్రకాశము నించుచు మించుచుంటచేన్॥ 8

విశ్వా—మిత్రిమా! సీరధ్వజ! ఇప్పుడే కా దెప్పుడును నీదేశము
శాంతియుఁ బుష్టియుఁ గలదియే!

తే॥ గీ॥ సకల తత్త్వ రహస్య విజ్ఞాతవగుచు।
రహిఁగొనెడు నీవు దండ ధారకుఁడవనఁగ!
నంగిరుఁడు ప్రపితామహుఁ డనఁగ నెగడు।
నీ శతానందముని పురోహితుఁడు నన(గ॥ 9

(చిరునగవుతో) అల్లుఁడు లభింపమిచే నగు చింతమాత్రము
ముపశమింప మాయెడ మిగిలి యుండునా? లోకానుసరణ మాత్ర
ములుగాని నిజముగ నీకేమి! శోకహర్షము లేమి అల్లేకదా,

శ్లో॥ యజూంషి తైత్తిరీయాణి
మూర్తాని వమతిస్మ యః
స యోగీ యాజ్ఞవల్క్యస్త్వాం
వేదాంతా నధ్యజీగపత్॥ 10

లక్ష్మ—(జనాంతికం) ఆర్య! అయం స రాజా వైదేహః పవిత్రమపరిమేయ మాశ్చర్యద్వయం యస్యోపదాన ముపాధ్యాయాదనుశ్రూయతే!

రాము—(సప్రమోదానురాగం) వత్స! సఏవాయం శతపథాధికారీ పురుషః ప్రణాయ్యాంతేవాసినే యస్మై భగవాన్ యాజ్ఞవల్క్యః శుక్లాని యజూంషి ప్రోవాచ॥

(ముహూర్తంనిర్వర్ణ్య)

శ్లో॥ నిజాయ తస్మై గుణవే యతీనాం
జైత్రాయ విశ్రాణితగోసహస్రం
తం గోసహస్రాధిపతేః ప్రశిష్య
ముపాస్మహే మైథిల మాతిథేయం॥ 11

జన—(సప్రశ్రయం) భగవన్! యదన్యత్కించి దభిదధాసి తత్ర ప్రభవిష్ణు ర్భవానేవ తత్ర భవతస్తు సహస్రమయూఖాంతేవాసినో యోగీశ్వరా ద్భగవతో యాజ్ఞవల్క్యా దధ్యయనమితి మహతీ ఖల్వియ మస్మాకం యశఃపతాకా।

తే॥ గీ॥ తైత్తిరీయ యజుస్సు లేధన్యమూర్తి ।
మూర్తిమంతములుగఁ దాల్చి పొల్చె నట్టి ।
యాజ్ఞవల్క్య మహర్షి నిన్నఖిలవేద ।
శిఖర సారంబు గ్రహియింపఁ జేసెఁగాదె ! ॥ 10

లక్ష్మ—(జనాంతికముగా) అన్నయ్యగారూ ! ఈయన యేనా ! జనకమహారాజుగారు ! అతి పవిత్రము నపరిమేయమునగు నద్భుతద్వయము గలిగి యున్నవాఁడని గురువుగారి వలన మనము వినియున్న యా విదేహదేశాధిపతి ?

రామ—(అత్యానందానురాగములతో) వత్సా ! సందేహమేమి ! శతపథకథా ప్రవృత్తికి ముఖ్యకారకుండును, ఇహాముత్రఫల భోగవిరాగియై పూజ్యుడైన యాజ్ఞవల్క్య మహర్షి యొద్ద శుక్లయజుశ్రుతి నభ్యసించిన రాజర్షియు, నగు మహాపురుషుఁ డీతఁడె !

(కొంచెము ధ్యానించి)

తే॥ గీ॥ సర్వయతిజేత యగు నిజాచార్యునకును
గోసహస్రి మొసంగిన గోసహస్రి
నాయకు ప్రశిష్యుని మహాతిథేయు, గేయు,
జనకు, నత్యంతసంతోష జనకు నెంతు. ॥ 11

జన—(విశ్వాసముతో) మహాత్మా ! సహస్రాంశు శిష్యుఁడును, బాల్యుఁడును నగు యాజ్ఞవల్క్య మహర్షి వలన నధ్యయన మొనర్చితిమనునది యొక్కటియే మాకుఁగల యశఃపతాక. ఇతరవిషయమున ననఁ దమరె సమర్థులరు.

విశ్వా—(విహస్య) భోమహాయోగిన్,

శ్లో॥ కిం యాజ్ఞవల్క్యో జనకః కిమేవం
నవః స్వరూపం కవయోఽపి విద్యుః
ప్రవాహనిత్యా నధికృత్య యుష్మాన్
సహస్రశాఖా శ్రుతయః ప్రథంతే॥ 12

శతానందః—భగవన్! ఏవమీదృశాః ఖల్వమీ త్రిభువనమహనీయ మహిమానో మనీషిణః.

జన—(సవైలక్ష్యస్మితం) భగవన్!

శ్లో॥ నిర్మాయ కార్మణ మృచా మఘమర్షణేనా
మున్మార్జనీ ర్జగ దఘాని తవాద్య వాచః
శ్రోతుం చిరప్రణయకౌతుక మస్తి చేతో
దుఃఖాకరోతి పున రేష మమార్ధవాదః॥ 13

తద్విరమ! (ఇతిశిరస్యంజలిం ఘటయతి)

విశ్వా—(సస్మితం అస్యాంజలిముద్ఘాటయన్) సఖే! సీరధ్వజ! సంహ్రియతా మంజలిః అమీ తూష్ణీంభూతాః స్మః కాత్యాయనీ కాముకకార్ముకారోపణ పణప్రణయ ప్రవీణేన దుహితుః-పత్యా సుప్రత్యపర్యుషితప్రతిజ్ఞో భూయాః!

లక్ష్మ—(అపవార్య) ఆర్య! పరస్పర మేషాం పౌరుషోత్కర్షప్రశం-సారమణీయః పావనోయ మృషీణాం సమవాయః

రామః—వత్స! యదాత్థ!

విశ్వా—(నవ్వి)

చ॥ అరుదగు యాజ్ఞవల్క్య మిథిలాధిపులిట్టిరటంచు చూపించు కే
నెఱుగరు మీస్వరూపమును, సిద్ధ చరిత్రకతా కవీంద్రులున్
సరిగఁ బ్రవాహనిత్యత నెసంగెడు మీయెడనుండి వేదముల్
పరమ సహస్రశాఖలయి పర్వుచునుండె జగంబునింపుచున్॥ 12

శతానందుఁడు— మహాత్మా! కుశికనందనా! అగును వీరలట్టివారే. త్రిజగన్మాననీయ మహిమాభిరాములును బ్రహ్మవిదులును అసమానులును నై యలరుచున్నారు.

జన—(సిగ్గుతోఁగూడిన చిఱునగవుతో)

చ॥ కలుషహరమ్ములౌ నిగమకర్మలు దీర్చి యఘమ్ములాఱ్చు నీ
పలుకులు వీనులార విను భాగ్యము నాకెపుడబ్బు నంచెదన్
బలు తమినుందు, తీర్చితివి వాంఛిత, మైన సుదర్శవాదముల్
గలుగఁగఁజేయుకున్నవి సుఖంబ,వి వీడుము వేడుకున్ నినున్॥ 13

(శిరమునందుఁ జేతులు జోడించును.)

విశ్వా—(చిరునగవుతో దోసిలివిప్పుచు) మిత్ర! సీరధ్వజ! అంజలి విప్పుము! ఇదె! యూరకుందును. నీవిప్పుడు హరశరారోపణ దక్షుఁడగు నల్లునిచేఁ బ్రతిజ్ఞానిర్వహణము నంది యలరుచున్న గాక

లక్ష్మ—ఆర్యా! వీరల యొండొరుల ప్రజ్ఞావిశేషములఁ దెలుపు ప్రశంస యెంతయు సంతోష మొదవింపుచున్నది. ఆహా! మహర్షుల సమావేశమెంతయుఁ బావనమైనదిగదా!

రామ—వత్సా! సందియమేమి!

శ్లో॥ స్మరంతి లోకార్థ మమీ కిల శ్రుతీ
రితి ప్రతిష్ఠా మధిగంతు మీశ్మహే
పరం య దేషాం పున రస్తి వైభవం
త దేత ఏవ వ్యతిపద్రితే యది॥ 14

జన—(సహర్షం) పర మనుగృహీతోఽస్మి.

శ్లో॥ సమస్యా వా సామ్నాం బహిరబహిరంహః పరిమృజా
మృచాం వా సంవాదః కిమపి యజుషాం వా పరిపణః
త్వదాశీర్వాదోఽయం బహువిషయసాక్షాత్కృతఫలో
వరం మేవత్సామ్యాః కథయతి పురోవర్తిన మివ। 15

విశ్వా—(సాకూతం) సఖే! సీరధ్వజ ఏవమేతత్.

శ్లో॥ దవీయస్యో దూరా దపథ మిచచాముత్ర చ శుచాం
త్రివేదీవాక్యానా మనతిచిరభగ్నా ఇవ ఖిలాః
శ్రుతిగ్రాహ్యం జ్యోతిః కిమపి బహిరంతర్మలముషో
మృజాయా మజ్ఞానః క్వను వివరియంతి ద్విజగిరః॥ 16

శతా—(స్వగతం) నూనం రామభద్ర మేవ జామాతర మభిసంధాయ భగవా నయం వక్రోక్తిభిః పునఃపున స్సీరధ్వజం పరిమోహయతే భవత్వహ మస్య ప్రరోచనార్థ మసంవిదాన ఇవ పృచ్ఛామి (మునిం ప్రతి) కస్యేదం శకుంతరాజకేతో రివ కౌస్తుభ శ్రీవత్స రత్నద్వయం?

విశ్వా—(విహస్య, స్వగతం) సాధు! వత్స! శతానంద! య దేతత్ కృతంతీర్థం వివక్షితస్య వస్తున స్సుఖావతారాయ (ప్రకాశం) వత్స! గౌతమ! కకుత్స్థకుల కుమారా వేతౌ.

తే॥ గీ॥ అఖిల లోకోపకారార్థ మాగమములు।
మరువరన్న ప్రతిష్ఠయె మనమెఱుంగఁ।
గలము గాని తదన్యమౌ నలఘుమహిమ।
వారి కొండొరులకెకాక, వశమె, తెలియ॥ 14

జన—(సంతోషముతో) మిగుల ననుగ్రహింపబడితిని.

ఉ॥ సామపు సీమయో, యకలుషంబగు ఋక్కులనిక్కమో యజు
స్తోమముధామమో, యనఁగ శోభిలుచున్నిజమై, ఫలంబుల।
న్వేమును బెక్కుచోట్లనిడు నీ ఘనవాక్యము నాకుమూర్తి కి।
స్తోమునిచంద్రమా మెదుటనుండినవానిగఁ దెల్పెమున్ వరున్॥ 15

విశ్వా—(సాభిప్రాయస్మితముతో) నుచ్చెలీ! అగునట్లే!

ఉ॥ దూరముకన్న దూరములు, దుష్పథముల్ వ్యథ కెంపు, లోఁ జెలిన్
మీఱునఘంబు లాఱ్చు శుచిమేర, లెదో శ్రుతివేద్యచిన్మయా
స్ఫారపుజ్యోతి, నాతిచిరభగ్నఖిలమ్ములఁబోలు వేద వా
గ్వారము, లెన్న నట్టి ద్విజవాక్కులు వ్యర్థములంట వింటిమే! 16

శతా—(తనలో) అగును నిక్కముగఁ బూజ్యుఁడగు నీతఁడు రామచంద్రునల్లునిగ వెల్లడింపక మఱిమఱి వక్రోక్తులచేత జనకునిట్లు భ్రమపెట్టుచున్నవాఁడు గావచ్చును. కానిమ్ము అదియేమొ వెల్లడి యగునట్లు తెలియఁగనివానివలె నడిగి చూతును. (మునితో) ఆర్యా! విష్ణునికౌస్తుభ శ్రీవత్సముల వలెనలరు నీ పట్టిద్దఱు నెవ్వరు?

విశ్వా—(నవ్వి, తనలో) బాగుగా నున్నది. యీ శతానందుఁడు నేను వివరింపనున్న దానినె యడిగి కొంతసులభము చేసినాఁడు (ప్రకాశముగా) వీరు కకుత్స్థకుల కుమారులు.

శతా—(సప్రత్యభిజ్ఞ మివ)

శ్లో॥ పుత్రార్థే జగదేక జాంఘిక యయూద్దామభ్రమత్కీర్తినా
చాతుర్హోత్రవితీర్ణ విశ్వవసుధాచ క్రేణ చక్రే మఖః
రాజ్ఞా పఙ్క్తిరథేన యత్ర సకలస్వర్వాసిసర్వాతిథా
స స్వైనైవ ఫలప్రదః ఫల మపి స్వేనైవ నారాయణః॥ 17

తత్కిమేతావేవ దాశరథీ యాః కిల రామలక్ష్మణౌ విశ్వామిత్రాటకామథన మంగళోద్ఘాత వితీర్ణ దివ్యాస్త్రమంత్రపారాయణేన భగవతైవ వినీతౌ వైతానస్య కర్మణ శ్ఛిద్రాపిధానదక్షిణయా భగవంత ముపాసాంబభూవతుః॥

విశ్వా—అథకిం ?

(జనకస్తౌ సస్నేహబహుమానం పశ్యతి)

శత—త దనయోః కతరో రామః కతరో లక్ష్మణః

విశ్వా—(రామం నిర్దిశ్య) వత్స ! ఆంగిరస !

శ్లో॥ యే చత్వారో దినకరకులక్షత్రసంతానమల్లీ
మాలామ్లాన స్తబకమధుపా జజ్ఞిరే రాజపుత్రాః
రామ స్తేషా మచరమభవ స్తాటకాకాళరాత్రి
ప్రత్యూషోఽయం సుచరితకథాకందళీమూలకందః॥ 18

శతా—(జ్ఞాపకము చేసికొనునట్లు) ఏమీ! అగును, నాఁడు

ఉ॥ పూని సితాశ్వ మెల్లజగముల్ స్వయశమ్మటు సంచరించఁగా
దాన మనంత యంతయుఁగ, దానవవైరులు తృప్తి నంద డెం
దాన సుతార్థియై దశరథక్షితిపాలుఁ డొనర్చె జన్న ము
ద్దాన ఫలప్రదాతయును దత్ఫలమును జలజేక్షణుండె గాన్॥ 17

వీర లా దశరథుని నందనులా? వీరేకదా, తాటకామథన మంగళారంభమునకుఁ గా, దివ్యాస్త్రమంత్రముల నెల్ల పఠియించి యజ్ఞరక్షణరూపమగు గురుదక్షిణ నొసఁగి యొసఁగుచుండి రను రామలక్ష్మణ నామకులు?

విశ్వా—సందేహమేమి?

జన—(వారి నిరువురను స్నేహబహుమాన పూర్వకముగాఁ జూచును.)

శతా—ఇందు రాముఁడెవరు? లక్ష్మణుఁ డెవరు?

విశ్వా—(రాముని జూపుచు) వత్సా! గౌతమా!

సీ॥ జలజమిత్రాన్వయ క్షత్రసంతాన వ।
ల్లీ మాలికామ్లాన సౌమగుచ్ఛ।
తుల్యులై రాజపుత్రులు నల్వు రుదయించి
వఱలుచునుండిరి వరుస నందుఁ।
బ్రథమసంభవుఁడు బల్ భవ్యాత్ముఁ డీతండు
రమ్యాకృతినెసంగు రాముఁడనఁగ।
దాటకానామక దారుణరాక్షస
కామినీరూపంబు గాంచికాన।

(లక్ష్మణం నిర్దిశ్య) అయం చ లక్ష్మణః !

శతా—భగవన్ ! వశిష్ఠ ! పరిసూతం క్షత్రియముద్ధ్యతే॥

జన—(విహస్య) సాధు! భగవన్నస్మాదృశేషు ప్రజాసు పరివిశ్య క్రీడసి॥

శ్లో॥ క్రోధాగ్నౌ పురుహూతహుంకృతిపరాభూతత్రిశంకు త్రపా
సంపాతజ్వలితే జగత్రయమయీం త్వయ్యాహుతిం జుహ్వతి
సంభ్రాంతోపనతస్య నాటిత జరాన్వైకల్యశీర్ణాతురాః
ప్రత్యాహారయబభూవు రంబుజభువో దేవస్య చాటూక్తయః॥ 19
తమపి నామ భగవంత మన్యే గోపాయితారః॥

శతా—రాజర్షే! ఏవమేతత్ కింతు పున ర్రక్షిష్యమాణాః నకురి
ధ్యంతీతి రక్షితారం క్షత్రియమను పాదద తే॥

జన—(సవిస్మయం రామలక్ష్మణౌ నిర్వర్ణ్య జనాంతికం) శతానంద !

శ్లో॥ భవతి నతథా భానో శ్శిష్యే గురౌ వసతో మమ
స్వయ మపి మునౌ విశ్వామిత్రే గృహా నధితిష్ఠతి
దశరథసుతౌ వేతౌ దృష్ట్వా యథోచ్ఛ్వసితం మన
శ్శిథిలయతి మే పరిత్యజ్యోతిః పరిబోధసుఖాసికాం॥ 20

తే॥ గీ॥ నయిన యల కౌశికాత్రి కహర్ముఖంబు।
నఖిలసద్గుణగణముల కాకరంబు।
సకలపాపాపహరణ దక్షప్రశస్త।
తరకథాళికి మూలకందంబు నగుచు॥ 18

(లక్ష్మణునుద్దేశించి) తక్కిన యీరెండవ యతఁడు లక్ష్మణుఁడు

శతా—మహాత్మా! అదృష్టవశమున వసిష్ఠునుపదేశముచే క్షత్రికుల మభివృద్ధి నందుచున్నది గదా!

జన—(నవ్వి) బాగు! బాగు! మహాత్మా! కౌశికా! నీవును మా వంటిప్రజలతోఁబాటు నటించుచుంటివా?

ఉ॥ వేలుపుతేఁడదల్చెదనను ప్రీడఁ ద్రిశంకుఁడు వోయ నాయత
జ్వాలలు తేగ నాగనిరుపాగ్నిని లోకము లీవు వ్రేల్చుచో
వేలుపుపెద్ద తద్ధృతిపీడి సదంభజరావిశీర్ణ వ
ర్ణాళిగఁ జెప్పుచోప్పగని యప్పుశి కప్పెనుపూన్కి మానవే?॥ 19

అట్టి సమర్థుఁడవగునీకును నొరులు సాహాయ్య మొనర్చువారలా!

శతా—(జనకునితో) రాజమునీ! అగును సిక్కాంబె, అయినను దీక్షపూసినవారు క్రోధమూనరామిని, రక్షకుఁడగు నొక క్షత్రికుమారుం దీసికొనుచుందురు గాదా?

జన—మహాత్మా! శతానందా!

ఉ॥ భానునిశిష్యుఁ డాత్మగురునర్యుఁడు నైతగు యాజ్ఞవల్క్య స
న్మానిని గొల్చుచోఁ గుశికనందనుఁడింటికిఁ దాన వచ్చుచో
బూనదు చిత్త మింతటిప్రమోదము బ్రహ్మసుఖానుభూతి పెం
పైన గణింప కీదశరథాత్మజులం గని పొంగెదు న్గదున్॥ 20

శతా—రాజర్షే! వైదేహ! ఈదృశమేవైతత్ మమాపి రాజపుత్రౌ వేతౌ సాక్షాత్కుర్వతో వత్సే సీతోర్మిళే నహృదయా దవతరతః॥

జన—(సఖేదస్మితం విశ్వామిత్రం ప్రతి)భగవన్!

శ్లో॥ ఇదం వయోమూర్తి రియంమనోజ్ఞా
వీరాద్భుతోయం చరితప్రరోహః
ఇమౌ కుమారౌ తవ పశ్యతో మే
కృతార్థ మంత ర్నటతీవ చేతః॥ 21

విశ్వా—(సోత్ప్రాసస్మితం) సీరధ్వజ! హృదయమేవామంత్రయస్వ కిమర్థం కృతార్థమసీతి॥

జనక—(సఖేదస్మితం)

శ్లో॥ యద్గోత్రస్య ప్రథమపురుష స్తేజసా మిత్రోయం
యేషాం ధర్మప్రవచనగురు ర్బ్రహ్మవాదీ వసిష్ఠః
యే వర్తంతే తవ చ హృదయే స్వస్థు సంబాధయోగ్యా
స్తే రాజానో మమ పునరసౌ దారుణ శ్శుల్కసేతుః॥ 22

రామలక్ష్మ—(సవిమర్శం) కథమస్మదీయాః కథాః ప్రస్తూయంతే॥

విశ్వా—(సవిమర్శస్మితం) రాజర్షే! యదిశుల్కసంస్థైవ కేవలమంత రాయః తన్నకించిదేతత్॥

శతా—రాజమానీ! వైదేహీ! అగునిది యట్టిదే! నాకును వీరిని జూచినప్పటినుండియు రాచకన్నియలగు సీతోర్మిళలు మనసునఁబట్టి విడువకున్నవారు.

జన—(విశ్వామిత్రునితో) పూజ్య! విశ్వామిత్రా!

కం॥ చరితంబిటు వీరాద్భుత
భరితం బిది వయసు చూపు భవ్యంబు మనో
హర, మీచిఱుతలఁగనిమది
చరితార్థంబైనయట్లు సుఖపడెదున్॥ 21

(పాఠాంతరము)

చ। వయసన నిద్ది యెంతో యభివాంఛిత, మాకృతి యున్న నిద్ది యెం
తయును మనోహరంబు, చరితంబన నిద్ది యపారవీర వి
స్మయరసపూరితం, బన సమంద ముదంబున నిక్కుమారక
ద్వయమునుఁ జూచి యాను, మది తద్దయు సార్థకమైనయట్లె లోన్

విశ్వా—(మిషతోఁగలసిన చిరునగవుతో) ఎట్లు కృతార్థతనొందితివని నీడెందమునే యడుగుము!

జన—(ఖేదముతో)

ఉ॥ ఏరికిఁ వేవెలుంగగు దినేశుఁడు భాసిలు వంశకర్తయో,
యేరికి ధర్మబోధనుఁడు నెప్డు వశిష్ఠుఁడు బ్రహ్మవేత్తయై,
యేరికినీవె యాప్తతవహించితో, వారలె బాంధవాఢ్యులౌ
వారును; గాని, పూనితి నవారణ దారుణ శుల్కసేతువున్॥ 22

రామలక్ష్మ—(చేచాటుగ) ఇదియేమి! మన వృత్తాంతమును బ్రస్తుతించుచున్నారు!

విశ్వా—(నవ్వుచు) రాజర్షీ! కేవలము శుల్కవిషయమే యంతరాయమని తలఁచెదవేని యది యెంతయోపనిగాదు.

జన—(సఖేదవిమర్శం అపవార్య) భగవన్ ! ఆంగిరస !

శ్లో॥ యద్విదన్నపి విదేహనందనీ
పాణిపీడనవిధే ర్మహార్ఘతాం
ఏవమాహ ముని రేష కౌశిక
స్తేన ముహ్యతి చిరాయ మే మనః॥ 23

శ్లో॥ తదేవ స్థాణవీయం వా
ధను స్స్వ ఉద దృశం
ఏత దారోపణం నామ
పణో వా మమ జర్ఝరః॥ 24

శతా—శాంతం ! పాపం ! శాంతం ! పాపం !

శ్లో॥ దుర్లంఘ్య మీశ్వరశరాసన మప్రమోచ్య
శుల్కాగ్రహా స్త్వమపి సర్వ మిదం తథైవ
కిం త్వస్య రాఘవశిశో స్సహజానుభావ
గంభీరభీషణ మతిస్ఫుట మేవ వృత్తం॥ 25

జన—(మునింప్రతి) భగవన్ ! కౌశిక ! చిరమపి వికల్పయన్ న
భవద్గిరా మభిధేయ మద్యాపినిశ్చినోమి॥

విశ్వా—(విహస్య) తమపదర్శయ ! కార్ముకమైందుశేఖరం, రామ
భద్ర ఏవ వ్యాకరోతు॥

రామ—(సహర్షం స్వ) కథమలీకవికల్పై రాత్మానం వినోదయామి
నన్వయం మమైవ కౌతుకం పూరయితు మైశ్వరం ధనురభ్యర్థ
యతే (జనకంచదృష్ట్వా సవిమర్శం) అహహ॥

జన—(ఖేదముతో) (విమర్శించుచు వెనుకకుఁదిరిగి శతానందునితో) అంగిరసుఁడా!

కం॥ సీతాపరిణయవిధి యం
దాతతమగు నాప్రతిజ్ఞ యనిహతమను నీ
లో తెలిసిగిన కౌశికముని
నేతయె యిటువల్కమనస నిశ్చయమయ్యెన్॥ 23

కం॥ తెలియఁగ రాదెయ్యది మదిఁ
దలఁచెనో? యిమహాత్మునియట్లు తానిలిపిన యా
చులకదనము నాపూనిన
బలుపందెమునందో? లేక భవువిలునందో?॥ 24

శతా—పాపము శమించుఁగాక!

ఉ॥ ఈశు శరాసనంబు నొరుఁడెక్కిడ నుక్కనుదక్కు నిక్కమే,
నీశపథంబు వీడమియు నిశ్చయమే, యిదియెల్లనట్లె పా
మ్మాశలనెల్ల నల్లు సహజాంచదుదార గభీరభీషణం
బీశిశువైన రాముఁడొదవించిన చిత్రచరిత్రరిత్తయే?॥ 25

జన—మహాత్మా! మిగుల యోచించుకొనియు మీ వాక్కుల కర్థమును నిశ్చయించుకొనఁ జాలకున్నాను.

విశ్వా—(నవ్వి) అట్లయిన హరశరాసనమును గనుపరుపుము! దీని యర్థము రామభద్రుఁడే వెల్లడించును.

రామ—(సంతసముతోఁ దనలో) రిత్తసంకల్పములతో మనసు నానందింపఁజేసికొననేల? యిదిగో పూజ్యుఁడు నాకోరికఁ దీర్చుటకే చాపమునుజూపఁ గోరుచున్నాఁడు. (జనకుని జూచి విమర్శింపుచు) ఆహా హా!

శ్లో॥ బాలే న సంభావ్యమిదం చ కర్మ
బ్రవీతి చ ప్రత్యయితో మహర్షిః
ఇతి ధ్రువం మంత్రయతే నృపో యం
దత్తే కిమత్రోత్తర మాకులోస్మి॥ 26

జన—(ముహూర్తమివస్థిత్వాదీర్ఘముష్ణంనిశ్వస్య) భగవన్! క్వ తాదృశం భాగధేయమస్మాకం యేనభగవతా విశ్వామిత్రేణ నాథవంతోవయ మేతస్మై రఘుకులకుమారాయ సీతాం ప్రతిపాద్య చిరాయ చరితార్థాభవామః

(రామోలజ్జతే)

జన—భగవన్!

శ్లో॥ యత్కోదండ సమర్పితత్రిభువన చ్ఛిద్రాపిధానవ్రతం
జాతం రోహితమేవ కేవలమపజ్యాబాధ మైంద్రంధనుః
తేపి ప్రేక్ష్యపురా శరాసనమిదం మౌర్వీకిణశ్యామికా
కస్తూరీ సురభీకృతా నబిభరు ర్వ్యర్థంభుజాన్ భూభుజః॥ 27

విశ్వా—సఖే! సీరధ్వజ! కథంపుణ్యరాశిమాత్మాన మవమన్యసే!

శ్లో॥ త్వద్భాగధేయ మపితాదృశ ముత్సవానా
మేతాదృశాం వయమపి ప్రసమీక్షితారః
సంత్యేవ విశ్వభువనాభయదానశౌండాః
క్షోణీభుజః పరమమీ న తు రామభద్రః॥ 28

లక్ష్మ—(స్వ) కథముపాధ్యాయేనైవాభిహితం యదస్మి వక్తుకామః॥

శా॥ బాలుండీ వృషిసేయఁ జాలుననిసంభావింప రాదంచుఁ, దాఁ
జాలుం దెమ్మనుచుండె నమ్మదగు నీసన్మౌనిరాజంచు, నెం 26
తే లోనెంచుచు నుండె నీన్నృపతి యీ నెట్లుండునో యుత్తరం
బాలోచింపఁగ రాక నాదు హృదయం బాలోలమౌచుండెఁ దాన్

జన—(ముహూర్తమాత్రము మూరకుండి వేడి యూహ్యవించి) మహా
త్మా ! నీపుత్రి యందు మాసీత నీరఘుకుల కుమారునకిచ్చి
చిరకాలమునకుఁ జరితార్థుల మగునంతటి యదృష్టము మాకుఁ
గలుగునా ! ఎలయన, ఈవిలు నెక్కుపెట్టుట యెంతయు దుస్త
రముగదా !

రామ—(సిగ్గుపడును)

జన—

ఉ॥ ఏరల విల్లు ముజ్జగము నెగ్గుచునం, దన విల్లె యల్లె లే
కూరక నిల్పు వేల్పు టొడయుం డలభూపులె, యీపురారి వి
ల్లాఁకసి నారిచే సిహతులందుటఁ జెందిన కందుపేరి క
స్తూరిని సౌరభం బెనయు దోర్యుగముల్ వృథగా భరింపరే! ॥ 27

విశ్వా—సఖా ! సీరధ్వజా ! మహాపుణ్యరాశివగు నిన్ను నీవట్లను
మానించు కొనెద వేమి ?

ఉ॥ అంతటిదా నదృష్టమున కర్హుఁడ నీవు తలంప, నట్టి మే
లెంతయు సంతసంబలర నే మును గాంచఁగనుంటి, ముందుగా
నెంతయు దోర్బలోన్నతి రహింన్ భువనావన దానశౌండుతా
నంతటి తేండ్లు పల్కు రెనగై నను రాముఁడు గారుగా, నృపా!॥28

లక్ష్మ—(తనలో) ఏమది ! నేఁజెప్పఁదలచుకొనునది యూసూర్యుఁడే
యానతిచ్చినాఁడు !

జన—సత్య మచిన్త్యో హి మణిమన్త్రౌషధీనా మివ రఘురాజడిం
భానా మనుభావః పరమేత ద్బ్రవీమి॥

శ్లో॥ గిరీశేనారాద్ధం త్రిజగదవిజైత్రం దివిషదా
ముపాదాయుర్జ్యోతి స్సరసిరుహజన్మా యదసృజత్
హృషీకేశో యస్మి న్నిషురజని మౌర్వీ ఫణిపతిః
పుర స్త్రిస్రో లక్ష్యం ధనురితి కిమప్యద్భుత మిదం॥ 29

శతా—అః కిమనయాపి నాకప్రశస్తి ప్రపంచికయా తదేత త్కౌశిక
మేవ ప్రమాణయంతో బహుమన్యామహే అపి కిమశక్యం
రామభద్రస్య॥

శ్లో॥ ఉత్పాదయ న్కమపి రాక్షసకోటిహోమం
తేజో హుతాశనసమింధనసామిధేనీం
యస్తాటకా మకృతబాలసఖైః పృషత్కై-
రీషజ్జయః స్ఫుట మనేన దశాననోపి॥ 30

(నేపథ్యార్ధప్రవిష్టః పురుషః)

దేవ! దశాననపురోహిత శ్శౌష్కలో నామ మహారాజం దిదృక్షతే॥

శతా—(సోద్వేగం) అః ఆగచ్ఛతు (పురుషో నిష్క్రాంతః)

రామ—(సవ్యథం జనాంతికం) వత్స! లక్ష్మణ! కథమంతరితో యమ
నేన దురాత్మనా రాక్షసరాజేన కామారికార్ముక పరిచర్యా
మహోత్సవః॥

లక్ష్మ—న కేవలమి (త్యర్ధోక్తే హసతి)

రామ—(సప్రణయరోషస్మితం తమపాంగేన పశ్యతి)

జన—మహాత్మా! అగును; నిక్కమే. మణిమంత్రాదులయందుఁబలె రఘురాజడింభకుల యందొప్పు సామర్థ్య మూహింప శక్యముగాదు, కాని, యింకనొక్కటియున్నది.

చ॥ సురల త్రిలోకజైత్రమగుజ్యోతి గ్రహించి సృజించె నల్వ, యా
హరుఁడు వహించి మించె, నట నమ్మగ మీఱెను శౌరి, నారియై
పరఁగెను బుట్ట పుట్టుదొర, పట్టణపుం ద్రియిలక్ష్మి, మద్భుతా
కరమయి, యొప్పు నిప్పరమకార్ముకరాజ మెనో సుతేజమై॥ 29

శతా—ఇఁకను నీహరశరాసనమును మిగులఁ బొగడనేల? ఈకౌశిక మునివాక్కులనె విశ్వసింతేము. ఇంతియకాక రామచంద్రునకును నసాధ్యమగునది యేముండును?

చ॥ పలుగుగయాళి రక్కసులపాలిటి హోమ మెదోతలంచియే
నలఁతులమేటి తాటకను బాలసఖాళులపేరి యింధనం
బులను వెలుంగఁ జేయుటకుఁ బూనెను రుక్కుగఁ జేసె నట్టియీ
యలఘుఁ డొకింతలోనన దశాననజేతయు నౌట ఖ్యాతమా॥ 30

(తెఱనుండి సగము గనఁబడుచుఁ బురుషుఁడు).

దేవ! దశకంఠపురోహితుఁడు శౌష్కలుఁడు దేవరవారిని దర్శింపఁ గోరుచున్నాఁడు.

శతా—(కష్టముగ) సరే! రానిమ్ము! (పురుషుఁడు వెళ్లును.)

రామ—(వ్యథతో, జనాంతికముగా) లక్ష్మణా! ఏమది! యీమరాత్ముఁడైన రక్కసిజేని వలన నా శివధనుస్సేవామహోత్సవమడ్డుపడిపోయినది.

లక్ష్మ—అదిమాత్రమేకాదు—(ఇట్లు సగమనినవ్వుచున్నాఁడు).

రామ—(చిఱునగవుతోనతనిని గ్రేగంటఁ జూచుచున్నాఁడు).

శౌష్క— (ప్రవిశ్య ప్రత్యేకమవలోక్య స్వగతం) కథమత్రైవ జనక శతానందాభ్యాం పురస్కృతో విశ్వేషా మస్మాకమప్యమిత్రో విశ్వామిత్రః (విచింత్య) తిష్ఠతు పాతకోయం (దక్షిణేన దృష్ట్వా) అహో! కావేతౌ క్షత్రియ బ్రహ్మచారిణౌ॥

శ్లో॥ పుణ్యలక్ష్మీకయో స్సోయ
మనయోః ప్రతిభాసతే
మౌంజ్యాది వ్యంజనై శ్శాంతో
వీరోపకరణం రసః॥ 31

నిసర్గోదగ్రమిదంచ దారకద్వయం
శ్లో॥ పార్శ్వత్రయాణా మేతేషా
మృక్సామ యజుషామివ
ఉభాభ్యాం విధమంత్రాభ్యా
మథర్వైవ ప్రదిశ్యతే॥ 32

(విమృశ్య) నూనం లక్ష్మణద్వితీయో రామభద్రకః కౌశిక మనుప్లవమానో మిథిలాముపస్థితః (సక్రోధ శోకం) హావత్సే! సుకేతుకులనందిని! తాటకే! కథమీదృశా న్మనుష్యడింభాత్ తాదృశో దైవదుర్విపాక స్తే సంవృత్తః కష్ట మనరణ్యవంశజన్మనః క్షత్రియవటో రనాత్మనేదితా॥

శ్లో॥ సుందాసురేంద్ర సుతశోణిత శీధుపానా
దున్మత్తమార్గణ నిరర్గళ వీరగర్వః
ద్రోహం చకార దశకంఠ కుటుంబకేపి
సోయం వటుః కుశికనందన యజ్ఞబంధుః॥ 33

శౌష్క—(ప్రవేశించి, వేఱువేఱుగఁజూచి తనలో) ఇదియేమి ? జనక శతానందులచేఁ బురస్కరించు కొనఁబడి విశ్వములకును మాకును గూడ నమిత్రుఁడగు దురాత్ముఁడీ విశ్వామిత్రుఁ డిక్కడఁ బ్రవేశించి యున్నవాఁడు ! (యోచించి) ఉండనిమ్ము ! ఇదియేమిలెక్క ! (కుడివైపుగాఁజూచి)

కం॥ వీరేరొకో ! పుణ్యాకారు

సారులు, క్షత్రియపుబ్రహ్మచారులు, ధీరుల్

వీరంబున కనుకరణం

బై రంజిలు శాంతరసపు వ్యంజనధారుల్॥ 31

ఆహా ! సహజతేజోవిభాసురంబై యీ దారకద్వయంబు,

తే॥ గీ॥ ఋగ్యజుస్సామములయట్లు లెసఁగునట్టి

వరముని త్రియమునకుఁ బార్శ్వమున నలరు

రూపుగఁనె విధిమాత్రముల్ రూఢి యనఁగఁ

దనరు నట్టి యథర్వవేదమును బోలి ॥ 32

(విమర్శించి) తప్పక వీఁడు లక్ష్మణద్వితీయుఁడగు రామహతకుఁడు యీకౌశికునితోఁగూడ మిథిలకు వచ్చియున్నాఁడు కావచ్చును. (క్రోధముతో) అన్నా ! సుకేతసుతా ! తాటకా ! యీమనుజవిసువుల వలననె నీకంతటి దైవదుర్విపాకము సంభవించెనా ! యేమి, యీ యనరణ్యవంశ్యుఁడగు రాచపోతము పోతరము !

శా॥ ఉండెన్ పై నలరావణాసురుఁడటం చూహింప కీకుత్రి దాఁ

జెండెన్ కోరి తదీయుల, న్మఖము రక్షింపఁబడెన్ మానికం

చుండెన్ సూదసుతాంగరక్తమధుపానోన్మత్త బాణాప్తిచే

నిండెన్ వీనికఖర్వగర్వము ! మది న్వీరుండ నంచద్దిరే ! ॥ 33

భవతు దశ్రిష్యామ్యస్య భుజశౌండీర్యం! (ఉపసృత్య ప్రకాశం)
అపిసుఖినో యూయం జనకమిశ్రాః॥
జన—స్వాగతం పౌలస్త్యపురోహితస్య ! ఇత ఆస్యతాం !
(శౌష్కలః తథాకరోతి)
కచ్చిత్కుశలం తే రాజ్ఞో రావణస్య ? అథవా॥
శ్లో॥ విపదాం ప్రతికర్తారో
యస్యోపాయైరథర్వభిః
త్వాదృశా స్సంతికి-తస్య
కల్యాణ మనుయుజ్యతే॥ 34

శౌష్క—(విహస్య) మహాశ్రోత్రియ ! సీరధ్వజ ! ప్రత్యాకరిష్యామేవ వయం ।యది స్వభుజమండలీమత్త వారణవలయితోరఃపీఠ ప్రాసాద సుస్థిత చతుర్దశభువన విజయలక్ష్మీమహాంతఃపురే లంకాపతౌ కిమపి ప్రతీకార్య మభవిష్యత్ । పశ్య !

(౯) యచ్ఛేష్టా స్సమసీక సీమని పరితః స్త్రః పరాంచన్నపి
ప్రత్యక్షీకురుతే సహస్రనయనః పృష్ఠోద్భవైరక్షిభిః
చక్రేవర్త్మ చ నాగలోకజయినీం యాత్రా మివ ప్రస్తువన్
యః కైలాస ముదస్య కీదృశే మహాదానం తు తస్యాపదాం॥ 35
లక్ష్మ—(సామర్షం జనాంతికం) ఆర్య ! కథమసౌ సహస్రభుజార్జున వాలిభ్యామాలీఢశౌర్యసారో దురాత్మా రావణః ప్రస్తూయతే॥

కానిమ్ము! చూత మీతని భుజశౌండీర్యము! (సమీపించి, ప్రకాశముగా) జనకనృపా! మీకందరకు క్షేమముకదా?

జన—పౌలస్త్యపురోహితునకు స్వాగతము! ఇటురమ్ము!
(శౌష్కలుఁడట్లుచేయును.) మీరాజు రావణుఁడు క్షేమముగ నున్నవాఁడా అగునుండకేమి?

కం॥ సిలుగు లధర్మోపాయం
బులచేఁ దొలగించు మిమ్ముఁబోంట్లటనుండన్
గలిగిన దశగళు మంగళ
కలన న్మఱివేఱెయడుగఁ గడఁగఁగనేలా?॥ 84

శౌష్క—(నవ్వి) మహాశ్రోత్రియుఁడవగు నో సీరధ్వజా! భుజదండ మండలియను మత్తవేదండ తండములు ప్రాకారముగా నొప్ప నడుమ నలరుచుండు నురఃపీఠమను మేలి మేడయందెంతయుఁ దిరముగ నిలుపఁబడిన చతుర్దశభువన విజయలక్ష్మి కంతఃపురమగు లంకాధినాథునకును నాపదలు సంభవించి యుండిన నివారించి యేయుందుము. దానికి సందియము లేదు కాని, చూడుము!

చ॥ అనిమొన నోడి పారునపుడైన సహస్రవిలోచనుండు కాం
చును దనవీపు మీఁది కనుచూపుల నెవ్వని చేష్టలన్ జయం
బును గొన నాగభూగతికిఁ బోలెను శూలిమల న్పెకల్చి చే
సెను పెను తెన్నెవండతేఁడు సిగ్గులపట్టగు బొట్టు పుట్టుమన్॥ 85

లక్ష్మ—(క్రోధముతో, జనాంతికముగా) అన్నయ్యగారూ! వీఁడా వాలికార్తవీర్యార్జునులచే నింకింపఁ బడిన శౌర్యసారముగల దురాత్ముఁడగు రావణునిగూడఁ బ్రస్తుతించుచున్నాఁడేమి?

రామ—వత్స ! మా స్మైవం మహాంతో హి తాదృశాః। కించ

శ్లో॥ ఖ్యాతాం నామ కపీంద్రహైహయపతీ తస్యావగాఢాంతర
స్థేమానా దశకంధరస్య మహతీ స్కంధప్రతిష్ఠా పునః
సద్యః పాటితకంఠకీకసకణాకీర్ణాం యదంసస్థలీం
స్వే నేభాజనపల్లవేన ముదితః ప్రస్ఫోటయ ద్ధూర్జటిః॥ 36

అపిచ

శ్లో॥ మఘోన స్సద్ఘోరం కులిశమలసీకృత్య సమరే
భునక్తి స్వారాజ్యం త్రిభువనభటోఽయం దశముఖః
శ్రియోనానాస్థానభ్రమణ రమణీయాం చపలతా
మపాచ్ఛిద్యస్వస్మి న్నపి భుజవనే వాసయతి యః॥ 37

శతా—(శౌష్కలం ప్రతి) బ్రహ్మన్ ! సత్యమయమీదృశో రాక్షస
రాజః

శౌష్క—రాజర్షే !

శ్లో॥ సంతుష్టే త్రిస్సృణాం పురా మపి రిపౌ కందూలదోర్మండలీ
క్రీడాకృత్తపునః ప్రరూఢశిరసో వీరస్య లిప్సోర్వరం
యాచ్ఞా దైన్యపరాంచియస్య కలహాయుతే మిథ స్త్వం వృణు
త్వం వృణ్వీత్యభితో ముఖాని స దశగ్రీవః కథం కథ్యతే ॥ 38

సోఽపి॥

శ్లో॥ కన్యా మయోనిజన్మానం
వరీతుం ప్రజిఘాయ మాం
పురోధసా గౌతమేన
గుప్తస్య భవతో గృహాన్ ॥ 39

రామ—తమ్ముఁడా! అట్లనరాదు. ఆలాటివారు గొప్పవారే.

ఇంతియగాక—

చ॥ ఇతని బలంపుఁ బెంపెఱిఁగి యుండ్రిజ హైహయులుండ్రు గాక య
ద్భుతము దశాస్యునంసములఁ బుట్టు ప్రతిష్ఠత దాత్వఖండితో
న్నతగళజమ్ము లెమ్ముల కణమ్ము గణమ్ములఁ జిమ్మి నెమ్మి సం
చితపు గజాజినాంచలముచే నెట శంభువు దా స్వయంభువై॥ 36

మఱియును—

చ॥ అనుపమదోఃపటుండు ఘనసైకభటుండగు నీదశాననుం
డని మొన నింద్రు ఘోరపు శతారపు సారమణంచి స్వర్గమున్
బెను ముదమానఁగా ననుభవించుచుఁ జంచలవృత్తి మాన్పి ల
చ్చిని దన దోర్వనమ్మున వసింపఁగఁ జేసి యెసంగెడున్ గడుఁ॥ 37

శతా—(శౌష్కలునితో) అయ్యా! అగును, మీరాతఁడు సరాజెట్టి
వాఁడే.

శౌష్క—రాజమునీ! జనకా!

ఉ॥ లీలఁగఁ దున్మ, నంపుచవలీలగజన్మ, తలజ్జెలంగుచో
హాలిసి దేలి మేలిమిఁ బురారి వరాలిడరాగ యాచ్నకుఁ
దూలుచు మోను లొంగ్వోకటితోఁ గలహించె వరించుమీవు నీ
వేల వరించ వంచు, నిఁకనేల దశాస్యుని హెచ్చు మెచ్చఁగాఁ॥38

అటులయ్యును.

తే॥ గీ॥ ఆతఁడ కడంగి యిపుడిట్టులనిపె నన్ను
నవనిసంజాతయైన కన్యను వరింప
గురుపురోహిత గౌతమ గుప్తమగుచు
వఱలు చుండెడు నీదు మందిరమునకును॥ 39

విశ్వా—సఖే! సీరధ్వజ! పశ్య! పినాకసందర్శనోల్లాసికా విసంస్థుల
చిత్తవృత్తిరివ వత్సో రామభద్రః॥

జన—(విహస్య)

శ్లో॥ కిమేతదేవ భగవ
న్నభిధీయే పునస్తరాం
ఇక్ష్వాకవో విదేహాశ్చ
పరవంత స్త్వయా వయం॥ 40

శౌష్క—భో! సీరధ్వజ! కిమిదమస్మాక మాకాశవచనం ఉత
దుష్పరిచ్ఛేద ఏవాయమర్థః యదుత్తరమపి న ప్రతిపద్యసే।
పశ్య!

శ్లో॥ దాతవ్యేయమవశ్యమేవ దుహితా కస్మైచిదేనా మసౌ
దోర్లీలామసృణీకృతత్రిభువనో లంకాపతి ర్యాచతే
తత్కిం మూఢవదీక్షసే ననుకథాగోష్ఠీషు శంసంతి న
స్త్వద్వృత్తాని పరోరజాంసి మునయఃప్రాచ్యా మరీచ్యాదయః॥41

శతా—చిరాయదత్తమేవోత్తరమస్మాభిః॥

శౌష్క—హంత! రాజపుత్రీసమర్పణాదన్యత్కిం దృశం తత్।

శతా—

శ్లో॥ శాంభవం చాపమారోప్య
యోఽస్మా నానందయిష్యతి
పూర్ణపాత్రమయం తస్మై
మైథిలీ కల్పయిష్యతే॥ 42

విశ్వా—సఖా! జనకా! చూడుము! చూడు మీరాసుతుఁడు ముక్కంటివింటిని గన్గొంట యాదెక్కువ మక్కువతో నున్నట్లు కన్పట్టుచున్నాఁడు.

జన—(నవ్వి)

తే॥ గీ॥ ఇది యొనర్పు మటంచు నీవింతనంత
మఱి మఱియుఁ దెల్పవలయునే, మౌనిచంద్ర!
యరయ నిక్ష్వాకులును విదేహావనిపులు
నీదు నానతి జేవదాట నేర్తురెట్లు?॥ 40

శౌష్క—ఏమోయీ! జనకా! మాపలుకాకసము వినవలసినదేనా? లేక దీనికభ్యంతరమేమని యంగీకరించి యూరకుంటివా? యుత్తర మొసఁగవేమి?

ఉ॥ ఏనికి నేనియుం దనయ నీయక పాయునె? దోర్బలోన్నతిన్ 41
బూని జగత్త్రయంపు గెలుపుం గని రంజిలు సింహాళేశ్వరుం
డే నిను వేడ, మూఢునటు లేల వృథాకథనుందు; చెప్పుచుం
డే! నిను జ్ఞానిగాఁ గొని మరీచిముఖర్షులు మాకు నీకథల్!॥

శతా—చిరకాలము క్రిందటనే దీనికి మేముత్తర మిచ్చియుంటిమి.

శౌష్క—రాజపుత్త్రినర్పించుటకన్న నిఁక దీనికి వేఱుత్తరమేమి!

శతా—

తే॥ గీ॥ ఎవఁడు ముక్కంటి బలువింటి నెక్కు వెట్టి
మా మనమ్ముల కెంతో సమ్మదముఁ గూర్పఁ
గలుగు నతనికిఁ గానుకగాఁగ నొసఁగఁ
బడును జానకి; యిఁకఁ బెక్కు నుడువు లేల?॥ 42

శౌష్క — శాంతం పాపం! అహహ! యుష్మాకమప్య మూన్యక్షరాణి॥

శ్లో॥ తేనాంగులీశతనిఘృష్ట కుబేరశైల
కంఠో త్కదోఃకులిశకందళ విక్రమేణ
మాహేశ్వరేణ మహతా దశకంధరేణ
కర్మేద మీదృశ మనార్య మపి క్రియేత ॥ 43

శతా — (విహస్య)

శ్లో॥ బ్రహ్మన్నయం క్షత్రియగోత్రజన్మా
దృఢప్రతిజ్ఞో జనకాధిరాజః
న చాప మారోపయితా దశాస్య
స్త్వ మేవ జానాసి యదు త్తరం నః॥ 44

శౌష్క — (సహాసం)

శ్లో॥ అంగిరాశ్చ పులస్త్యశ్చ
ప్రభవౌ పరమేష్ఠినః
పౌలస్త్యే జ్ఞాతిధర్మోయం
తత్క మాంగిరసస్య తే ॥ 45

(సామర్షం)

శ్లో॥ మాహేశ్వరో దశగ్రీవః
క్షుద్రాశ్చాన్యే మహీభుజః
పినాకారోపణం శుల్కం
హా! సీతే! కిం భవిష్యసి! ॥ 46

శతా — (సరోషవ్యథం) బ్రహ్మన్నేవమనేన ధనుషా కిమపి వినయాధికారిక మధ్యాప్యతే యదద్య పరం మాహేశ్వరస్తే రావణోపి సంవృత్తః ॥

శౌష్క—పాపము శమించుఁగాక ! ఔరౌర ! మీ మొగమునుండి
యే ! యీయక్కరములా ?

చ॥ ధనదు నగంబు నంగుళిశతంబున నెట్టనఁ బట్టి బిట్టు దే
ల్చిన నది కంఠపాఠముగఁ జెప్పెడు దోఃకులిశాంకురప్రథన్
గొని మొనఁజెంది యింద్రుధరు కూఁగిమిపట్టగుఁ నట్టి యాదృశా
ననుఁడనుపూని మూనక యొనర్చునె తప్పన కిప్ప డిప్పుడిన్॥ 43

శతా—(నవ్వి) బ్రాహ్మణుఁడా !
తే॥ గీ॥ ఇతఁడు సుక్షత్రి కులజుండు దృఢతర ప్ర
తిజ్ఞుఁడగు జనకేంద్రుఁడు తెలిసెదీవ
చాప మెక్కిడ దశముఖుఁ డోపఁడేని
యస్మదుత్తర మిఁక చాల నడుగనేల ! ॥ 44

శౌష్క—(నవ్వుచు)
తే॥ గీ॥ అంగిరసుఁడుఁ బులస్త్యుండు నంబుజాత
జాత జాతత నుంట నిశ్చయము గాదె !
ఆంగిరసుఁడవు పౌలస్త్య నందు నీవు
జ్ఞాతి ధర్మంబు నూపఁగ సంశయింతె ? ॥ 45

(రోషముతో సీత నుద్దేశించి)
కం॥ ఈపంక్తి పక్తిఁ డా నగ
చాపునకు న్భక్తి దన్యజనపతు లలఁతుల్ ;
నీ పిత కా ఘనచాపా
రోపణము పణమ్ము; సీతరో ! యేమగునో ! ॥ 46

శతా—(రోషములోఁగూడిన వ్యథతో) పాఠుఁడా ! నిక్కముగా
నిక్కార్మక మేదో కొంత వినయబోధ నొనర్చు చుంటచే

శ్లో॥ శంభోరాధారమచల
ముత్క్షేప్తుం భుజకౌతుకీ
మాహేశ్వరో ధనుఃక్రష్టు
మహో! తే దశకంధరః ॥ 47

(శౌష్కలవర్జమన్యే స్మయంతే)

శతా—(సరోషావహిత్థం) రామభద్ర!
శ్లో॥ తదేతదారోపయ చాపమీశ
పరిక్లిష్టభస్మప్రతిరూషితజ్యం
శౌర్యోష్మభాజాం భజతాం ముఖాని
స్వబాహుమౌర్వీకిణకాలిమైవ॥ 48

శౌష్క—(సక్రోధం) అశ్మతానంద! కింభ్రాంతోఽసి! యదేవమస్మదగ్రే మహారాజం పౌలస్త్యమధిక్షిపసి! కథం తే మాణిక్యపరిహారేణ గైరికపరిగ్రహః యదేవం దశగ్రీవమవమన్యమానస్య తే మనుష్యపోతేనురాగః యదివా భగవంతం గౌతమమపహాయ ధులిచక్షుషి సహస్రాక్షే భవతో మాతురపి కథమహల్యాయాః—

శతా—(సరోషహాసం) కిమాత్థ! రే! 'అస్మదగ్రే' ఇతి ॥

విశ్వా—(సప్రణయరోషమివ) వత్స! గౌతమ! విరమ శుష్కకలహాత్ అతిథిరయమస్మాకముపాధ్యాయో దశకంధరస్య
(వ్యథమానౌ రామలక్ష్మణౌ దృష్ట్వా విహస్య)

నిపుడు మీరావణుఁ డెంతయు శివభక్తుఁడయ్యెనేమోగాని,

కం॥ హరునకు నాధారంబగు
ధరణీధరముఁ బెల్లగించి, తబ్బిబ్బిదునాఁ
డురుభుజబలకౌతుకియా ?
మరి తద్ధను వెక్కువెట్ట మాహేశ్వరుఁడా ? ॥ 47

(శౌష్కలుఁడుగాక యందఱు నవ్వుదురు.)

శతా— (రోషముతో హేళనగా) రామభద్ర! రమ్మ!

తే॥ గీ॥ హరుని ముంజేతినిడు భూతి నతిశయిల్లు
నల్లెగల విల్లిదెక్కిడుమయ్య ! శౌర్య
గర్వయుతుల ముఖంబు, లఖర్వబాహు
మార్వికాకీణగణకాళిమనె భజింప ॥ 48

శౌష్క—(క్రోధముతో) ఓరీ ! శతానందా ! ఏమి ? మాయెదుటనే మహారాజగు పౌలస్త్యు నాక్షేపించు చున్నట్లు ప్రేలుచున్నావు ? ఏమినీకిది ! మాణిక్యమునువిడిచి జేగురురాతిని గ్రహించినట్లాదశకంఠు నవమానించి యొక నరడింభకునందెక్కుడనురాగముఁ జూపెదవు ? అట్లనవుదు, మీతల్లి గౌతమునిఁ గాదని—(అనుచుండ)

శతా—(వినుపించుకొనక) (రోషముతో) ఏమని ప్రేలుచున్నావు ? మాయెదుటనే యనియా ?

విశ్వా—(ప్రియరోషముతోఁ బలె) వత్స ! గౌతమ ! విరమింపు మెందుకువచ్చిన శుష్కకలహము ! ఇతఁడు మన కతిథియై వచ్చినవాఁడు. మరియు నారావణాసురునకు గురువు !

వత్స! రామ! ధనుర్గ్రహోప సర్పణమనుజానాతి జనకా
న్వయపురోధాః॥

రామ—యదాదిశంతిగురవ (ఇతి సవినయలజ్జాకౌతుకం పరిక్రమ్య
లక్ష్మణేనసహ నిష్క్రాంతః)

శౌష్క—రాజర్షే! సీరధ్వజ! ధన్యోసి! పురా ఖలు పరమేశ్వర
పరిచర్యాపదానేన కృత్తేషు నవసుమూర్ధసు॥

శ్లో॥ వరం తాదృక్కర్మాద్భుతసదృశ ముత్ప్రేక్ష్య కిమపి
ప్రిరోహద్వైలక్ష్యం పురవిజయినో యేన దదృశే
తదున్మృష్టం యేన త్రిభువనమపి పార్థిత మిదం
తదేవ త్వయ్యర్థీ భవతి దశమం రావణశిరః ॥ 49

శతా— (ఉత్థాయ నేపథ్యావలోకితకేన, సహార్షాద్భుతం)
పశ్యంతు భవంతః! ॥

శ్లో॥ యస్మిన్నేకధనుష్మలో భగవతః ఖట్వాంగపాణే రసా
వాకృష్టో గుణతాంగతో వ్యహిపతిః కర్ణావతంసాయ తే
ఉన్ముక్తశ్చ పురైవ భూషణపదం యాతి ప్రకోష్ఠాంతరే
(జనక ఔత్సుక్యంనాటయతి)
కాకుత్థ్సేన తదేవ భార్గవగురోః కోదండ మాకృష్యతే॥ 50

(నేపథ్యే కలకలః)

(సర్వే సాతంకం పశ్యంతి॥)

(పునర్నేపథ్యే)

పడుచున్న రామలక్ష్మణులనుజూచి నవ్వి) వత్సా! రామ భద్రి! విల్లుఁజూపుటకు శతానందుండు ధనుశ్శాలకు రమ్మనుచున్నాఁడు.

రామ—చిత్రము, గురువుల యానతిప్రకారమే (వినయ లజ్జాకౌతుకములతో లక్ష్మణసహితుఁడై వెళ్లును).

శౌష్క—రాజర్షీ! జనకా! ధన్యుఁడవైతివి. పూర్వ మప్పరమేశ్వరు నారాధించుటకు దశాస్యునిచే శిరసులు తొమ్మిదియు నఱకంబడినప్పుడు

చ॥ అసదృశమై యెసంగెడు తదద్భుతకర్మకుఁ దుల్యమౌ వరం
బొసఁగఁగలేమి, సిగ్గుగ 'నునుగు'ని, నేదశమంపు మస్తకం
'బొసఁగుము ముజ్జగంబు' లని యూరక, తత్ప్రపీడవేడె, నీ
దెస నిపుడర్థియయ్యెనదె, తీఱనికోరిక నేలపెక్కఁగన్ ॥ 49

శతా—(లేచి తెరవైపు చూచుచు నసంతోషాశ్చర్యములతో) చూడుఁడు!

చ॥ జగముల కేకధన్వియగు శర్వునకెం దహిరాజు మౌర్వియై
తగియును, గూర్చిలాగునెడఁ దద్దయుఁ గర్ణవతంసమౌచు మా
నఁగఁ గరకంకణంబయి కనంబడు, చెప్పటిచొప్పె చెప్పు నా 50

(జనకుఁడుత్సుకత నభినయించును.)

భృగుతనయోపదేష్టబలువిల్లదెరా! యదె! రాముఁడెక్కిడున్!

(తెఱలో కలకలను.)

(అందఱు డిల్లవడి చూచుచున్నారు.)

(మరలఁ దెఱలో).

శ్లో॥ రుంధన్నష్టవిధే శ్శ్రుతీ ర్ముఖరయన్నష్టౌ దిశః క్రోడయ
న్మూర్తీ రష్ట మహేశ్వరస్య దళయ న్నష్టౌ కులక్ష్మాభృతః
తాన్యక్ష్ణాం బధిరాణి పన్నగకులా న్యష్టౌ చ సంపాదయ
న్నున్మీల త్యయ మార్యదోర్బలదళత్కోదండకోలాహలః॥ 51

జన—(సహర్షవిషాదాద్భుతం) కథం! భగ్నమపి ?

శతా—

శ్లో॥ వైదేహీ కరబంధ మంగళ యజుస్సూక్తం ద్విజానాం ముఖే
నారీణాం చ కపోలకందళతలే శ్రీయానులూలుధ్వనిః
పేష్టుం చ ద్విషతా ముపశ్రుతిశతం మధ్యే నభో జృంభతే
రామక్షుణ్ణ మహోక్షలాంఛన ధనుర్దంభోళి జన్మారవః ॥ 52

శ ‘మ్క—(సవిషాదాద్భుతమాత్మగతం) అహో! క్షత్రియస్ఫులింగ
స్యదురాత్మనః సర్వకర్మీణమూష్మాయితం॥

జన—(సహర్షం పాదయోర్నిపత్య) భగవన్! గాధినందన !

సీ॥ ఏ గురుధ్వని రేగి నాగేశ్వరుని యష్ట
కర్ణములు బధిరతం గనంగం జేయు
నే యున్నతస్వనం బాయతంబై యష్ట
హరిదాళి మార్గోన్నత నందం జేయు
నేలనద్ధ్వానంబు ఘాలేశుని యష్ట
తనువులం జాంచల్య మెనయం జేయు
నే భూరి సంరావ మేపారి యుల యష్ట
కులనగంబుల బీటలొలయం జేయు
తే॥ గీ॥ నే రవ మపారమై కడుమీటి యష్ట
హరికులములం గనుచెవులందం జేయు
నట్టి కోలాహలమునఱ్ఱు నార్యు బాహు
బలిమి కలిమిని భంగంబుం బడయువిల్లు ॥ 51

జన—(సంతోషాశ్చర్యములతో) ఏమది ? విరిగిపోయినదిగూడనా ?

శతా—

ఉ॥ ఆకసమందనూన రిపుహానికుపశ్రుతి, విప్రనోట సీ
తాకరబంధ మంగళహితశ్రుతి, పుణ్యసతీమతల్లికా
లోక కపోలపాళుల నులూలుశుభశ్రుతి యై వెసన్దెసల్
వ్రీకె రవంబు, రామకరభగ్న గిరీశశరాస నాశనిన్ ॥ 52

శౌష్క—(వగపువెఱపులతోం దనలో) అన్నా ! ఏమి ! యీదుర్భ
రమగు రాచబిడ్డడను నగ్గికణము ప్రతిక్రియయంచును నమి
తమగు నాపిరిం జూపుచున్నది !

జన—(సంతోషముతో, విశ్వామిత్రుని పదములయందొరగి)
పూజ్యుండవగు నో గాధినందనా !

శ్లో॥ ఇయ మాత్మగుణేనైవ
కీ్రతా రామేణ మైథిలీ
స్వగృహావ్యవహారేణ
లక్ష్మణా యోర్మిళాస్తునః॥ 58

విశ్వా—(సస్మితం) సఖే! సీరధ్వజ! యదభిరుచితం భవతే॥

శతా—(జనకస్య కర్ణ ఏవమితి కథయిత్వా) భగవన్! కౌశిక! మమాపి చంద్రశేఖర శరాసనారోపణ ప్రథమ ప్రియవాదినోద్య పారితోషికం ధారయసి॥

విశ్వా—(విహస్య) వత్స! దీయతే కిమభిప్రైషి॥

శతా—భగవన్! కుశధ్వజ! దుహితృభ్యాం మాండవీ శ్రుతకీర్తిభ్యాం భరతశత్రుఘ్నా వభ్యర్థయే॥

విశ్వా—(శతానందంహాస్తె గృహీత్వాసస్మితం) సర్వ మస్మాభిరేవ నిధాతవ్య మాగమయస్వ తావద్దశరథం॥

జనక—తర్హి ప్రహీయతాం భగవానాంగిరసః ప్రియసుహృద ముత్తరకోసలేశ్వర మానేతుం॥

విశ్వా—ఏవమస్తు!

శతా—(ఉత్థాయ) కిమన్యద స్తివాంఛికం భగవన్!॥

విశ్వా—వత్స! విసృష్టార్థోసిగమ్యతాం॥

(శతానందో నిష్క్రాంతః)

విశ్వా—(హర్షంనాటయన్నాత్మగతమ్)

తే॥ గీ॥ తనదు శౌర్యాతిశయముచేత నె జయించె
నిలసుతను సీత నీరాముడిఁకను నేన
యగుచు నాసుత నూర్మిళ నతనితమ్ము
డైన యీలక్ష్మణున కీయ నభిలషింతు ॥

విశ్వా—(చిరునవ్వుతో) సీరధ్వజుఁడా! నీ యిచ్ఛవచ్చినట్లొనర్పుము. అందులకు సందియమేమి!

శతా—(జనకుని చెవిలో నిట్టిట్లని చెప్పి) ఆర్య! కుశికనందనా! శివుని విల్లెక్కిడు శుభవార్తను ముందుగఁ జెప్పిన నాకు బహుమాన మీావలసి యుండువుగాదా?

విశ్వా—వత్సా! ఈయ కేమి? యేమికావలయునో చెప్పుము.

శతా—ఆర్య! కుశధ్వజుని పుత్త్రికలగు మాండవీ శ్రుతకీర్తులను భరత శత్రుఘ్నులకిచ్చి పరిణయ మొనర్పింపుమని కోరుచున్నాను.

విశ్వా—(శతానందుని చేయిపట్టుకొని నవ్వుచు) అంతయు మనమే చేయవలయును. గాన దశరథుని రప్పింపుము!

జన—అట్లయిన నీయాంగిరసుఁడే వెళ్లి ప్రియమిత్త్రుఁడగు దశరథుం గొని రావలయును.

విశ్వా—అట్లే కానిమ్ము!

శతా—(లేచి) ఆర్యా! ఇంక నేమియైనఁ జెప్పవలసిన దున్నదియా

విశ్వా—వత్సా! అంతయు నీవెఱిగినదే, వెళ్లి రమ్ము

(శతానందుఁడు వెళ్లును)

విశ్వా—(సీతనభినందించుచుఁ దనలో)

శ్లో॥ దోర్లీలా దళితేందుశేఖర ధనుర్వ్యాఖ్యాత విశ్రాంతినా
కాకుత్స్థేన కృతో విదేహనృపతి స్తీర్ణప్రతిజ్ఞాభరః
పశ్యామశ్చ సుహృద్గృహాన్నవనవోన్మీలద్వివాహోత్సవా
నైక్ష్వాకేషు చ మైథిలేషు చ ఫలంత్యస్మాక మద్యాశిషః॥54

శౌష్క—(వైలక్ష్యరోషాభ్యాంస్మయమానః) భో! సీరధ్వజ! పురుషప్రకర్షాధానే విద్యావృద్ధసంయోగా ద్బహిరంగాని వయాంసి యదనయా ప్రహీణలబ్ధకన్యయా యౌవనసంబంధోపస్థితం పులస్త్యకుల ముపేక్షమాణో వర్షీయా నపి కోమలప్రజ్ఞోసి (మునిం ప్రతి) ఋషే! కౌశిక! నాద్యాపికించిదతిక్రామతి తవాపిలంకాపతౌ తాటకావధాపరాధ మపమార్ష్టు మయమేవ శ్రేయానవసరః॥

జన—(తత్రావజ్ఞాంనాటయన్) భగవన్! ఏహి! స్వయముపేత్య రామభద్రవదనచంద్రచంద్రికా ప్రవాహే నిర్వాపయామి తావదలీక ధనుర్ధరప్రార్థ్యమాన మైథిలీ కదర్థిత మాత్మానం నహిమిహిరమరీచిపరిచయ పచేళిమస్య హిమకరబింబసంపాతాదవరోపి కశ్చిదగదంకారః కైరవాకరస్య (ఇత్యుత్థాయ పరిక్రామతః)

శౌష్క—(సఖేదమాకాశే) హా! తపస్విని! సీతే! హా తాసి! పౌలస్త్య ప్రార్థితాఽపి విచార్యసే!

శా॥ బాహాప్రౌఢిమ నించె రాముఁడు ధనుర్భంగంబు గావించె నా
త్మోహాపూర్తి వహించె మైథిలుఁడీఁ కెంతేఁ గాంచె సా గాదె! వై
దేహైత్మ్వాక వరుల్పరస్పరము రక్తింగూర్చు కల్యాణ సం
దోహంబుల్బళిరా! ఫలంబుగ నెడుం దోడ్తోనె మా దీవనల్ !॥ 54

శౌష్క—(సిగ్గును గినుకనుంబూనిన వెడనవ్వుతో) ఓయీ! సీర
ధ్వజుఁడా! ఆలకింపుము! పురుషుల గుణదోషముల నరయు
నెడ నెంతయు మావంటి విద్యావృద్ధులతోనగు యోచనకన్న,
వయోవృద్ధులతో నెక్కువదిగాదు. కాఁబట్టియే కదా! కుల
గోత్రములెట్టివో యెఱుకపడక, మట్టినబుట్టిన నీపట్టిని, జెట్టఁ
బట్టఁ, గోరివచ్చినను, పౌఁ స్త్యకులము నున్నతిని నీవెన్నఁజా
లక వయసునఁ బెద్దవయ్యుఁ బ్రజ్ఞను గుఱ్ఱతనముఁ జూపు
చున్నావు. (మునితో) ఋషీ! కౌశికా! ఇఁక నిపుడైన మి
గిలిపోయిన దేమియు లేదు. నీకుఁ గూడ రావణునకుఁ, దాట
కను వధించి చేసిన మహాపరాధమును బాపికొన నిదియే
చక్కని శ్రేయస్కరమైన సమయము.

జన—(ఆమాటలను లక్ష్యముసేయక) పూజ్యా! కుశికనందనా!
రమ్ము! కల్లవిలుకాండ్రల్లరు జానకినిమ్మని చేయు నిరర్థక
ప్రసంగమువలన మిక్కిలి యుడికియున్న నామనమును నా
రాముని మోముజాబిల్లి వెన్నెల వెల్లువలు జల్లఁబరచుకొం
దును. తీక్ష్ణమగు సూర్యకిరణములచే వాడుజెందిన కలువకు
చంద్రసందర్శనముకన్న వేఱుమందు లేదుగదా!

శౌష్క—(దుఃఖముతో ఆకసమున) అయ్యో! తపశ్శాలిని! సీతా!

శ్లో॥ త్రిభువనవిజయ శ్రియస్సపత్నీం
జనయతి కో భవతీమనాత్మ తంత్రాం
స్వజనమపి న తేనురూపయామః
కిమపివిపాట్యభువం వినిర్గతాయాః॥ 55

(సరోషం జనకంప్రతి)

శ్లో॥ పౌరాణీభి రనేకవిక్రమకథాగాథాభి రర్థాపితా
స్తే వీరస్య జయంతి రాక్షసపతే ర్దో స్తంభదంభోళయః
యానుత్ప్రేక్ష్య విశోషయ న్మదమయం మైరేయమైరావణో
భూమాసగ్రిబ్ధి రభూదమ ర్త్యమధుపశ్రేణీషు సాధారణః॥ 56

శేషుసత్సు

శ్లో॥ వృధాసజ్జనసంబంధ
సత్కారేణాసివంచితః
పౌలస్త్యహ స్తవర్తిన్యా
సీతయా హి భవిష్యతే॥ 57

(సాక్షేపం నేపథ్యాభిముఖమవలోక్య)

పౌలస్త్యుఁడే ప్రార్థించినను నింకను సంకోచింపుచు మీరు నీ
కెంతఁ హానిఁ జేయుచున్నారు!

కం॥ భువనత్రియ జయలక్ష్మికి
సవతిగ నిన్నవఁడుసేయఁ జాలెడును? స్వతం
త్రివుగావు, నీకుఁబంధుగు
లెవరో తెలియ మవనివాల్చి యెటో నచ్చితినాన్॥ 55

(కోపముతో జనికునితో)

ఉ॥ పెక్కు పురాణరాజములు పేర్కొను సిక్కపుటుక్కుగల్గిపెం
పెక్కు దశాస్యదోరశనులింత స్మరించినయంత నాసుధా
భుక్కరి నిత్యదాన మధుపూరములాటుటఁజేసి భూషణ
స్రిక్కులతోనె దాను సదృశంబగు స్వర్గ్మధుపాళి పట్టునన్॥

(పాఠాంతరము)

ఉ॥ పెక్కు పురాణరాజములు పేర్కొను నిక్కపుటుక్కుమీఱి పెం
పెక్కుదశాస్యకోరశనులింత దలంచినయంత భూషణ
స్రిక్కులతోనె దాన మధుపారము శుష్కతనొంద నాసుధా
భుక్కరి నాశ్రితభ్రమరపుంజ ఘువీడి తొలంగెడున్వశిన్॥ 56

అవియుండఁగా,

కం॥ ఈసముచిత సంబంధపు
వాసి యెఱుఁగకీవు మోసపడితివి, యెటులే
నీ సీత యాదశగ్రీ
వాసురకరగతయు; నిక్కమది పెక్కేలా?॥ 57

(తెలివైపుఁజూచి సాక్షేపముగా)

శ్లో॥ **సమంతా దుత్తాలై స్స్వరసహచరీ చామరమరు**
త్తరంగై రున్మీల ద్భుజపరిఘ సౌరభ్య శుచినా
స్వయం పౌలస్త్యేన త్రిభువన భుజా చేతసికృతా
**మ రే! రామ త్వం మా** జనకనృపపుత్రీ ముపయథాః॥ 58

(సవిమర్శమాత్మగతం) **అహో!** గంభీర మిదముపస్థితం వస్తు తన్మంత్రిణా మాల్యవంతం పురస్కృత్య లంకేశ్వరస్య నివేదయామి॥

(ఇతి నిష్క్రాంతా స్సర్వే)

ఇత్యనర్ఘరాఘవే - తృతీయోఽంకః.

సంపూర్ణః.



శా॥ సారోదార కచాసుచామర మరుత్సంవ్యాప్త దోర్మద్గరో
త్సౌరభ్యుండు జగత్త్రియీభుజుఁడు సాక్షాద్రాక్షసాధీశుఁడే
దారక్తి న్వరియించె నీయవనిజాతక్ సీత నోకుబ్జ ! యో
రోరి ! రాఘవ ! చెట్టఁబట్టెదవు సుమ్మీ గ్రహింపకీహోద్ధతిక్ ॥ 58

(విమర్శించుకొనుచుఁ దనలో) అన్నా ! యిది చాల గొప్ప విషయము ! గాననిది యామంత్రియగు మాల్యవంతునితోఁగూడ నాలంకేశ్వరుని కెఱిఁగింతును.

(ఇట్లందఱును వెళ్లుదురు.)

(ఇది తృతీయాంకము).

సంపూర్ణము.





# భట్టమురారిప్రణీతే-అనర్ఘరాఘవే

## చతుర్థోంకః



తతః ప్రవిశతి మాల్యవాన్ (జృంభమాణశ్చక్షుషీ పరిమృజ్య)
అయే! విభాతప్రాయైవ విభావరీ తథాహి॥

శ్లో॥ స్తోకోన్నిద్రనిదాఘదీధితిమహః స్తంద్రాళుచంద్రాతపా
స్త్ర్యాయంతే కకుభో రథాంగగృహిణీ గార్హస్థ్య గర్హాభిదః
అద్యాపి స్వకులాయ శాఖిశిరసి స్థిత్వా రువంతో ముహు
స్తూష్ణీం ప్రత్యభిజానతే బలిభుజో భీతా స్స్వయూథ్య స్వరాన్॥ 1

అపిచ॥

శ్లో॥ ప్రాచీం వాసకసజ్జికా ముపగతే భానౌ దిశాం వల్లభే
పశ్చైతా రుచయః పతంగదృషదా మాగ్నేయనాథింధమాః
లోకస్యక్షణదానిరంకుశరసా సంభోగనిద్రాగమా
కోకస్తోమకుముద్వతీవిపినయో ర్నిక్షేప మాతన్వతే। 2

(సర్వతో నిరూప్య సహర్షం) హంత! సమంతాదామోదమాన సారసంభోగమయీ ఖల్వియం దశగ్రీవస్య భుజార్గళ పరిపాలితా రాజధానీ (ముహూర్త మనుధ్యాయ) అహహో! యతఃప్రభృతి వైదేహీ వరణాయ ప్రహితేన పురోధసా కథ్యమానం కకుత్స్థకుల కుమారస్య



# అనర్ఘరాఘవము

## చతుర్థాంకము.



(తరువాత మాల్యవంతుఁడు ప్రవేశించుచున్నాఁడు).

మాల్య—(ఆవులించుచుఁ గన్నులు నులిపికొని) ఏమీ! రాతిరి తెల్ల వాఱవచ్చినదే! అదిగో!

శా॥ స్తోకంబారవిలీల రేవెలుఁగు తేజున్ దోల, పిడ్వాటునన్
కోకద్వంద్వములొందుకుందువిడ దిక్కుల్నెక్కొనున్ దృక్కులన్
గాకాళుల్ తమగూళ్ల చెట్లకొనఁ గాకాయంచుఁ జెల్లార్చుచు
న్నాస్త్రకంబై వినుచున్ సయూధ్యరుతముల్ గుర్తించెడున్ భీతిచేన్ 1

మఱియును,

శా॥ ప్రాచీవాసకసజ్జికం గదియ దిగ్రామాప్తుఁడౌ ప్రొద్దు రా
కోచిర్భర్తృశిఖోజ్జ్వలానల మహోర్చుల్గూర్చు క్రొవ్వుల్ప్రచు
ల్యాభచక్రి ప్రజరేయి హాయిగను బంభోగమ్ములన్నిద్రిలన్
గాచుఁజూచితె! చక్కజక్కవలక్కల్హారిఁ ఖల్ప్రోచుటగాన్॥ 2

(అంతటం గలయఁజూచి సంతోషముతో) ఆహా! దశగ్రీవ భుజపరిపాలితమగు నీరాజధాని యెక్కడఁజూచినను సంతోష సమాక్రాంత పురజన మయంబై కన్పట్టుచున్నదుగదా, (కొంతసేపు ధ్యానించి) అన్నా! వైదేహినడుగ నంపిన పురోహితునివలన నా రాఘవ

తాదృశం మానుష్యకాతిశయ మశృణవం తతఃప్రభృతి కష్టాం దశా మనుభవామి॥

తథాహి॥

శ్లో॥ తత్తాదృశం కథముదేతి మనుష్యలోకే
తేజోద్భుతం నిరభిసంధి న తావదేతత్
తాన్యేవ చాస్య చరితాని దశాననస్య
ధిక్ చింతయా రజనిరక్షిషు నః ప్రథాతి॥ 3

కించ॥

శ్లో॥ శ్రుత్వా దుఃశ్రవ మద్భుతం చ మిథిలావృత్తాంత మంతః పత
చ్చింతాపహ్నవ సావహిత్థవదన స్తద్దిగ్వ్యతీర్ణస్మితః
హేలాకృష్టసురావరోధరమణీ సీమంతసంతానక
ప్రగ్వాసోజ్జ్వలపాణిర ప్యవతి మాం వత్సే న లంకేశ్వరః॥ 4

(విమృశ్య ఆకాశే విహస్య) హంత! వారుణేయమస్మాకం చిరంజీవితా॥

కుమారు నమానుష చారిత్రము వినినయదిమొదలు నామనసునకుఁ గుదురుఁబాటు లేకున్నది. ఔఁగదా!

చ॥ నరునెడనింత తేజమగునా యనుచు, న్మతియుద్ధి యూరకే
జరుగునె యంచుఁ గా కితనిచర్యలిటుండె నటంచు, నీనిశా
చరవరుఁగూర్చి చింతిల, వెసన్మది నిల్కడవాసి సుంతయున్
దెలుపియుఁదెన్ను లేక నిసి దీర్ఘతమంబయి తోఁచెడున్గదున్ ॥ 3

మఱియును

సీ॥ ఆలించిన సహింప నలవిగానిదియును
గర్వము మహాశ్చర్య కరమునౌచు
మిథిలాపురిని మీఱ ప్రథితమావార్తచే
మదిలోనొదవు చింత మాటుపఱుప
మొగమునఁదవ్వైపు మొలకనవ్వు వహించి
రహినించు నీవత్స రావణుండు
హేలగాఁ గడునవలీలఁగా నిర్జర
బాలాకచాకృష్టి నోలిఁగూర్చి

తే॥ గీ॥ యచటఁ జెలువారు చారుతరామరావ
నీజసుమదామవాసనల్ నిండుకొనెను
చేతులలరారు త్రిజగద్విజేతయయ్యొ
హర్ష మొదవింపఁడిపుఁడు! నాకక్కటకట!॥ 4

(విమర్శించి) కట్టా! యీ చిరజీవిత మెంతదారుణముగా నున్నది!
వత్సా! రావణా!

శ్లో॥ ప్రీతే విధాతరి పురా పరిభూయ మర్త్యా
న్వవ్రేఽన్యతో యదభయం సభవా నహంయుః
తన్మర్మణి స్పృశతి మాం మతిమాత్రమద్య
హా! వత్స! శాంత మథవా దశకంధరోసి॥ 5

(సవిమర్శం) అహో! మైథిలస్య నృపతే రకార్యజ్ఞతా!

శ్లో॥ విశ్వామిత్రవశీకృతే హృది వయం మాభూమ సంబంధిన
స్తే దృష్టాని కథం పురాణమునయో మాన్యాః పులస్త్యాదయః
జామాతాపి మహేంద్రమౌళివలభీపర్యంక రత్నాంకుర
జ్యోత్స్నామృష్టనఖేందుదీధితి గయం నాపేక్షితో రావణః॥ 6

(పురోవలోక్య) కథం మిథిలావృత్తాంతముపలబ్ధుం ప్రహితా చిరయతి వత్సా శూర్పణఖా॥

శూర్ప—(ప్రవిశ్య) అహో! సౌమ్యసుందరీవివాహనేపథ్యలక్ష్మీ విచ్ఛురితకాంతి ప్రాగ్భారాణి రఘుకులకుమారాణాం ముఖ పుండరీకాణి పశ్యంతీ జుగుప్సితేనాపి మాయామానుషభావేన కృతార్థీ కృతాస్మి। అహో! తాదృశీ గుణానాంప్రకృతిః య ద్విపక్షహ స్తపతితాపి సుఖయతి॥

మాల్య—(దృష్ట్వాసస్నేహం) కథం వత్సా శూర్పణఖా! వత్సే! ఆయ మహం! ఇతఇతో భవతి!

శూర్ప—కథమత్రైవ వాట్టాలశిఖరవర్తి ప్రగ్రీవే మే కనిష్ఠమాతా మహః! అహో! దుశ్లిష్టతా దుష్టకార్యాణాం! యదిదానీం ప్రజాగరక్లాంతాలోచనః ప్రతిక్షణజృంభికా పరిసారిత ముఖ

కం॥ హరుఁడు వరమిడెను నెడఁ గడు
గురువగు గరువమున నతనిఁగోరితివి నరే
తరజయమో, యెనఁగానీ !
పరికింపగ నీవు పంక్తివదనుఁడవు గదా ! ॥ 5

(విమర్శించి) ఏమి ! యీ మైథిలుని యకార్యజ్ఞత !

శా॥ తానాకాశికు నందధీనముగు చిత్తంబును, బంధుత్వమున్
బూనన్మెచ్చఁడు మమ్మింతులె మునులుప్పార్వ ల్పులస్త్యాదులా
హా ! నాకాధిపమౌళిసంఘటిత రత్నాంకూర చంద్రాతప
స్థానీభూతపదుండు రావణుఁడనన్ జామాతగానొప్పడే ! ॥ 6

(ఎదుటఁజూచి) ఏమి ! మిథిలాపురవార్త నరయఁబంచిన వత్స శూర్పణఖ యింతయాలస్యము చేసినది?

శూర్ప—(ప్రవేశించి) ఆహా ! యీ సౌమ్యసుందరీవివాహ మంగళమునందగు నలంకార శోభచే నతిశయించిన చెలువంబున నందారు రాఘవుల మోమును దమ్ముల, మిగుల ననహ్యమగు మాయామానుషీ వేషము నందయ్యెనఁ, గన్నులారఁజూచి కృతార్థురాలనైతిఁగదా ! ఔరౌర ! ఇట్లు పగఱచేఁ బడియును మిగుల సుఖమొనరించినదియకదా ! గుణసంపత్తియన !

మాల్య—(చూచి స్నేహముతో) ఏమీ ? శూర్పణఖయా ? వత్సా ! ఇదిగో నేనిక్కడ నుంటిని యిటురమ్ము !

శూర్ప—ఏమీ ! ఇదిగో ! తాతగారికోటకొత్తళము నందున్నవారా ? అన్నా ! అకార్యమునస్వభావ మిట్టిదేకదా ! రేయింబవళ్లు బొత్తిగా నిద్దుర లేక వొంతయునాసి మెట్టబడిన కన్నుల

కుమార దృష్టప్రాయస్థితి కఠినకార్య ప్రాగ్భారః కోఽప్యస్య ఇవ దృశ్యతే కనిష్ఠమాతామహః అథవా సామాన్యోఽపి గుణఃఖలు మాత్రిత్వం విశేషేణ సాహసైక వ్యవసాయస్య చండచరితస్యాస్మాకం రాజ్ఞో రావణస్య జానామి మామేవ ప్రతిపాలయం స్తిష్ఠతి యావదేవ ముపసర్పామి॥ (సవిషాద ముపసృత్య) ఆర్య! వందే!

మాల్య—కల్యాణీభూయాః ఇత ఆస్యతాం అపి భరతశత్రుఘ్నాభ్యాం సహైవ వైదేహా ముపస్థితో దశరథః?

శూర్ప—ఆర్య! దశరథే ఆగతే కుమారాణాం గోదానమంగళే సంవృత్తే మయా ప్రవిష్టం మిథిలానగరం॥

మాల్య—(నిశ్వస్య) అతిప్రకాశోఽయమర్థః యథా నిర్వృత్తస్వీకరణా జానకీ।

శూర్ప—అథకిం?

మాల్య—(విమృశ్య) అహో! దురాత్మనః క్షత్రియబ్రాహ్మణస్య కుశికవంశజన్మనో దుర్నాటకం!॥

శ్లో॥ యజ్ఞోపప్లవశాంతయే దశరథో రాజా సుతం యాచిత
స్తం చానీయ వినీయ చాయుధవిధౌ తే జఘ్నిరే రాక్షసాః

తో నిముసమైన నెడములేక వెడలుచున్న యూర్పులింతలతో గూడిన తననోటం జెప్పకయె చెప్పఁబడిన కొండొక కఠిన కార్యభారము గలిగి మిగుల నొగిలియుంటచే వేఱొకనింబలె గన్పట్టుచు నానవాలుపట్టుటకు వీలులేకున్నవాఁడు. అన్నా! ఎట్టులైనను మంత్రిత్వ మతి దుష్కరమైనదిగదా! అందును మిగుల సాహసియై చరియింపుచుండు చండచరితుఁడగు మన రావణునియొద్ద నెవ్వఁడిఁకఁ జెప్ప నేమున్నది? ఇతఁడిప్పుడు నారాకకె యెదురుచూచుచున్నట్లున్నది. కావున వేగముగా సమీపింతును. (విషాదముతో సమీపించి) ఆర్యా! మాతామహా! నమస్కారము!

మాల్య—పుత్రీ! మేలందుము. రమ్మిటుఁ గూర్చుండుము! భరత శత్రుఘ్నులతోఁగూడ దశరథుఁడు మిథిలాపురంబున కరుదెంచెనా?

శూర్ప—(కూర్చుండి) ఆర్యా! దశరథుఁడు వచ్చుటయే కాదు. నేను మిథిలాపురిం జేరునప్పటికే కుమారుల వివాహముల కంకణ ధారణముకూడ నైనది.

మాల్య—(గట్టిగా నూర్పుపుచ్చి) అట్లయిన సీతాకరగ్రహణ మయినట్లే.

శూర్ప—ఔనందుకు సందియమేమి?

మాల్య—(విమర్శించి) ఏమి! ఆక్షత్రియ బ్రాహ్మణుఁడగు దుష్ట కౌశికు దుర్నాటకము!

చ॥ తనమఖరక్షకై దశరథక్షితినాథుని పుత్త్రుఁ దెచ్చి యా
తనికి ఘనాస్త్రవిద్యనిడి దానవున్ వధియింపఁజేసి శ

త్రైయక్షం విదళయ్య కార్ముక మథస్వీకృత్య సీతామితో
నో విఘ్నః కుహనాపటేన వటునా కిం తేన కారిష్యతే॥ 7

శూర్ప—ఆర్య! ఏవమేతత్ స తత్ర మయా బ్రాహ్మణో వసిష్ఠమహర్షేస్సమీపే విస్ఫురన్దృష్టః॥

మాల్య—(విహస్య) వత్సే! తపోభిరస్య బ్రాహ్మణ్యాదేశోఽపి స్థానివద్భావేన క్షత్రధర్మం న జహాతి కించ స్వభావమధురోఽపి కాకుత్స్థవటు రౌత్పత్తికేన క్షాత్రేణ బ్రాహ్మేణ బ్రాహ్మణ్యేన చ జన్మనా త్రిజాతకాన్మన్వే రథీయన్నధరీణశీలః పరిణాస్యతే తథాహి॥

శ్లో॥ అవినయభుజా మజ్ఞానానాం శమాయ భవన్నపి
ప్రకృతికుటిలా ద్విద్యాభ్యాసః ఖలత్వవివృద్ధయే
ఫణిభయభృతా మాశుచ్ఛేదక్షమ స్తమసా మసౌ
విషధరఫణా రత్నాలోకో భయం తు భృశాయతే॥ 8

భవతు! కిమతిక్రాంతోపవర్ణనేన? కథమిదానీం స్వయంగృహీతాముత్తిష్ఠమానో రాక్షసపతిః ప్రతికర్తవ్యః స్యాత్?

శూర్ప—ఆర్య! న ఖలు బలాత్కారం పరిహృత్య తస్యాన్య ఉపాయస్తర్క్యతే॥

మాల్య—వత్సే! మామైవం మహాప్రమాదో హి తాదృశేన ధర్మవిజయినా వీరపరివాళేన పరిగృహీతాయాం వైదేహ్యాః ప్రసహ్యాపహారః॥ పశ్య॥

ర్వాని బలువిల్లొకింతటనె త్రుంచ ఘటించి, గ్రహింపఁజేసె భూ
తనయ, నీఁకే సదంభునటుఁ డానెదిసేయఁగఁ జేయునోకదా! ॥ 7

శూర్ప — ఆర్యా! అగునట్లే. అతఁడిచ్చటనేయుండి యావసిష్ఠముని కన్నను నెక్కుడుశ్రద్ధతో నున్నట్లు గన్పట్టెను.

మాల్య — (నవ్వి) తపోవిశేషమున నితఁడు బ్రాహ్మణుఁడనిపించుకొనినను సహజమగు క్షత్రభావమును విడువకున్నవాఁడు. మఱియు మిక్కిలి సుస్వభావుఁడయ్యు నీరాఘవనటుఁడు జన్మముచేతను, బ్రాహ్మణుచేతను, బ్రాహ్మణ్యముచేతను త్రిజాతకుఁడగు నమ్మునికడ నధ్యయన మొనర్చుటచే నింధ్యుఁడగుట నిశ్చయము. అట్లేకదా,

చ॥ అవినయపుం దమంబడఁచునైన సదా కుటిలస్వభావుచే
నపుఘనవిద్య ధృష్టకై యాట ధృవంబ; తనుంబణంపఁగా
నవు నహిరత్న దీపములనొ పెనువెల్గు మఱింత భీతికే
యవునుగదా, మదిన్ ఫణిగణాతిభయాన్వితులైన వారికిన్ ॥ 8

కానిమ్ము; ఇఁకజరిగినదాని నెక్కుడుగా వర్ణించుటతోఁ బని లేమున్నది, యిప్పుడు సీతను దాఁగ్రహింపఁబూనిన రాక్షసరాజుచే జేయఁగగు ప్రయత్న మేమియై యుండును?

శూర్ప — ఆర్య! బలాత్కరించుటకన్న వేరు ప్రతీకారమేమున్నది?

మాల్య — వత్సే! అట్లుకాదు. అట్టి ధర్మవిజయమున బాలవీరుఁడు ప్రతిగ్రహించిన వైదేహిని బలాత్కారమునఁ గొనితెచ్చుట మహాదోషము. కాక యితఁడు అసాధారణుఁడనికూడఁ గన్పట్టుచున్నది. యిట్లే కాకున్న నొక సామాన్యమానవజాతిలో

శ్లో॥ దోః స్తంభ ద్వయదర్ప డంబరమితిస్పృష్టం న విస్పష్టతే
వైదేహీ కరబంధ సూచకమితి ప్రీస్త్రాతి న వ్రీళయా
ఇత్యాలోచ్య కృతస్మితై ర్మునిభి రాదిష్టేన యేఽక్షుణా
దాత్తం సజ్జిత మాచితం చ సహసా భగ్నం చ తాదృగ్ధనుః॥ 9

కథ మస్మదీయం నిశాచరనాథ మాశతాయిన మనుజాసీమః॥

శూర్ప—యథానిరూపితం కనిష్ఠమాతామహేన అహో! కాలస్య మాహాత్మ్యం! యదిదానీం త్రిభువన లక్ష్మీలీలాబందీకారే మహారాజరావణోపి ఏవంమంత్ర్యతే॥

మాల్య—వత్సే!

శ్లో॥ మునిరపి గురుర్దివ్యాస్త్రాణాం బభూవ దివౌకసా
మజగవధనుర్భంగేతావానహో సమహోత్సవః
రఘుపతి గుణకీర్తా మేతామవేహి జగత్త్రయీం
వివరిణమతే దౌర్జన్యం తు ప్రభుత్వపదేన నః॥ 10

సీ॥ నిజభుజాబలగర్వ నిర్వాహణాహం కృ
యాటోపమని యుబలాటపడకు
వసుధా తనూజావివాహ సూచకమను
నురుల చే దాని యబుసు దేడు
అఖిలవీరాగ్రేసరా సాధ్యమిదియని
యొక్కింతయును మది లెక్కగొనకు
మాననీయాత్యంత మహిమాన్వితాచార్య
సమితిచోదనము లక్ష్యంబు విడకు
తే॥ గీ॥ తానని యెఱింగి మునిజనులానతీయ
నతిముదంబున నితడ ప్పురారిధనువు
నెట్టుగ్రహించె గడువడి నెక్కు వెట్టి
కర్షణ మొనర్చె మఱియు భగ్నతఘటించె!॥ 9

అట్టివానియెడ నిట్టితుంటరితనమునకు మనతేనిని మనమే యెట్లు పురికొల్పుదుము ?

శూర్ప—(నిట్టూర్పువుచ్చి) అగు నార్యా! మీరు చెప్పినది నిక్కమే అన్నా! యేమి! కాలమహిమ! త్రిభువన విజయ లక్ష్మిని సవిలాసముగాఁ దెచ్చి బందీకరించిన మహారాజగు రావణునేఁడ గూడ నిట్టితలఁచవలసి వచ్చినది?

మాల్య—వత్సా! ఇంతియుకా దాలకింపుము!

మ॥ ముని యయ్యంగుళికాత్మజుండు గురువై బోధించె దివ్యాస్త్రవి
ద్యను, జేజేలటుపొంగి రీసుధను వాతెంజెక్కడన్, గాన నె
ల్వెనతిండొప్పుగ విశ్వముల్మనమిఁక న్నిగ్గేని యెగ్గది యా
తనిచోఁ జేసిన నస్మదీయ విభుతా దోష్టంబె తెల్లంబగున్॥ 10

శూర్ప — కస్సందేహః తస్మిన్ వివాహమహోత్సవే సర్వంమయా ప్రత్యక్షీకృతం॥

మాల్య — తదేవ మేకలోష్టవధస్స్యాత్ తథాహి మిథిలాంప్రవిశ్య బలాదాకృష్యమాణే కళత్రే కథం తితిక్షతే రాజపుత్రః తం చోత్తిష్ఠమానం పౌరజానపదాః ప్రకృతయోఽప్యనూత్తిష్ఠేరన్ కింపున రంగ సంబంధినో బాంధవాః యథోక్తం ఆరణ్యోఽగ్ని రివ దుస్సహా దుఃఖాన్మృజం తేజోవిక్రియ ఇతి మండలస్య చానుగ్రాహ్యో భవతీతి॥

శూర్ప — (దీర్ఘముష్ణంనిశ్వస్య) ఆర్య! కిమిద నీం యుక్తం॥

మాల్య — శృణు! వత్సే! కార్యజ్ఞాసి! అస్తి వనౌకసాం మాత్రీ జాంబవన్నామ స మతంగాశ్రమ వాస్తవ్యో ముపసృత్య శ్రమణాం నామ సిద్ధశబరీ మభ్యర్థితవాన్ యథాస్య వాలినో వైరాగ్యేణ క్షీణాంబుద్ధాపసారితాః ప్రకృతయః కిష్కింధాయాం కుమారం సుగ్రీవ మభిషేక్ష్యమాణా స్సానువాయుక మైక్ష్వాకం రామభద్ర మపేక్షంతే॥

శూర్ప — కథంక్షత్రియపోతో వాలినిగ్రహే సహాయస్సమీహ్యతే॥ తత స్తతః॥

శూర్ప—అగు నుని జము. నేనదంతయు వివాహసమయమందుఁ గన్నులారఁ జూచియున్నదానను.

మాల్య—కాఁబట్టి పలుపురు తాలురవ్వినవొక్కఁడేమి సేయును? అట్లేకదా, మిథిలకుఁబోయి బలిమిని భార్య నపహరించునన రాముఁడు సహించునా? అతండు యత్నింప, పౌర జానపద ప్రకృతులాబాలగోపాలము నతనినే యనుసరింతురు. ఇంకఁ దనముఖ్య బాంధవులమాట చెప్పనేల? అడవింబుట్టిన యగ్గివలె దుస్సహమగుదుఃఖమునజనించిన తేజము పురుషు నతివిక్రమవంతుని జేయుననియు, నతఁడు మండలమంతకును ననుగ్రహపాత్రుఁడగుననియుఁ జెప్పియుండిరి కాదా?

శూర్ప—(దీర్ఘమగు వేడియూర్పు పుచ్చి) ఆర్యా! అట్లైన నిపుడేమి చేయనగును?

మాల్య—ఓసీ! విను. మీపురు గార్యజ్ఞవే కదా! జాంబవంతుడను వానరమంత్రి యొకఁడు గలఁడు. ఆతఁడు మతంగాశ్రమయు యోగినియు నగు శ్రమణయను నొక శబరాంగన నాశ్రయించి యామె నిట్లు మిక్కిలి ప్రార్థించెను. "ఓయోగినీ! వాలి తమ్ముని పేక్షించుటచే దరిమ్రలై యాకిష్కింధలోని ప్రజలెల్ల రాజ్యమునందతనిని దప్పించి కుమారసుగ్రీవు నభిషేకింపఁదలఁచి యందుల కల దశరథరాజు కొమరుఁడగు రామభద్రుని సహాయము నపేక్షింపుచున్నారు."

శూర్ప—(సాతంకముగా) ఏమేమి? యీరాచకుఱ్ఱఁడు వాలినిగ్రహమునకుఁ గూడ సహాయుఁడుగాఁ గోరఁబడుచున్నాఁడా? తరువాత, తరువాత,

జా—(సంతోషముతో) అట్లయిన మనకెందుఁబోటుగ నున్నట్లే. ఆ జనస్థానమునకును మన ఋష్యమూకమునకు నెంతయో దవ్వులేదు.

శ్రీ—ఆర్యా! ఇంకను వినవలసినది తాము విననేలేదు.

జా—ఇదే సానముగ నున్నాఁడను.

శ్రీ—అక్కడ 'రస మొసఁగుము నాకు' యని సంకల్పించి పతిద్రోహపాతకిని యగుశూర్పణక యను నిశాచరి కాముకియై యారామభద్రుని జేరవచ్చిన లక్ష్మణుఁడు మిగులఁ గోపించి యామెను ముక్కుచెవులుఁ బెదవియుఁ గోసి విరూపిణిం

జా—(సాతంకముగ) ఆర్యా! యెంత యనర్థమూలము సంభవించెను! అప్పుడట్లు రావణు చెల్లెలికిఁ గల్గిన యీ యపకృతిని జూచిన ఖరాదిదానవుల వలన నేమి జరిగినది?

శ్రీ—(నవ్వి) రామభద్రునిచే [illegible] నేమియగునో యదియే.

జాం—(సంతసముతో నవ్వుచు) అట్లయిన వారును వాలి సాహాయ్యమునకుఁ [illegible] విరాధుఁడు పట్టిన దారినే పట్టిరా?

శ్రీ—కాకేమి?

జా—అట్లయిన సీతారామరావణులకు వైరము మఱింత గాఁ బెఱిగిన దనుటకు సందియము లేదు.

శ్రీ—(నవ్వుచు) ఆర్యా! యా శూర్పణఖ తనయన్నగారికి ఖరదూషణాదుల యభిభవమును దెల్పునెడమాత్రమే మిగులశ్రమపడును గాని మోమును జూచినంతనే బోధపడు తనపరిభవమును దెల్పుటకంత శ్రమఁ జెందదనుకొందును.

శ్లో. ఐక్ష్వాకేణ పురాపి కౌశికమఖా దారభ్య లంకేశ్వరో
ధత్తే శాశ్వతికం విరోధమధునా త్వేతే హతా బాంధవాః
ఉత్సాహప్రభుమన్త్రశక్తిభి రలం భూమ్నా శ్చలజ్జో బలీ
దృప్తః శూర్పణఖా వికారమపరం దృష్ట్వా కథం మృష్యతే॥ 5.

శ్నై శ్నై రనయో ర్విరోధసంధుక్షణేన తుల్యవ్యసనస్థో దాశరథి
రసహాయః స్యాన్నర్యస్యానునా సాంధాతునిగామశక్య స్యాత్.

శ్ర—ఆర్య ? కిమిదానీ మనుష్ఠేయం మమ శిష్యపుత్రో నిషాదచక్ర
వర్తీ గుహో లక్ష్మణమిత్రం అ సోపానేన సుఖాధి
రోహో రఘుపతి రస్మాకం.

జా—(సహర్షస్మితం) శ్రమణే! సత్యేమసి సుగ్రీవపక్షపాతినీ; తద్గచ్ఛ
సత్వరముపస్థాపయ నిషాదరాజమ్.

(ఇతి శ్రమణా నిష్క్రాంతా.)

జా—సీ. అలకౌశికాధ్వరం బాదిగా నెద దశ
వదనుండు తీఱని పగ వహించి
యుండ నంతటఁ బోక నెండియుఁ దద్బాంధ
వులను గొందఱఁ జంపి చులము పెంచె
నద్దానివలననే యత్యంతమును నుండి
పడుచుండ నీరీతిఁ బరిభవించె
సోదరియైన యాశూర్పణఖనటన్న
వ్రీడాకరంబగు వెగటువార్త
తే. గీ. నురుబలుండును బ్రబలగర్వోద్ధతుండుఁ
గపటనటనల నెంతయుఁగలిగి మెలఁగు
జాణ మంత్రప్రభూత్సాహశక్తులూని
జానలరు నాతఁడాలించి సైచునెట్లు? 5.

మెల్లమెల్ల వీరిరువురకుం బగపెఱిగినకొలఁది ససహాయుఁడగు నీరామభద్రుఁడు తనకుఁబలె వ్యసనపడుచుండిన, యాసూర్యసుతుఁడగు సుగ్రీవునితోఁ జెలిమిచేసికొనుట సులభమయియుండును.

శ్ర—ఆర్యా! ఇప్పుడీరెఁ జేయఁదగిన దెద్దియునిన నా శిష్యునిపుత్రుఁడును నిషాదచక్రవర్తియునగు గుహుఁడనునతఁడు లక్ష్మణునకుఁ జెలికాఁడు. కావున నీమెట్టునే మనకు రామభద్రసాధము సుఖముగ నెక్కనగును.

జా—(సంతసముతోఁ గూడిన చిరునగవుతో) శ్రమణా! నిక్కముగ నీవు సుగ్రీవునియొడభిమానము కలదానవే కావున వేగమేగి యాబోయదొర నటకనుపుము.

(ఇట్లు శ్రమణ వెళ్లును.)

జా—(సర్వతోనిరూప్య) అయే! పురాణప్రియ సుహృ దస్మాకం దక్షిణస్యాందిశి పరాపతన్ జటాయురివదృశ్యతే; తదేనమను పాలయామి తావద్దూరదర్శినో హి గృధ్రాః, కదాచిదేష లంకాద్వీపవృత్తాంత ముపలభేత.

(ప్రవిశ్య) జటాయుః—ప్రాప్తై వేయ మస్మాభిః పంచవటీ. య దమూ ర్గోదావరీతీర తరంగసేక సుకుమారమాంసళ పరిసరారణ్య మాలిన్యో జనస్థానసీమానః - అపిచ.

శ్లో. దృశ్యంతే మధుమత్తకోకిలవధూనిర్ధూతచూతాఙ్కుర
ప్రాగ్భారప్రసరత్పరాగసికతాదుర్గా స్తటీభూమయః
యాః కృచ్ఛ్రా దతిలంఘ్య లుబ్ధకభయా త్తైరేవ రేణూత్కరై
ర్ధారావాహిభి రస్తి లుప్తపదవీ నిశ్శంక మేణీకులం. 6.

జా—(అంతటంగలయం జూచి) ఆహా! యదె దక్షిణపుదిక్కునుంచి వచ్చుచున్న యాతఁడు మనతోంటిసంగాతియగుజటాయువుం బలెం దోఁచుచున్నాఁడు; గాన నతఁడు వచ్చువఱకు వేచి యుందును; గెద్దలు తద్దయు దూరదృష్టికలవియందురుగదా! ఇతని కాలంకాద్వీపవృత్తాంతముఁ గూడఁ దెలిసినం దెలియ వచ్చును.

జటాయువు—(ప్రవేశించి) ఇదిగో! పంచవటిని దరిసితిని. అదె గోదావరీనదీతరంగముల జలబిందుబృందముల కలయికం జల్లనై మిక్కిలిచక్కఁగఁబడియుండు ప్రాంతప్రదేశములుగల జన స్థానపుఁ బొలిమేరలు గానవచ్చుచున్నవి. మఱియు—

సీ. మధుసేవనెంతయు మత్తిల్లి కోయిల
మూఁక రాల్పఁగ నెడలేక కురియు
మావిపూబెడఁగుంచుమారంపు టిపుశ ది
బ్బల నెంతయును గట్టపడి తరించి
యారేణుధారలె యడుగుజాడలఁ గప్ప
వెంబడించెడి బోయవేఁటకాండ్ర
వలని ప్రాణభయంబు వాసినవై లేళ్ల
కడువేడ్క గదురఁబొదలఁ

తే. గీ. బొదల పిల్లార్చుచెదిర! యీసదములంబు
లగు నదీతీరభూము లత్యంతరమ్య
నవ్యశోభను గనువిందొనర్చుచుండెఁ
బ్రకృతిపై చిత్రకిదెయొకో పాదనంగ!. 6.

జా—(కించిదుపసృత్య) కుతః పునరియతా వేగేన వయస్యో జటాయుః

జటా—(దృష్ట్వా) కథం జాంబవాన్-సఖే! క్షమస్వ నసభాజయిష్యామి తావద్భవంతం మయాహి మలయాచలకులాయాదార్యసంపాతిపాదానభివాద్య నివర్తమానేనమారీచసహాచరస్సంచర న్నిమా మరణ్యానీ మభిలక్షితో రాక్షసరాజః తతో విషమమాశంకమానం మాం వత్సరామభద్రస్నేహ స్త్వరయతి.

జా- -(స్వ) వయమ ప్యేతదేవ ప్రతిపత్స్యామహే. ((ప్ర) సఖే, త్వరస్వ.

(ఇతి నిష్క్రాంతః.)

జటా—(పరిక్రమ్యావలోక్యచ) ఇయమగ్రే పంచవటీ-(సవితర్కమ్)

శ్లో. సీతో దూరం కనకహరిణచ్ఛద్మనా రామభద్రః
పశ్చా దేనం ద్రుతమనుసర త్యేషవత్సః కనిష్ఠః
భిత్త్వా ద్విభిత్త్వా ప్రవిశతి తతః పర్ణశాలాంచ భిక్షు
ర్ధిగ్ధిక్కష్టం ప్రథయతి నిజా మాకృతిం రావణోయం. 7.

అహహ! శ్లో. ఆర్యపుత్రార్యపుత్రేతి
క్రందంతీం కురరీమివ
రథ మారోప్య వైదేహీ
మేష పాపః క్వ గచ్ఛతి. 8.

జా—(కొంచెముసమీపించి) ఎంకానుండి మిత్రుఁడగు జటాయు వింతవేగముగా వచ్చుచున్నాఁడు ?

జటా—(చూచి) ఏమీ! జాంబవంతుఁడా! అనుఁగా ! నిన్ను సంభా షించుటకు నాకిపుడు సమయములేదు. నే నామలయపర్వత గుహాలయందున్న యార్యుఁడగు మాయన్న సంపాతిని సేవించి వచ్చుచుండ మారీచుఁడు సహాయుఁడుగా నా రాక్షస రాజగు రావణుఁ డీవనసమీపమునందు సంచరింపుచుండఁ జూచి యదిచాలవిషమునకుఁ గారణమగునని శంకించి యా రామ భద్రునివిూఁది స్నేహాతిశయమున నిట్లువేగముగా నేగు దెంచితిని.

జా—(తనలో) మేమును దీనికే సంచరించుచున్నాము-(ప్రకాశముగా) మిత్రమా! అట్లయిన వేగముగా నేగుము. (వెళ్లుచున్నాఁడు.)

జటా—(తిరిగిచూచి) ఇదిగో! పంచవటి, యెదుటగన్పట్టుచున్నది. (వితర్కింపుచు)

ఉ. దవ్వుగ నేగెరాఘవుఁడు తద్దయుఁ దారుచుఁ బైడిలేడికో
నవ్వనుకన్ వడిన్ జనెను సౌమిత్రియుఁ గాఁడఁగ లక్ష్మణుండదే !
యెవ్వఁడో చొచ్చు భిక్షుకుఁడొకిందనుక జంకుచుఁ బర్ణశాల నోఁ
గొవ్వన రావణుండు నిజరూపముఁజూపుచునుండె నక్కటా!. 7.

ఆహాహా! ఆ. వె. అకట! యార్యపుత్ర! యార్యపుత్ర! యటంచు
వెఱచి గోరపిట్టకఱిసె నఱచు
నవనిజాత నద్దురాత్ముఁడంతు రథమునం
దుంచికొంచుఁ బోవుచుండె నెటకొ !. 8.

(సాటోపం పరిక్రామన్) రే రే రావణ! రావణ!

శ్లో. వధూటీ మిక్ష్వాకో ర్నిజకరతలస్పర్శమలినా
మిమాం కుర్వాణస్య స్ఫురతిహృది శోభైవ భవతః
కులే యేషాం జాత స్త్వమసి గణితా స్తేపి గురవో
న స ప్తబ్రహ్మాణః కథమివ పులస్త్యప్రభృతయః. 9.

(పునరాకాశే) అళీకాట్టహాసధూమధూసరితవక్త్రవల్మీక! రే రే రాక్షసాపశద! కిమాత్థ కిమాత్థ?

శ్లో. "జగద్విలోభి సీతాఖ్య
మామిషం హరతో మమ
అయం కిల జరద్గృధ్రః
కరాదాచ్ఛిద్య నేష్యతి". 10.

ఆః పాప కథమేవ మభిదధాసి తిష్ఠ తిష్ఠ.

శ్లో. భుజవిటపమదేన వ్యర్థమన్ధంభవిష్ణు
ర్ధిగపసరసి చోరం కారమాక్రుశ్య మానః
త్వమరసి విదధాతు స్వా మవస్కారకేళీం
కుటిలకరజకోటిక్రూర[illegible] జటాయుః. 11.

(ఇతి నిష్క్రాన్తః)

(శుద్ధవిష్కమ్భః)

(సాటోపముగాఁ దిరుగుచు) ఓరోరి రావణా! రావణా!

ఉ. తోయజనాయకాన్వయవధూటిని గేల్గవముట్టి దూషితన్
జేయఁగ నెంచితో తులువ! సీ! మదినించుక నీకుసిగ్గులే
దో! యలయత్రిముఖ్యులఘుమారులు తొల్లిటిబ్రహ్మ లేడ్గురున్,
జేయవొ లెక్కవారలఁ, బ్రసిద్ధరఘువద్ధనవంశకర్తలన్ ? 9.

(మఱల నాకసమున) వట్టి యట్టహాసపుఁ బొఁగలెగయు మిగుల దూసరపువర్ణముం బొందిన వక్త్రనేత్రములుగల యోరావణా! రాక్షసాధమా! ఏమని ప్రేలుచుంటి వేమని ప్రేలుచుంటివి !

తే. గి. "ప్రీతి జగమెల్లఁ బ్రేమించు సీత పేరి
యామిషంబును గొనిపోవునట్టి నాదు
కరమునుండి యీరామునుసద్గ్రద్ధ బలిమిఁ
దన్ని కొనిపోవు నీకఁగావఁ దరమె నాకు." 10.

అనియా? ఓరీ పాపాత్ముఁడా! నిలు నిలువుము.

తే. గీ. గురుభుజ బలంపుఁ గ్రొవ్వున గ్రుడ్డివగుచు
చోర! రమ్మని పిల్వఁ జీ! పాఱిపోదె!
క్రూర! కనుమిదె, తనవాడిగోళ్ల నీదు
నురము వ్రిదళింపక జటాయు వురక విడున ? 11.

(అని వెళ్లును.)

(శుద్ధవిష్కంభము)

శ్రీరస్తు.

# భట్టమురారిప్రణీతే-అనర్ఘరాఘవే

## పఞ్చమోఙ్కః.

(తతః ప్రవిశ్యతి లక్ష్మణః)

లక్ష్మణః—అహో! దుర్నివారదారుణక్రోధశోకలజ్జాగహనోయం దశావివర్తః యస్మిన్నితికర్తవ్యతా విధానమస్మాక మనాపాయికం-తథాహి.

శ్లో. తత్తాదృగ్దశకంఠవంచనరుషా ధూమాయమానో గిరం నార్ఘ్రో ప్రతిలీనవర్ణవిధురా మార్యః సమాప్నోతి మే చాపే తాతజటాయుజీవితకథాపర్యంత ధూమాయిత క్రోధోత్పీడనిపీతశోకజడిమా దృష్టిస్తు విశ్రామ్యతి. 17.

(నేపథ్యాభిముఖం) ఇత ఇతః. ఆర్య! మారీచమథన దృశ్యంతామమూరవాచీం కకుభ మభివర్తమానా వింధ్య వనవీథయః.

రామః—(ప్రవిశ్య) (ఆకాశలక్ష్యం బధ్వా)

శ్లో. కులే వా శౌర్యే వా భుజసముదయే వా తపసి వా బభూవుర్నః ప్రాంచస్త్వమివ భవితారో నచరమే అహో ధిఙ్మాహాస్తే కథమతిచిరా దేవ నఖలు ప్రవీరాణాం పన్థా దశవదన! మేనాసి చలితః. 18.

# అనర్ఘరాఘవము.

## పంచమాంకము.



(తరువాత లక్ష్మణుఁడు ప్రవేశించును.)

లక్ష్మ—అన్నా! మఱలింపఁదరముకానిదై మిగుల వెఱపునుగొల్పు శోకినుగసిగ్గులచే నల్లుకొని కాఱుటడవింబోలినయతిభీషణము మాకు నెట్టికట్టడిదశ సంభవించినది! అకటా! దీనికిదిచేయఁ [illegible] యుపాయమాత్రమయినను బోధకట్టకున్న దేమిసేయుదును! అట్లేకదా!

తే. గీ. దశవదనవంచనపాగ్ని దవిలి రవులు
నన్నుగాఁ రేదొ తిన్నఁగా నాసతీరు;
శ్రుతజటాయువధోద్ధతక్రోధవహ్ని
శమితజడిమమై చూపు చాపమున నిల్చు. 12.

(తెరవంకఁ జూచుచు) మారీచదమనుఁడవగు నో యార్య! ఇటు రండిటురండు. ఆహా! దక్షిణపువైపున నలరుచున్న యీవింధ్యపర్వతప్రాంతములు ఎంతమనోహరములుగ నున్నవో చూచితిరా?

రాముఁడు—(ప్రవేశించి యాకసమువంకఁ జూచి)

మ. [illegible]బాహుసారముల సీమన్ సాటియౌవారు మున్
గలుగన్ లేదిఁకఁ గల్గఁబోరన దశాస్యా! యట్టినీకెట్లు లీ
పలుగుం బుద్ధిజనించె నిప్పు డకటా! భవ్యాత్ముఁతో పీరవ
ర్యులకుం ద్రోహ్యఁగనో పథంబె! యిది; యూర్యుల్ మెత్తురే
యిప్పుడిన్! 13.

(విమృశ్య సఖేదస్మితం) అహో! పౌలస్త్య!

శ్లో. సిద్ధశ్రోత్రపరంపరాపరిగతై రేభిః ప్రపౌత్రస్య తే
వృత్తై రద్య పులస్త్యవర్గమభితః స్మేరేషు దేవర్షిషు
విష్వగ్వ్యాప్తి రసాంగతా నమయితుం దుర్వారలజ్జాభర
మ్లానశ్రీస్తు చతుర్ముఖీ భగవతో ధాతుః కథం వర్తతే. 14.
(క్షణ మనుధ్యాయన్) హా ప్రియే విదేహరాజపుత్రి !

(ఇతి సంవరణం నాటయతి.)

లక్ష్మ—(ఉపసృత్య) ఆర్య! కోయమభిషంగో నామ భవాదృశాన
ప్యాస్పదీకరోతి.

శ్లో. పతతి వ్యసనే దైవా
ద్దారుణే ద్దారణాత్మని
సంవర్మయతి వజ్రేణ
ధైర్యేణ మహాతాం మనః. 15.

రామః—(దీర్ఘం నిశ్వస్య) వత్స !

శ్లో. సహజధైర్యవశంవదవృత్తయో
హృది రుషశ్చ శుచశ్చ నియంత్రితాః.
ఇహ తు కిం కరవై యదపత్రపా
కిమపి మా మవజిత్య విజృంభతే. 16.

లక్ష్మ—(పురోవలోక్య) ఆర్య! అయమత్ర తాతజటాయుషో
వీరలోకసాధనసిద్ధిక్షేత్ర మరణ్యసన్నివేశః పశ్య! పశ్య!

(విమర్శించి ఖేదముతోఁ గూడిన చిరునగవుతో) అకటా!

యోఁపౌలస్త్యుఁడా!

మ. ఈమార్గంబునకా పులస్త్యుఁడొకరుండె తక్క జేజేముని
స్తోమమ్మెల్లను మెల్లమెల్లనగుచున్ దుష్కార్యముం జేసెఁజూ
నీమున్నన్నుఁడన న్జతుర్ముఖుఁడు పెన్నిగ్గున్దొలంగించుకోఁ 14.
దా మోము న్వసఁద్రిప్పుచో విఫలుఁడౌఁ దద్ద్వీడయుం దోఁడుగాన్

(కొంచెము ధ్యానించి) హా! ప్రియా! విదేహరాజతనయా!

(ఇట్లు సంవరణమునునటించును.)

లక్ష్మ—(సవిషాదంబుగ) ఆర్యా! ఏమి యివ్విషాదము మిమ్మువంటి వారిని గూడ లోఁబఱచుకొనుచున్నది!

తే. గీ. దారుణంబుగఁ గట్టడి దైవశత
పైపఁగారాని పెనువగ సంభవింప
మానితంబు మహాత్ముల మానసంబు
ధైర్యమును వజ్రకవచంబుఁ దాల్చుగాదె!. 15.

రాము—(దీర్ఘనిశ్వాసముతో) వత్సా!

తే. గీ. కినుకవగపులు నిజధైర్యమునను మనసు
నం దడంప సుసాధ్యంబు లగునుగాక
యకట! యిదియిట్టులని తెల్పనలవిగాక
యేదొ పెనుసిగ్గు నన్నేచు నేది తెలియ!. 16.

లక్ష్మ—(ఎదుటఁజూచి) ఆర్యా! ఇదిగో! మన యెదుటఁ బూజ్యుఁడగు జటాయుని స్వర్గగమన స్థానమగు నటవీసన్నివేశములు చూడుఁడు చూడుఁడు.

శ్లో. భగ్నో౽యం కథ మత్ర రావణరథస్తాతేన వజ్రాఙ్కుర
క్రూరాపస్కిరమాణభంగురనఖత్రోటిత్రుణస్పంధనః
రామః—(సకరుణాస్రం)
హా సీరధ్వజరాజపుత్రి! నతదాధృష్ట స్త్వయాధన్యయా
పక్షీంద్రో దశకంఠకుంజరశిర స్సంచారిపంచాననః. 17.
(ఇతి లక్ష్మణమనష్టభ్య ధ్యానం నాటయతి.)
లక్ష్మ—(స్వ) అహో మహాదోషఃఖల్వయం అతిప్రసజ్యమానో
మానసశోకాఖ్యోవికారః తదన్యతఃప్రసారయామి.
(ప్ర) ఆర్య! పశ్య పశ్య.

శ్లో. వింధ్యగిరరాజకన్యాం-
తః పురమేతా స్తరంగమాలిన్యః
వేతస్వతీభి రద్భి
స్తార్యత్రికగుణనికాం దధతే. 18.
రామః—(ఉన్మీల్యచక్షుషీ దీర్ఘముష్ణంచ నిశ్వస్య) వత్స!
దర్శనీయ మేతత్.
శ్లో. కుముదవననిశాయ జాగ్రదంభో!
రుహాకృతయామికవిభ్రమా రమంతే
మదకలకరికర్ణతాళనృత్య
న్ముఖర మయూర మనోరమా స్తటిన్యః. 19.
(ఇతిపరిక్రామతః)

ఉ. తాతజటాయు, పత్త్రనిభదారుణనక్రకనఖాళి, బంధసం
జాతముఁ ద్రెంప రావణుని స్యందనమిక్కడ నుక్కడైపడెన్

రాము—(కరుణతోఁ గన్నీరు నించుచు)

సీతరో! రావణాఖ్యమదసింధురశీర్ష విహారిఁ గేసరిన్
బూతచరిత్రుఁ బక్షివరుఁ బుణ్యవశంబునఁ గంటివ త్తఱిన్. 17.

(ఇట్లులక్ష్మణునానుకొని ధ్యానమునునటించును.)

లక్ష్మ—(తనలో) అన్నా! ఇదినాంతయు నెక్కుడు దోషముగదా! కడుంగడు వెలుగుచున్న నీమనశ్శోకవికారము నెట్టులయిన మఱల్పవలయును. (ప్రకాశముగా) ఆర్యా! చూడుఁడు చూడుఁడు.

తే. గీ. అద్దిరే! వింధ్యనగరాజు నంతిపురపుఁ
బేర్మిసుత లీ తరంగిణుల్ వేతసముల
నెసఁగు నీళుల నొప్పుచు నృత్తగీత
వాద్యములు సాధకము చేయుపగిది నలరు 18.

రాము—(కన్నులువిప్పిచూచుచు నిట్టూర్పుపుచ్చి) వత్సా! ఇది చూడఁదగినదే.

తే. గీ. కలువగమి వంతునిద్దురఁ గాంచ మేలు
కాంచి తమ్మి పసమ్ముల గస్తు నరప
నాము టేన్గుల కర్ణతాళాప్తిఁ గేకు
లాటపాటలు వెలయింప నలరు నదులు. 19.

(ఇట్లుపరిక్రమింతురు.)

లక్ష్మ — ఆర్య! అయ మితో గిరి ర్మాల్యవాన్.

శ్లో. ఇహ మహిషవిషాణవ్యస్తపాషాణపీఠ
స్ఖలనసులభరోహి ద్గర్భిణీభ్రూణహత్యాః
కుహరవిహరమాణప్రౌఢభల్లూకహిక్కా-
భయచకితకిరాతత్రస్తశస్త్రా వనాంతాః. 20.

రా — (చిరం దృష్ట్వా సకరుణాస్రం)

శ్లో. ప్రతిపరిసరం భూయానర్ఘః శిఖండభృతాం యథా
మిళిత మళిభి స్సంభుజ్యంతే కదంబవిభూతయః
అభినవఘనవ్యాడోరస్కః ప్రవర్షతి మాల్యవా
న్విషధరవధూ గర్భాధానప్రియంకరణీ రవః. 21.

వత్స! లక్ష్మణ! ధారయ మాం న శక్నోమి స్తంభయితుమాత్మానం!

శ్లో. ఇయ మవిరళశ్వాసా శుష్యన్మణి భిదురస్వరాం
తనురవయవై ర్భ్రాంతస్రస్తై రుపైతి విసంగతాం
స్ఫురతి జడతా బాష్పాయేతే దృశౌ శ్లథితస్మృతి
ర్జయిరసతయా శోకోద్భావ శ్చిరేణ విపచ్యతే. 22.

లక్ష్మ — అన్నయ్యగారూ! ఇదిగో! మాల్యవన్మహీధరము.

ఉ. ఇమ్మలపై సతమ్ము వసియించెడి కానుతెబోతులేపునన్ 20.
గొమ్మలఁజిమ్మజారు పసుకుల్ నసిఁబైఁబడి చూపులెల్ల గ
ర్భమ్ముల ప్రీల్చు; బలీ గుహాల భల్లములామున నార్వజంకి వి
ల్లమ్ములు జారఁబొఱు శబరాళి; యిటుల్ దగు నివ్వనాంతముల్.

రాము — (చాలసేపు చూచికరుణతోఁ గన్నీరునించుచు)

ఉ. చిత్తమువొంగ నిమ్మగమిచెల్వుగ సల్లెడఁ గేరి యాడెడున్ 21.
మత్తమిళిందముల్ గడిమిమ్రాఁకులపైఁ బుర్రుఁదేనెలానెడున్
క్రొత్తమొయిళ్లకల్మి నొసఁగూర్చును నీళులు మాల్యవన్నగం
బిత్తఱి పాపబిత్తులు తృప్తినయిం గొని చూలు వాలుపన్.

తమ్ముఁడా లక్ష్మణ! నన్నానుకొనుము. స్వయముగ
నిలువఁజాలకున్నాఁడను.

సీ. వినుప కెంతేనియు వేడినిట్టూర్పుల
గములు గల్గుచునుండెఁ గడురయాన
నవ్వేడిచేత నోరాటిపోవుచునుండె
దానిచే నుపులగద్దిక యొదవె
నంగంబులందెంతో యలసభావము గల్గెఁ
గీలగి జడిమప్రాప్తించుచుండెఁ
దనువెల్ల గమవెల్లఁదనము గాంచఁదొడంగెఁ
గడపనికి విస్మృతి వొడముచుండెఁ
తే. గీ. గన్నుఁగవ నింతయెడలేక కలుగుచుండె
వేడివా నశ్రుధారలు చూడఁజూడ
బహుతరంబైన యలశోకభావమెల్లఁ
గరుణరసముగఁ బరిణతిఁ గాంచుచుండె. 22.

(లక్ష్మణేన- ధార్యమాణో నిమీలితాక్షఏవ) హా ప్రియే దండకారణ్యవిహారసబ్రహ్మచారిణి! (ఇతిపునః సంవృణుతే.)

ల—(సఖేదమాత్మగతం) కేన పునరేష రసాంతరేణ తిరస్క్రియతే.

(నేపథ్యే) ఆః పాప! కబంధహతక! అయం స భవసి.

రా- .(ఆకర్ణ్య ససంభ్రమం.) వత్స! [illegible] దనుకబంధే [illegible] కలహాయమానో వయసః సే [illegible] ఇవ శ్రూయతే [illegible] చ్ఛలాని రక్షాంసి తత్ [illegible] ముభ్యుపపద్యస్వ.

ల—తథా (ఇతి నిష్క్రాంతః.)

రా—(పార్శ్వతోవలోక్య స [illegible]) దేవి! వామశీలే. [illegible] రాజనందిని! ఇయం తే [illegible] భవిమర్దవేదినీ నిచు [illegible] రేఖా ఇహాహి.

శ్లో. స్వవపుషి నఖలక్ష్మ స్వేన [illegible] త్వా
కృతమితి చతురాణాం దస్వ [illegible] సఖీనామ్
ఇతి [illegible] హాసి మయా తే భీ [illegible] మి
స్మరపరిమళముద్రాభాగ [illegible]. 23.

(ఇతి ధనురవష్టభ్య లక్ష్మ [illegible] చేతా స్థిత ఏవ [illegible])

(తతః ప్రవి [illegible])

(ఇట్లు లక్ష్మణునిచేత హింపఁబడి కన్నులుమూసికొనియె) హా! ప్రియురాలా! దండకారణ్యవిహారణసబ్రహ్మచారిణీ! (ఇట్లు మఱల మూర్ఛిల్లును.) అన్నా!

ల—(ఖేదముతోఁ దనలో) అన్నా! యేయితరరసములనే నిపుడీ రసవిశేషమును మఱలింతును!

(తెరలో) ఓరీ! పాపాత్ముఁడా దుష్టా! కబంధహాతక! ఇదిగో నీకుఁ గాలము మూడినది.

రా—(విని తొట్రుపాటుతో) వత్స! లక్ష్మణా! దురాత్ముఁడయిన దనుకబంధునితోఁ గలహింపుచున్న నీమిత్రుఁడగు గుహునిఁ బలెఁ దోఁచుచున్నాఁడు. రక్కసులు పెక్కుమాయలుగల టక్కఱులు. వేగముగా వెళ్లి నీవతనికిఁదోడ్పడుము.

ల—ఆర్యా! ఇదె వెళ్లుచున్నాఁడను. (వెళ్ళును.)

రా—(ప్రక్కగాఁ జూచి కనికరముతో) దేవీ! వామస్వభావ సంచారిణీ! జనకరాజపుత్రి! ఇదియేకదా నీస్నేహసర్వస్వము నెఱిఁగిన ప్రబ్బలివల్లరుల నల్లుకొనిన పొదరిండ్లచాలు.

ఉ. నేనిఁకఖాలఁజేరికొని నీయనుఁగుంజెలులెల్లరున్న గన్
జానకి చీరెవందుననఁ జాలభయంబున నడ్డొకింత లే
కేనొనరించు నల్లుడికినెల్ల సహించి సుఖాబొసంగెడీ
వీనిచుళంపుటీరములనే కద! యెట్లని విస్మరింపుదున్! 23.

(ఇట్లు వింటినానుకొని లక్ష్మణునివార్తవినుటయందలి కుతూహలముతో నట్టెనిలుచును.)

(తరువాత లక్ష్మణుఁడును గుహుఁడును బ్రవేశింతురు.)

గు—జయతు జయతు దేవః.

శ్లో. వినేతా దృప్తానామయ మభయదుర్గం దివిషదాం
కనిష్ఠః కాకుత్‍స్థో జయతి జగదాశ్చర్యచరితః
యదస్త్రైః పాప్మానం రజనిచరజన్మగ్రహాస్పదం
విజిత్య స్వర్లోకా నవికల ముపాతిష్ఠతదనుః. 24.

రా—సాధుకృతం శివాస్సన్తు తస్యదేవయానాః పన్థానః వత్స!
గుహా! వియతివ ర్తమానః కశ్చిదచల ఇవలక్షితః కిమసౌ
తేనైవ యోజనబాహునా ప్రహరణీకృతః.

గు—దేవ!

శ్లో. దుందుభిం నామ దైత్యేన్ద్రం
నిష్పిపేష హరీశ్వరః
తస్య కంకాళకూటోఽయం
కుమారేణ విలోళితః. 25.

తన్నిమిత్తజన్మా సంప్రతివాలినో మహానభియోగః సంభావ్యతే.

ల—తతః కిం?

రామ—వత్స! మామైవం; మాననీయః ఖల్వయం పురాణవీరో
మహేంద్రసూనుః?

(గుహంప్రతి) కుతఃపునరాగచ్ఛతో వత్సస్య యోజనబాహు
రంతరాయ స్సంవృత్తః.

గు—దేవ! వ్యోమయానేన సత్వరమతిక్రామతి రావణే సీతాదేవ్యాః

రా—(సాశంకం స్వ) తతః కింస్యాత్?

గుహు—దేవరకు జయమగుఁగాక జయమగుఁగాక!

ఉ. శాపవశంబుఁ బెంపున నిశాచరుఁడైన కబంధునిట్టి ని
ష్పాపునిఁజేసి యెంతయుఁగృపామతి వెండియు స్వర్గసంస్థితిం
జూడఁగనోపుతూపులను సొంపలరారుమహానుభావుఁడై
దీపిలు పిన్నదాశరథి ధీనిధి లక్ష్మణుఁ డొప్పెడు న్గడున్. 24.

రా—బాగుబాగు మంచిపనిజరిగినది. వానికుత్తరలోకసుఖము
లొదవుఁగాక. వత్సా! గుహా! యాకసమున నేదో పెద్ద
కొండఁబలెఁ గన్పట్టుచున్నది. అదియా యోజనబాహుఁడు
ప్రహరణముగాఁ బ్రయోగించినదియా యేమి ?

గుహుఁ—దేవా !

ఆ. వె. వాలిపీడఁచే గబంధుఁడ న్దైత్యుండు
సామువచ్చి వేగ భూమిఁబడియు
హానిమానకున్న నతనిమై సౌమిత్రి
మీఁటువింటికొనను మింటికెగయ. 25.

అదియ మూలముగా నవ్వాలిమిగుల యుద్ధాభిలాషకలిగియున్నాఁడు.

ల—అయిన నేమి ?

రా—వత్సా! అట్లనకుము. పురాణవీరుఁడును బురందరనందనుండును
నగు నివ్వాలి మానసీయుఁడేకదా ?
(గుహునితో) నీవెక్కడనుండివచ్చుచుండ నీయోజనబాహుని
వలననభ్యంతరము కల్గినది ?

గు—రావణుఁడు విమానమెక్కి వేగముగాఁబోవుచుండసీతాదేవిగారి-

రా—(శంకించుచు తనలో) పిమ్మట నేమగునోకదా !

గు—యము త్తరీయం పత దుత్ప్లుత్య హనుమా న్నగ్రహీత్. తదేత ద్దేవ గుణానురాగిణా కుమారసుగ్రీవేణ సభాజయితు ముపస్థితవతో మమ హస్తే దేవస్య ప్రాహిణీకృత (మితిరామస్యార్పయతి)

రా—(గృహీత్వా హృదయేనిధాయ సాస్రం) హా! దేవి! విదేహ నందిని! కథము త్తరీయ శేషా దృశ్యసే ! (ఇతి నిమీలితాక్షో లక్ష్మణమవలంబతే.)

ల—(నిశ్వస్య) సఖే నిషాదరాజ! అపికుశలం సుగ్రీవస్య

గు—అద్య త్వయి వార్తా మనుయుంజానే.

శ్లో. జానన్నేవ దశాననోపహరతే నః ప్రేయసీ మస్తు వా
చంద్రాపీడ ముపాసితుం సహిశిరోదామస్వయం కృత్తవాన్
దండో న్యో దశకంధరస్య న పునఃకంఠాటవీకర్తనా 26.
ద్ధిగ్బాహైర్మమ చంద్రహాసహతకక్షుణ్ణోయ మధ్యాహృతః.

ల—ఆర్య! కథమస్మాసు వనౌకసోపి సౌజన్యమనుష్ఠతే.

రా—కిముచ్యతే సుగ్రీవ స్సనాభిరస్మాకం. అస్యహి ప్రభవో భగవా నైక్ష్వాకస్య రాజర్షివంశస్య ప్రసవితా సహస్రదీధితిః (హృద యస్థము త్తరీయం చ దృష్ట్వా) వత్స! గుహ! స్పృహయామి సుగ్రీవహనుమతో ర్దర్శనాయ తదృశ్యమూకగామినం మార్గ మాదర్శయ.

గు—ఉత్తరీయపటఖండము పైనుండిపడుచుండ హనుమంతుఁడెగిరి యందుకొన్నాఁడు; అదిభవద్గుణగణానురాగియగు కుమార సుగ్రీవుఁడు తన్ను సేవింపుచుఁ జెంతనున్న నాచే దేవరవారి కుపాయనముగాఁ బంపినాఁడు. (ఇచ్చును)

రా—(అందికొని యురమునవిడుకొని కన్నీరునించుచు) హా! దేవీ! జనకనందినీ! నీవిట్లుత్తరీయమాత్రశేషవై కన్పట్టుచుంటివా? (కన్నులుమూసికొనియే లక్ష్మణునానుకొనినిలుచును.)

ల—(నిట్టూర్పువుచ్చి) మిత్రమా! గుహా! నిషాదనాథ! సుగ్రీవుండు క్షేమముగనున్నవాఁడా?

గు—ఇప్పుడు మీగలాయనక్షేమమునరయుటచే.

రా—(తనలో)

చ. ఎఱిగియె రావణుండు హరియించెను బ్రేయసి సీత; నాఁ దలల్ దఱిగికొనం డె యాశ్వరుముదంబునకై తనుదానె యింకనున్ వెఱపెటులబ్బు వీనికెద? వింతఁగ సీతని చంద్రహాసమే ర్వఱచినబాటయే యిది శరంబులిఁకేటికి రిత్తఁ దాల్పఁగాన్. 26.

ల—అయ్యా! అన్నయ్యగారూ! మనయెడల నివ్వానరములుగూడ మంచితనమునువహించి కన్పట్టుచున్న వెట్లు?

రా—చెప్పెడిదేమి? సుగ్రీవుఁడు మనకు స్వజనములోనివాఁడే కాఁదా? ఇతఁడికిని నిక్ష్వాకునిసంబంధముగు రాజర్షివంశమున కును బూజ్యుఁడగు వేవెలుంగె మూలపురుషుఁడు కదా! (హృదయమందలి యుత్తరీయమును జూచి) వత్స! గుహా! నాకాసుగ్రీవహనుమంతులను జూడవేడుక యొడముచున్నది. కావున ఋష్యమూకమునకుఁబోవు మార్గమును జూపుము.

గు—(సహర్షం) (స్వ) కథమచిరాదేవ ఫలవతీ జాంబవతో మంత్ర శక్తిః (ప్ర) ఇత ఇతో మతంగాశ్రమవర్త్మనా దేవ! (ఇతి సర్వే పరిక్రామంతి.)

గు—దేవ! పశ్య. పశ్య.

శ్లో. విదధతి ముదమక్ష్ణో ర్మ్లానతనా నూపనీప
ప్రహసనసహచర్యా నిత్యనృత్య న్మయూరాః
ఫలపులకిత జంబూకుంజకూజత్కపోత
ప్రియశబరపురంధ్రీబంధవో వింధ్యరేఖాః. 27.

రా—(సర్వతో నిరూప్య సఖేదం)

శ్లో. సమంతాదున్మీల ద్బహుశలహరీ లంఘనకలా
లఘుప్రేంఖ త్పంపానిలవిదళదేలాసురభయః
అవిద్యా వైదేహీ శశలిపికరీభి ర్భ్రమ ధియా
మమీ హస్తాలంబా విపినవినివేశా విదధతే. 28.

ల—ఆర్య! ఇతస్తావత్.

శ్లో. భయభ్రష్టప్రేయో విరహనిరహంకారహారిణీ 29.
ముఖాలోకోన్మీల ద్గురుకరుణరుగ్ణాం సహచరీమ్
విలోక్య మ్లేచ్ఛీ మలమలమితి ప్రాక్ప్రణిహితా
శ్శరవ్యా ల్లుబ్ధానాం హృదయమపరాద్ధం న తు శరాః.

రా—(సాస్రం) హా! దేవి!

శ్లో. మారీచమృగయూన్యగ్రే
మయి ప్రాప్తే చ రావణే

గు—(సంతోషముతోఁ దనలో) ఏమీ! యాజాంబవంతుని యోజన వేగముగనే ఫలించినది. (ప్రకాశముగా) దేవ! ఇదిగో! యిమ్మతంగాశ్రమపుఁ దెరువున నరుగవచ్చును రండు!.
(ఇట్లందఱు వెళ్ళుచున్నారు.)

గు—దేవా! చూడుఁడు. చూడుఁడు.

ఉ. పచ్చికపట్లనుంట నెడఁబాయక పూయు కదంబశాఖులన్ 27.
నిచ్చలు నృత్యముల్ సలుపు నెమ్మికులమ్ముల యింపుసొంపులన్
హెచ్చుఁగఁ బండు నేరెడుకుటీరములందుఁ బుళిందసుందరుల్
మెచ్చు కపోతహ్రుంకృతుల మీరుచు వింధ్యవనమ్ములిమ్ముకున్.

రా—(అంతటను నిరూపించి ఖేదముతో)

ఉ. ఎల్లెడ మెల్లఁగానలని యింపగు పాంపతరంగసంగమున్
సల్లలితైలకీకుసుమసంగతియుం గని కమ్మతెమ్మెరల్
చెల్లఁగ నీవ నీవనులు సాయము సేయఁ దొడంగె నౌర! నా
యుల్లము పల్లవించి యమృతోద్భవజలన్ శతధాస్రుంజింపుచోన్. 28.

ల—ఆర్య! ఇటువైపు చూడుఁడు.

చ. కడుభయమంది లేఁడి తనుగ్రక్కున వీడి తొలంగ దీనమై
యడలెడు పెంటిమోముఁగని యక్కటికమ్మున, నమ్మ దీనిపై
విడువకు వీడకంచుఁ దనప్రేయసి వేడఁగ బోయమానసం
బుడిగెడుగాని మున్ జనినముల్కులు వీడవు లక్ష్యమక్కటా!. 29

రా—(కన్నీరునించుచు) దేవి! జానకీ!

కం. మారీచు వెంబడిని నే
దూరము రుగ రావణుండు దోఁపఁగనీ న్ను

ఆసా మివ కురంగీణాం
తవో త్పస్యామి చక్షుషీ. 30.

ల—(స్వ) కః పునరుపాయో యేన వినోద్యేతహృదయ మార్యస్య?

(నేపథ్యే) భో! భో! వనౌకసః కథయంతు భవంతః కేనా స్మత్కీర్తికామినీ చంక్రమణ కేళీపర్వతో వివర్తితో దనుజ రాజకంకాళకూటః.

గు—(దృష్ట్వా సభయసంభ్రమం) దేవ! పశ్య పశ్య. కనకమయ సహస్రపత్రవైకక్ష్యప్రభామండలేన దుందుభికంకాళవ్యతికర జన్మనా రోషరాగేణచ స్వభావేన త్రిగుణపిశంగింతను మాదధానః ప్లవగరాజోయమితఏవాభివర్తతే.

శ్లో. పౌలస్త్యావయవౌఘసంకటభుజా మూలక్షణోన్మూలిత
ద్వైరాజ్యామమరావతీ కృతవతే వీరాయ యస్మై మహః
నిత్యాలోకనకౌతుకవ్యసనినీ శ్చంకే సహస్రం దృశః
పిండీకృత్య దళచ్ఛలేన కనకాంభోజస్రజం దత్తవాన్. 31.

క్షణం చ దేవస్య మహావీరసంవాదగోష్ఠీయ మృశ్యమూక యాత్రా మంతరయిష్యతి. తదహానుగ్రతోగత్వా దిష్ట్యా వర్థయామి సూర్యతనయం

రా—ఏవమస్తు.

జ్జీ రేజము లీలేల్ల యొ
య్యారముఁ బురుడించియుండునంచుఁ దలఁతున్. 30.

ల—(తనలో) ఏమియుపాయమున నేనిపుడన్నగారి హృదయమును వినోదింపఁ జేయుదును ?

(తెరలో) ఓయోయి వనౌకసులారా! మాయశఃకామినికిఁ గేళీవిలాసనగమగు నీదనుశరీరమును నెవ్వఁ డిట్లుకదల్చెనో చెప్పుఁడు చెప్పుఁడు.

గు—(చూచి భయమునఁదొట్రుపడుచు) దేవ! చూడుఁడు. చూడుఁడు. సహస్రసహస్రపరిమితంబై యెంతయుంబొంగారు బంగారు తెలిదామరపూలమాలికవలని కాంతివిశేషము చేతను దుందుభికళేబరవిక్షేపమువలనఁ గలిగిన రోషరాగము చేతను స్వభావముచేతను ద్విగుణితపిశంగవర్ణముగల యంగ మున నెసంగుచు నాప్లవంగరాజపుంగవుఁ డిట్లు వచ్చుచు నున్నవాఁడు.

శా. లంకేశుం దనచంకనొక్కి త్రుటికాలంబైన ద్వైప్రాభవం
బింకం జేసిన పుత్రు వాలి సనయుం బెంతేఁ దమిజూడఁగా
సంకల్పించెపో వేశనుల్ దశమిషన్ సంధించి బంగారపుం
బంకేజంబుల దామ దామెడనిడెన్ బాకారి యుంచెంచెదన్. 31.

క్షణమాత్రము దేవగకీపిరసంవాదగోష్ఠివినోదము బుష్య మూకగమనమునకు జాలమును గలిగించును గాన నింత లోపల నేను ముందుగనేగి యా రవినందను నానంద పెట్టుదును.

రా—సరియే. అట్లుచేయుము.

గు— వాచికం పునరేతావత్కుమారస్సుగ్రీవస్య య ‘న్మిత్రపర్యాయాంతరితం దేవస్య దాస్యమిచ్ఛా ’ మీతి.

రా- -(అపవార్య) వత్స! లక్ష్మణ! ఏవమాహ వయస్యస్తే సుహః. కిం చ మంత్రోత్సాహశక్తిసంపన్నానామపి ప్రభుశక్తిమపేక్షంతే సిద్ధయః తదహం వాలినఃస్థానే సుగ్రీవమవస్థాప్య తత్కోశదండాభ్యాం సమగ్రశక్తిర్వైరపారం గంతుమిచ్ఛామి

ల—(సస్మితం) యద్యేవముపయుజ్యమాన మింద్రసూనుముపేక్ష్య సుగ్రీవేణోపయోక్ష్యమాణేన సిద్ధిరితి వక్రః ఖల్వయం పన్థాః.

రా—(సస్మితం) వత్స! సాధ్వేవం బ్రవీషి. కింతు

శ్లో. దృప్యత్పౌలస్త్యకండూవిపులభుజభరోష్మాయమాణః కపీంద్రో
నాయం నః సందధీత క్వచిదపి చ విధా నైష సాహాయ్యకామః
సోఽహం సుగ్రీవమేఽద్దమనదృఢతరం మిత్రమిచ్ఛామి పశ్చా
త్సారస్త్రైణేయపుత్రవ్యయశిథిలశుచం శక్రమారాధయామః, 32.

ల—సాధుదర్శినీ బుద్ధిరార్యస్య కిం చ విఘాతశాపేనాపి దనునా దేవభూయం గతిముపలంభితేన సందిష్టమార్యస్య యథాఽన్య నిషాదాధిపతే ర్వచసి దేవేనావధాతవ్యమితి.

రా—తద్గుహోఽపి ప్రతిదూత్యమర్హతి.

గు—దేవ! సుగ్రీవుఁడు "మిత్రశబ్దపర్యాయమున నంతరితముగా దేవరవారికి దాస్యముచేయ నభిలషించుచున్నాఁడ" నని మనవిచేయుమన్నాఁడు.

రా—(ప్రక్కగాఁ జూచి) వత్స! లక్ష్మణా! నీమిత్రుఁడు గుహుఁ డిట్లనుచున్నాఁడు. అగును, ప్రభుశక్తియుక్తములు గాక కార్యములు సిద్ధింపవుకదా! కావున వాలికిఁ బదులుగా నచ్చో సుగ్రీవుం బ్రతిష్ఠించి యాకోశదండములచే సమగ్రమగు శక్తిని గలిగి మనవైరమును భారముమట్టదీర్చుకొనఁ గోరుచున్నాఁడను.

ల—(చిరునగవుతో) ఉపయోగింపఁ దగియున్న వాలిని విడిచి సుగ్రీవునుపయోగార్థునిఁగాఁ జేసికొననెంచుట మిగులఁ జుట్టుదారిగాఁ గన్పట్టుచున్నది గాదా ?

రా—(చిరునవ్వుతో) వత్సా! అగును నీచెప్పినయది నిజమే. కాని

చ. కడు బలమొప్ప రావణునిగర్వమడంచితినంచుఁబొంగు నీ
తఁడు మనచెల్మిఁగోరఁ డదితథ్యము; వీనివధించి సూర్యజున్
గడు దృఢుఁ జేసి మిత్రునిగఁగైకొని పిమ్మటశాంతిఁగూర్తు నిం
ద్రుఁగు వరసుందరీభవసుతు న్వివికుండుఁ జెందినన్. 32.

ల—ఆగ్యుని బుద్ధి యెల్లప్పుడును దిన్నని తెన్నుననే నడుచుచుండును గదా; శాపవిముక్తినంది మరల దేవత్వమునుగాంచి వెడలు నద్దనుఁడనుగంధర్వుఁడు విరాధలీనిసాధనాధు నభిమతము ననుసరించి నడచుచుండనగునని తమతో మనవిచేయుమన్నాఁడు.

రా—సరియే; అట్లయిన దానికీగుహుఁడే దూతగానుంటకర్హుఁడు.

ల—(గుహాంప్రతి) ఏవమస్మద్గిరా సుగ్రీవోవక్తవ్యః.

శ్లో. పితాయం రేతోధా స్తవ తరణిరస్మత్కులగురు
ర్మనుర్వైవస్వా త్రేయ స్తదపి సహజం మిత్రమసి నః
అథాపి జ్ఞాతేయం సిథిలయసి కాపేయతరళః
శరా స్తస్మై వాలిక్షతజరసలోలాః ప్రతిభువః. 33.

రా—(విహస్య) వత్స! గుహ! ఏష ఖలు పౌలస్త్యగతేనామర్షేణ ధూమాయమానో యయా కయాచిద్వాచా సౌమిత్రి రభిదధాతు నామ.

ల—సతతసమిధ్యమానజానకీవిరహావైశ్వానరేణ రామచేతసా పునరగ్నిసాక్షికమేవ సుగ్రీవో మిత్రతాముపాగతః.

గు—(సహర్షం) పరమనుగృహీతో దేవేన వికర్తనతనయః-
(సపరిహాసస్మితం)

శ్లో. సుగ్రీవే యది పక్షపాతబహుళం దేవ! త్వదీయం మనః
కిం నస్తేన విదాంకరోతు భగవానంభోజినీవల్లభః
నవ్యేనాత్మజరాజ్యలాభరభసోద్భూతేన యస్తేజసా
పూర్వస్మాదధికేన దుస్సహతరో లోకేషు వర్తిష్యతే. 34.

ల—(విహస్య) కథం తపనతనయస్య రాజ్యమంగీకారితా వయం వయస్యేన.

రా—(సస్మితం) వత్స! గుహ! సతావత్ప్రకాశమేవ ప్రతిశుశ్రూషతి మే హృదయం.

ల—(గుహునితో) మేమిట్లుచెప్పితి మనిసుగ్రీవునికి బోధపఱపుము.

"మ. ఇనుఁడే నీపిత, మాకులాధ్యుఁడు మనుండీవున్వివామాత్రూడ్భవుల్
విను మీానేస్తముక్రొత్తగాదు మనకున్, విస్రంభనీయంబ య
య్యును గావేయుపుఁజాపలంబుఁ గనెదేనుండుంజుమీా! యింద్రనం
దన రక్తాసవపాన లోలశరబృందంబింను జామీానుగాన్." 33.

రా—(నవ్వి) వత్స! గుహా! ఇతండాపౌలస్త్యునిమీాఁది క్రోధా
వేశమున మండిపడుచు నెద్దియే ననిన ననవిమ్ము.

ల—ఎడ తెగక రగిలికొనుచున్న వైదేహీవిరహాగ్ని సంగతిగలిగి
యున్న యీారామునిచిత్తము మఱల నగ్నిసాక్షికముగ
నీసుగ్రీవుని మిత్రునిగా నంగీకరించుచున్నది.

గు—(సంతోషముతో) దేవ! దేవరవారిచే నీరవినందనుఁడు మిగుల
ననుగ్రహింపఁ బడినాఁడు. (సపరిహాసముగా)

ఉ. నీమది ప్రేమంజూపె నలినీహితుసూనునిపైన నాఁగ మా
కేమియు లబ్ధిలేదినునిదే; యతఁ డాత్మజనవ్య రాజ్యలా
భామితహర్షసంభరితుఁడై భువనమ్ముల నింతకన్న ను
ద్దామతరోజ్జ్వలాకృతిని దాల్చి మఱింతతపింపఁజేసెడున్. 34.

ల—(నవ్వి) ఏమీా! సుగ్రీవునకు రాజ్యప్రదానముగూడ మేమంగీ
కరించినట్లుగానే వయస్యుఁడు స్థిరపఱచుచున్నాఁడు!

రా—(చిరునవ్వుతో) వత్స! గుహా! నామనస్సు ప్రత్యుపకృతి
చేయనుండెనని ఇంకను ప్రచురింపఁదగినదికాదు.

గు—(సప్రశ్రయస్మితం) స్వామిన్నియమేవ మహతాం శైలీ.

శ్లో. సంతో॰ మనసి కృత్వైవ
ప్రవృత్తాః కృత్యవస్తుని
కస్య ప్రతిశృణోతి స్మ
కమలేభ్య శ్శ్రియం రవిః. 35.

(నేపథ్యే) భో భో స్సన్నిహితావనౌకసః కథయంతు భవంతః దుందుభికంకాళవిక్షేపభావ్యమానగంభీరావ భసిత్భరేణ కేనాస్మాకమియం చిరస్య భుజకాండకండూతిరపనేష్యతే.

గు—(స్వగతం)

శ్లో. మన్యే దర్భాయుయావిభ్యాం
నిత్యం దోర్భ్యామమర్షణః
జాంబవ త్ప్రేరణా ద్విపః
ప్రాప్తోయం ప్లవగేశ్వరః. 36.

తదహమపి వీరయాత్రాదర్శనసుఖం ముహూర్త ఌ భవామి.

వాలీ—(ప్రవిశ్య పురోవలోక్యచ) అయే! ప్రసన్నోజ్జ శృతీకావేతౌ నియతమాభ్యామేవ కంకాళోక్షేపనిమిత్తేన వ్యం

గు—(వినయముతో గొంచెమునవ్వుచు) స్వామీ! అవును. ఇట్టిదే కదా మహాత్ములవ్రుద్ధి!

తే. గీ. ఉత్తములుచేయఁగాఁ బూనుచుండు పనులు
చిత్తముననుండు, ప్రచురణచేయరెపుడు;
జలజజాలంబునకు నిచ్చుసంపదలను
సూర్యుఁడుఁ జేయు నె యెవ్వరికేని నినుఁడు.? 35.

(మరలఁ దెరలో)

దగ్గరగనున్న నేయోయి వనౌకసులారా ! దుందుభి కళేబరము నెగజిమ్మి మెచ్చఁదగిన బాహుగర్వమున నొప్పు నెవ్వఁడు మాకుఁ జిరకాలమునుండి మిక్కిలిగఁ గలిగియుండిన బాహువులతీటను దీర్చుకొనుటకుఁ దగిన వాఁడై యుండెనో చెప్పుఁడు.

గు—(తనలో)

తే. గీ. గరువమునియెడు ప్రబలరోగంబు వలన
రోమసంతారితాత్మస్వరూపుఁ డగుచు
భల్లుకేశుని ప్రోత్సాహవశత, వాన
రాధిపతి యుద్ధతిని వచ్చెననుచుఁ దలఁతు. 36.

కావున నేనీవీరయాత్రావలోకనసౌఖ్యము నొకముహూర్తకాల మనుభవింతును.

వాలి—(ప్రవేశించి, యెదుటఁ జూచి, తనలో) ఆహా! నిర్మలములై విలసిల్లుచున్న యాకారములతోనొప్పుచున్న వీరలిర్వురు నెవ్వరొకో! నిశ్చయముగా నాదానవనాథుని కళేబరము

(స్మృతిమభినీయ సవితర్కం) ఆః సందిష్టమస్మాసు ప్రియసుహృదాలంకేశ్వరేణ యథా.

శ్లో. ప్రక్లృప్తకాంతారకుమారభుక్తి
ర్ధార్భ్యాగినేయో జనకేనముక్తః
మనుష్యసామంతసుతో నిషంగీ
సహానుజ స్తిష్ఠతి దండకాయాం. 37.

తౌ చాస్మాకం తత్ర విహారిషు నిశాచరేషు పాటచ్చరీవృత్తిమధితిష్ఠమానౌ భవద్భిః ప్రతికర్తవ్యావితి. తతః కిమయమయం చ తౌ స్యాతాం.

రా—వత్స! లక్ష్మణ! శ్రుణు కిమయం బ్రవీతి మహావీరః.

ల—(కించిదుపసృత్య) ఇత ఆవాం ఇతో భవాన్.

వా—భోః కావేతౌ యువాం.

ల—మహాభాగ! రాఘవౌ క్షత్రియావావాం.

వా—ఆః యుష్మదాకారవిశేష ఏవావగమయతి జాతివిశేషః తద్విశేషంబ్రూహి.

ల—నన్వుక్తమేవ రాఘవావావామితి.

వాలీ—(సాభ్యసూయం) ఆః.

శ్లో. వపురేవ వివృణోతి క్షాత్రమంతర్విశేషం
రఘుషు యదభిధత్సే రాఘవావిత్యభీక్ష్ణం

నెగమీాటినవారలు వీరెయైయుండవచ్చును. (జ్ఞాపకము నభినయించుచు, వితర్కించుకొనుచు) ప్రియమిత్రుఁడైన యాలంకేశ్వరుండు మాకిట్లుసందేశమునంపెనుగదా!

"చ. అడవుల నుండు దుంపలుఫలాకులు, సుంత కుమారవృత్తిగా నిడి, జనకుండువీడ మనుజేశునిపుత్రుఁడెవండొ మందభా గ్యుఁడొకఁడు చేరి నంపహాదియున్ధనువున్గొనివచ్చి వెంట ద మ్ముఁడొకఁడు తోడుగాఁగ నిరవుంగొనియుండెను దండకాటవిన్.

కావున వారిరువురు నక్కడవిహరించుచున్న యసురుల యందు పాటచ్చరీవృత్తిని వహించియుందురుగాన వారిని వారించుకొనుచుండవలయును." కావున నితఁడునితఁడును వారిరువురె కావచ్చును.

తా—వత్స! లక్ష్మణా! వినుమిమ్మహావీరుఁడెద్దియోయనుచున్నవాఁడు.

ల—(కొంచెముజరిగి) ఇదిగో! ఇక్కడనున్నాము. అయ్యా ఇటురండు.

వా—మీారిరువురెవ్వరు?

ల—ఆర్యా! మేముక్షత్రియులము, రాఘవులము.

వా—ఆయుష్మంతుఁడా! మీాజాతివిశేషమును మీాయాకారవిశే షమే దెలియఁజేయుచున్నది. అంతకెక్కుడు విశేషమును దెల్పుము.

ల—మేమురాఘవులమని తెలిపియేయుంటినిగదా?

వా—(అసూయతో)

తే. గీ. తెలుపకయె తెలుపుచుండె క్షత్రియులుగాఁగ
నెంతొ తేటగ మీాదు నాకృతులె, కాని

పరికలయతు మిష్టంనామసాంస్కారికం వా
మహహా! కథ మపత్యప్రత్యయా న్నిశ్చినోమి ?. 38.

ల—(సధైర్యసంరంభం) భోః ఆవాం 'తౌ' రామలక్ష్మణౌ.

వా—(సవిమర్శ మాత్మగతం) కథం తౌ ఇతి సర్వనామపదేన ప్రసిద్ధావిత్యాహ తత్కిమనయో రన్యతరః పినాకస్య ధనుషో దమయితా సోఽపిరామభద్రస్సాస్య ద్భవ త్వేవం తావత్. (ప్రకాశం విహస్య).

శ్లో. ఏకో వేషపరిగ్రహః పరికరస్సాధారణః కర్మణా
మాకృత్యోర్మధురత్వమేవ సదృశం తుల్యైవ గంభీరతా
తం ద్రష్టుం చిరముత్సుకోఽస్మి కతరో వాం రామభద్రః పునః
సర్వక్షత్రవధవ్రతీ భృగుపతి ర్యేనావకీర్ణీకృతః. 39.

ల—(సవినయమివ) ఆర్య ! సంక్రందననందన ! లక్ష్మణ స్తావదహం.

వా—వత్స! అయ మప్యపరో దాశరథిః కౌశికాన్తేవాసీ రామః.

ల—అథ కిం ?

వాలీ—(సహర్షోల్లాసస్మితం కించిదుచ్చైః) భోః భోః రామభద్ర !

రాఘవులనా నపత్యపుంబ్రత్యయమున
నెఱుఁగఁదలఁచిన నామంబులెట్లుదెలయు ?. 38.

ల—(ధైర్యసంరంభములతో) మేము ఆరామలక్ష్మణులము.

వాలి—(విస్మయించుకొనుచుఁ దనలో) ఏమిది! ఆరామలక్ష్మణుల మని సర్వనామపదమునఁ గడుఁబ్రసిద్ధులనుగాఁ దెల్పుచున్నాఁడు. అట్లయిన నిందొకఁడా యీశ్వరునివిల్లువిరిచిన యారామభద్రుఁడై యుండవచ్చును. సరియే అట్లుకానిమ్ము. (ప్రకాశముగా నవ్వి)

చ. సరియగువేషధారణము చక్కనియాకృతులొక్కరీతివే,
పరికరముల్ సధర్మములు భావగభీరతయున్ సమంబె, యిం
దరయ నెవండు క్షత్రియువధాదను నాభృగునాథుగెల్చె సం
గరమున, నట్టిరాముఁ గనఁగాఁ జిరకాలముచుండితోఁచుదున్. 39.

ల—(వినయముతోఁ బలె) ఆర్య! పురందరనందనా! నేను లక్ష్మణుఁడను.

వాలి—వత్స! అట్లయిననీరెండవయుతేఁడు కౌశికశిష్యుఁడగు రాముఁడనుకొనియెదను.

ల—కాకేమి ?

వా—(ఉల్లాసముతోఁ గొంచెముబిగ్గరగా) ఓ రామభద్రుఁడా!

సీ. జగమంతయు త్రివర్ణసంగతంబుగఁ జేయ
సమకట్టినట్టి యాజామదగ్న్యు
నిర్భరంబగు నస్త్రగర్భంబునుండి క్ష
త్రియజాతి వెడియఁ దెచ్చినట్టి

శ్లో. ఏవం త్రైవర్ణ్యమాత్ర వ్యవసితజగతో భార్గవస్యాత్ర గర్భా
దాకృష్టక్షత్రజాత స్త్వమసి పథి గిరామద్య న స్సుప్రభాతం
కక్షోన్మస్వేదసద్య శ్శ్యమిత దశముఖాస్ఫోటకండూవికారో
వీరశ్రద్ధో భుజస్త్వాం పరిచరతు చిరం చక్షుషీనందతాం చ. 40.

రా—(దృష్ట్వాసహర్షం) స ఏష మహాబాహుస్సాంక్రందనమానుః.

శ్లో. యేన వీరేణ గుప్తాయాం
కిష్కింధాయా మియం మహీ
రావణాభిభవక్లాంతా
శశ్వదుచ్ఛ్వాస మశ్నుతే. 41.

(ఇతిపరిక్రామతి)

ల—మహాభాగ ! అయమార్యః ఇతోభవాన్.

వాలీ—(ఉపశ్రుత్య) రామభద్ర !

శ్లో. సురాసురాణా మసుభి
ర్జీవ్యతాంసఖిరో మునిః
అద్య మే నారద స్తుష్టో
యేనాపి భుజగోచరః. 42.

నీచర్యకసువర్ణనీయ, మిప్పేళ నా
కెంతయు సంతసం బెసఁగుచుండె
నిటఁ గొంత తడవు నిన్నీక్షించు నానంద
కలనఁ గోరుచునుండెఁ గన్నుఁదోయి

తే. గీ. రావణాసురసమరకండూవికార
రోగ మాత్మకు స్వేదయోగగరిమ
నణఁచి శ్రద్ధగ వీరులనరయు నాదు
భుజము నిన్నుఁ బరీక్షింపఁ బొంగుచుండె. 40.

రా—(చూచి, సంతోషముతో) ఇదిగో! మహాభాగుఁడగు నయ్యింద్రనందనుఁడు.

కం. ఈవీరవరుఁడు కిష్కిం
ధావన మొనరింప, నూపిరాడుచునుండున్
రావణుఁడు పెట్టుబాధల
చే వగలం బొగలుచుండు క్షితికపుశపుషున్. 41.

(అని నడచుచున్నాఁడు.)

ల—మహాభాగుఁడా! ఇదిగో! అయ్యఁడిక్కడనున్నాఁడు, ఇటు రండు.

వా—(సమీపించి) రామభద్రా!

తే. గీ. అసువులొడ్డి తమింజూదమాడు సురయు
తాసురుల పయిపందెగాఁడయిన నార
దుఁడు కడుంగడు సంతసంపడునుగాక
నాభుజంబుల కీవు కన్పడుట కతన. 42.

రా—మహావీర! కిముచ్యతే? మూర్ధాభిషిక్తో౽సి సమరశౌండానాం.

శ్లో. దేవస్య త్ర్యావుసూత ద్విషదుపమృదిత స్వర్వధూవేణిబంధ
ప్రేఙ్ఖోద్ధారాళ్యైవెర ప్రసృమరసమరోడ్డామరౌజా బిడౌజాః
యో విద్ధోత్ఖాతబాణవ్రణనివహనిభం నిర్భరాభంగురభ్రూ
భీమం భ్రామ్యద్భిరంగైరుదవహతరుషారజ్యదక్ష్ణాం సహస్రం.

అపిచ—

శ్లో. బందీకృత్య జగద్విజిత్వరభుజస్తంభౌఘమస్సంచరం
రక్షోరాజమపి త్వయా విదధతా సంధ్యాసమాధివ్రతం
ప్రత్యక్షీకృతకార్తవీర్యచరితా మున్ముచ్య రేవాం సమం
సర్వాభిర్మహిషీభిరంబునిధయో విశ్వేపి విస్మాపితాః. 44.

వా—(విహస్య)

శ్లో. చిరాయ రాత్రించరవీరచక్ర
మారాంకవైజ్ఞానికపశ్యత స్త్వా
సుధాసధర్మాణ మిమాం చ వాచం
న శ్వణ్వత స్తృప్యతిమానసం మే. 45.

కింతు-

శ్లో. యేనాచ్ఛిద్య సమస్తపార్థివగణ ప్రాణాంతకం కార్ముకం
రామస్సంప్రతి లంభితో భృగుభువాముత్సర్గసిద్ధాం స్రుచం
ద్రష్టుం వీర! చిరస్యధామ| భవత స్తద్బాహుర్భవ స్స్వత్రయీ
హృన్మర్మవ్రణరోపణౌషధమిమౌ బాహూ బహూత్తామ్యతః.

రా—మహావీర! చెప్పెడిదేమి? సమరనిపుణుల కెల్లరకును శిరోభూషణమవు కదా?

చ. రిపుహృతనిర్జరీజన నిరీక్షణచే జనియించు కిన్కనో
నపరిమితాహవంబున భయంకర రక్తదృశాసహస్రమున్
వపువున నాటుతూపులను బాపిననో వ్రణపుంజముట్టు లే
నిపుణుఁడుదాల్చు, నట్టిసురనేతకు సూనుఁడవీవలంతివే?. 43.

మఱియు,

తే. గీ. ఘనభుజుండగు రావణుఁ గక్షమందు
దాలిచియె నీవు సంధ్యావ్రతంబునచుపఁ
గార్తవీర్యజ్ఞయగు రేవగాక, యెల్ల
రాణిగమితోడఁ గడలు లబ్బంబుపడవె? 44.

వాలి—(నవ్వి)

చ. తడవుగ యామినీచరకదంబముతో నగు సంగరంబులన్
గడు గడిదేఱి ప్రౌఢిమనెసంగుచునున్న నీవు క 45.
న్పడుటకునైన, నీమధురవాక్కులు చెక్కఁగ వీనులార వి
న్బడుటకునైన, నిక్కముగ నామది తృప్తివహింప దింతయున్.

ఇంతియకాక,

ఉ. రాజసమాజసాధ్వసకరంబగు భార్గవుచేతిదౌ ధనూ 46.
రాజము నాజి లాగికొని క్రమ్మఱ తద్భృగువంశ్యపాళికా
సాజపుస్రుక్కుఁబూనునటుసల్పిన నీ త్రిజగద్వ్యథాపహృ
త్తేజమెఱుంగ బాహువులతిత్వరఁజెందెడుఁ బెక్కునాళ్లుగాన్.

రా—(సస్మితం)

శ్లో. నన్వేతదధిమార్వీకం
యుద్ధసర్వస్వదక్షిణం
సజ్జ్యమస్త్యేవ మే రక్షో
లక్ష్మీమూలహరం ధనుః. 47.

తన్మహాభాగోపి శస్త్ర మాధత్తాం.

వాలీ—(విహస్య) సాధు భో మహాక్షత్రియ! సాధు యథా ధర్మ మభిదధాసికిం పునః.

శ్లో. నయోహి సాంగ్రామిక ఏష గోష్మతాం
యదాత్మజాతిప్రతిరూప మాయుధం
అయః కుశీభిః కపయో న శస్త్రిణః
తలాని ముష్టిశ్చ నఖాశ్చ సంతినః. 48.

ల—ఆర్య! సాధూక్తం మహాభాగేన నిత్యోపనతస్వాంగశస్త్రైవ తిరశ్చాం జాతిః.

రా—(విహస్య ధనురాస్ఫాలయన్).

శ్లో. సర్వాఘప్రసరేణ రావణి రసౌ యద్దుర్యశోభాగినం
చక్రే గౌతమశాపయంత్రితభుజస్తేనూన మాఖండలం
కణ్ఠాగ్రకులీరతాం గమయతా వీర! త్వయా రావణం
తత్సంస్పృష్టమహో! విశల్యకరణీ జాగర్తి సత్పుత్రతా. 49.

సోపి త్వ మస్మాకం దైవేన శరవ్యం కృతోసి.

రా—(చిఱునవ్వుతో)

ఆ వె. అట్టులయిన నెక్కు వెట్టినదై యిదే
సంగరమున జయమొసంగఁజాలి
యసురవైభవంబు నామూలముగఁ ద్రుంప
గలుగువిల్లుచేతఁ గలదుగాదె ?. 47.

కాఁబట్టి మహాభాగుఁడవగు నీవును శస్త్రమును బట్టుదువుగాక.

వాలి—(నవ్వి) అగును. ధర్మమునననుసరించి నీవు చక్కఁగానే చెప్పితివి కాని,

తే. గీ. తనదుజాతికిఁ దగు నాయుధంబెపూని
యుద్ధమొనరింప నగు బాహుయుతుల కెపుడు
దారులోహాదికములు శస్త్రములుగావు
కఱకుఁగోళ్లను బిడికిళ్లుఁగలవు మాకు. 48.

ల—(నవ్వి) ఆర్య ! అగును. మహాభాగుఁడు చెప్పినది యథార్థమే. నిత్యసంసిద్ధములగు నంగములె యీతిర్యగ్జాతికాయుధములు.

రా—(నవ్వి ధనుష్టంకారము చేయుచు) అద్దిరా !

ఉ. గౌతమశాపతప్తు బలఘస్మరు రావణి పూని దుర్యశో
న్వీతుని జేయుఁ దప్పితను నీరతఁ గఱబిలప్రవలీనమా
పీతను జేసి జేసితివి పిత్రను మోదము; తాదృశుల్ గుణా
న్వీతసుతుల్ విశల్యకరణీతులితుల్ గద! తండ్రి కారయన్!. 49.

అట్టివాఁడవగు నీవె దైవవశమున మాకుశరవ్యుఁడవయినాఁడవు.

వాలీ—(సరోషం) ఆః కాకుత్స్థ !

శ్లో. అస్మద్దోర్మూలకూలంకషవిషమభుజా గ్రన్థిబంధప్రసంగ
క్రోశల్లంకేశదత్త త్రిభువనవిజయ ఖ్యాతిసర్వస్వరూపః
యః కశ్చి ద్విక్రమోఽయం సఖలు ఖలచరీకృత్ర సాధారణత్వా
దంతర్మందాయమానో విజితభృగుపతిం త్వామజిత్వా ధునోతి.
తద్దేహి విమర్ధక్షమాం భూమి మవతరావ (ఇతినిష్క్రాంతౌ.)

సు—దిష్ట్యా ఫలిత మస్మాకం మనోరథేన.

ల—(నేపథ్యాభిముఖమవలోక్య) ఇదమన్యతో వానరద్వయం
ఆర్యస్య హార్షిగ్రాహమివ సంభ్రమాదనువర్తతే. తదహమపి
ధనురారోపయామి.

సు—(దృష్ట్వా సహర్షం) కుమారలక్ష్మణాలంకులమావేగేన సుగ్రీవో
రామదేవగుణానురాగేణ వాలిమత్సరేణ చ ద్విగుణీ
కృతోత్సాహః సమరసీమా మాపతతి.

ల—ఏష వైకర్తసిః అథాపరః కః !

సు—అయమపి కిష్కింధేశ్వరస్కంధావారైకవీరో భవతః ప్రభంజ
నస్య పారస్త్రైణేయః పుత్రో హనూమాన్.

ల—(సహర్షం) కథమయ మసావాంజనేయః అయం హి.

శ్లో. బ్రహ్మశాప పరామృష్టః
స్వవీర్యజ్ఞానయంత్రితః
అన్యైరపి భువం వీరైః
కీర్త్యమానా ముపేక్షతే. 51.

వాలి—(రోషముతో) ఏమీ! కాకుత్స్థా!

శ్లో. దోర్మూలంబుననొక్క బాహువులగ్రంథుల్ భగ్నమై దిక్తటుల్
మార్మ్రోయన్ దశకంఠుఁడార్వ ఘటియిన్పంబడ్డ యొక్కించుకా
వేగోద్దంబిడనర్జునుండనని నల్పేన్వాని; నయ్యర్జునున్
నిర్మూలించినభార్గవుంగెలుచు నిన్నిర్జింప సంతుష్టియౌ. 50.

కావున రమ్ము! యుద్ధసమ్మర్దమునకోర్చుచోటికిఁ బోవుదము!.

(వెళ్లుదురు.)

సు—పుణ్యవశమున మామనోరథము ఫలియించినది.

ల—(తెరవంకఁ జూచి) ఇటనుండి యన్నగారికియుద్ధమునందుఁ దోడ్పడు ననుచరులంబలె వానరు లిరువురు సమీపించుచున్నారు. గాన నేనును ధనువు నూనుదును.

సు—(సంతోషముతో) లక్ష్మణా! తొందరపడనక్కరలేదు. ఇతఁడు రాముని గుణములందలి యనురాగముచేతను వాలియందలి మత్సరముచేతను రెట్టించిన యుత్సాహముతో యుద్ధభూమికి వచ్చుచున్నవాఁడు.

ల—ఇతఁడా సూర్యనందనుండైన నా రెండవయతఁడెవ్వఁడు ?.

సు—ఇతఁడవ్వాలిసేనావారమున కధినాథుఁడును బూజ్యుఁడగు ప్రభంజనుని నందనుఁడునగు హనుమంతుఁడు.

ల—(సంతోషముతో) అట్లయిన నితఁడాయంజనీతనయుఁడా ?

కం. నలువ శపియించుటం దన
యలఘుతరంబయిన శక్తియంతయు మదిలోఁ
దెలియమినిగాక యీతని
కిలలోఁ బ్రతివీరుఁడనుచు నీక నొకఁడున్నె ?. 51.

నియతమనేనాస్మాకం హృదయశల్యముద్ధరిష్యతే ఇదం తు
వర్తమానమేకతులాద్యూతమార్యస్య జయలక్ష్మీపరిగ్రహో
యాతకే యశః వయంవా సుగ్రీవో న కేచితయాధికారిణః

గః—(ససంభ్రమం) కుమార! పశ్య పశ్య.

శ్లో. సప్తసాలా వయం భిత్త్వా
వాలిప్రహరణీకృతాః.
హత్వా చ వాలినం బాణో
రామతూణీముపాగతః. 52.

అహహ !

శ్లో. ప్రాణైస్సమం కనకపుష్కరకంఠమాలా
సూత్రేణ దాశరథయే విహితాతిథేయః
దిక్కూలముద్వహయశస్సరిదాదిశైల
శ్శేతే సవీరశయనే కపిచక్రవర్తీ. 53.

ల—(సఖేదం) హా! దేవ! సంక్రందన! క్వ పునరీదృశం మహా
వీరప్రకాండమాత్మజం సహస్రేణాపి లోచనైరవలోక
యిష్యసి! (నేపథ్యే- దుందుభిధ్వనిః మంగళగీతిశ్చ).

గః—(సహర్షం) కథమయమార్యజాంబవదాదిభిరభిమంత్రి
తైశ్శాతకుంభకలశైస్సలిలైః కుమారసుగ్రీవమభిషించతి.
స్వయం చాస్య దేవో దాశరథిః కార్తస్వరపుండరీక
మాలయా కంఠమలంకరోతి.

కాఁబట్టి నిశ్చయముగ సీతనివలన మాహృదయశోకము శాంతింపఁగలదు. ఇది యార్యునకుఁగలిగిన తూనిక పందెము. ఇందు జయలక్ష్మీపరిగ్రహమున వరశుల్క రూపమనఁదగుకీర్తికి మనముగాని యాహనుమంతుఁడు గాని సుగ్రీవుఁడుగాని యంశార్హులముకాము.

గు—(సంభ్రమముతో) కుమార ! చూడుము. చూడుము.

కం. వాలిములుకులుగఁ బఱపిన
సాలము లేడిటిని దునిమి నగగున వాలిం
దూలించి రామబాణము
హేలాగతివచ్చి తూణినిదె వసియించున్!. 52.

అద్దిరా !

ఉ. అనువులతోడఁ గూడఁ గనకాంచితపుష్కరకంఠమాల సం
గరమున రామభద్రుని కుదారతఁగాన్కగనిచ్చి సద్యశో
విసరము సర్వదిక్తటులఁ బొపువహించిరహింప నెంతయో
నసదృశలీల నక్కపికులాగ్రణి పండెను వీరశయ్యపై. 53.

ల—(దుఃఖముతో) అన్నా ! దేవా ! సంక్రందనా !
యీలాటి మహావీరాధివీరుఁడగు కుమారునిఁక నిండార వేయికన్నులతో మఱలనెందుఁ జూడఁగలుగుదువు ?

(తెఱలో భేరీరవము మంగళగీతియును)

గు—(సంతోషముతో) ఏమీ ! ఇదిగో ! యానీలుఁడు పెద్దలగు జాంబవంతుఁడు మున్నగువారలభిమంత్రించిన బంగరుకలశ. (జలములతో నభిషేకించుచున్నాఁడు.) (దాశరథియుఁగూడ బంగారుపుండరీకమాలికచే స్వయముగ నిజనికరము నలం

ల—ప్రియం నద్దఃప్రియం నః. (పునర్నేపథ్యే)

భోః భోః వానరాచ్ఛభల్లగోలాంగూలయూథపతయః శర్వానేషతో మహాదేవస్సుగ్రీవ ఆజ్ఞాపయతి. "సజ్జయంతు భవంతః సర్వాణి యౌవరాజ్యోపకరణాని అద్యమహం సీతాదేవ్యాః ప్రవృత్తిమన్వేష్టుం ప్రహిత్య హనుమంత మూర్ధ్వమౌహూర్తికే లగ్నే కుమారమంగద మభిషేక్ష్యామి"

ల— శ్లో. ఉత్సవ స్సోయమస్మాకం

సర్వదా హృదయంగమః

కింతు వాలీ విలీనోయం

వ్యథయిష్యతి వాసవం. 54.

(అంతరిక్షే పుష్పవృష్ట్యనంతరం)

జయ జయ జగత్పతే రామభద్ర !

శ్లో. లక్ష్మ్యైవాలిసిబర్హణప్రశమితద్వైరాజ్య వైరాగ్యయా

కిష్కింధాయతనైకదైవతమయం తారాపతి ర్ధీష్యతే

నప్తారంయువరాజమంగదమపి శ్రుత్వాతి హార్దావభూ

దాస్రాంభః పృషతౌఘమాత్రికి మయోద్గుంభస్సహస్రేక్షణః.

ల—ప్రియాత్ప్రియతరం నః వయస్య! తదేహ్యావామపి మహో త్సవసంవిభాగినౌ భవావః.

(ఇతి నిష్క్రాంతౌ.)

పఞ్చమోఙ్కః.

---

కరించుచున్నాఁడు.) (మరలఁ దెఱలో) ఓయోయి వానరాచ్ఛ భల్లలాంగూలాదిసేనాధినాథులారా! మన సుగ్రీవమహారాజు గారిట్లులానతిచ్చుచున్నారు. "యావరాజ్యమునకుపయోగ మగు సంభారముల నెల్ల సిద్ధము చేయుఁడు. ఇదిగో! నేను సీతాదేవిగారి వార్తనరయుటకు హనుమంతుని నియమించి సుముహూర్తమునఁ గుమారునంగదు నభిషేకింపుదును."

ల— కం. ఈయుత్సవంబు మన క

త్యాయతసంతోషదాయియయి యొప్పనుగా

కా యింద్రున కక్కట! యిది

చేయుంగద మిగుల వికలచిత్తునిగాఁగన్. 54.

(ఆకసమునఁ బూలవానకురిసిన పిదప)

రామభద్ర! నీకు జయమగుఁగాక!.

శా. స్వారాట్పూన్తి దివంగతుండగుటఁ దత్సంస్థానపున్ లచ్చి దా

ద్వైరాజ్యక్రమదీతి యేకవిభుతో భాసిల్లు, సుగ్రీవుతో

తారాజాసుతజాంగదుండన ముదుర్యద్బాష్పబిందావ్యాఘ దృ

కూష్పాకుండౌచు సహస్రనేత్రుఁ డెసఁగున్ ముత్తెంపుగుత్తింబలెన్.

ల—ఇది నాకుఁ బ్రియాత్ప్రియతరము గానున్నది. గాన మనము గూడనమ్మహోత్సవసందర్భమునఁ బాల్గొందము.

(ఇట్లిద్దరు వెళ్లుదురు.)

ఇది పంచమాంకము.

# అనుబంధము.

## తృతీయాంకము

(5) శ్లో॥ అనాకూతైరేవ ప్రియసహచరీణాం శిశుతయా
వచోభిః పాంచాలీమిథున మఘునా సంఘటయితుం
ఉపాదత్తే నోవా విరమతి నవా కేవలమియం
కపోలాకల్యాణీపులకముకులై ర్దంతురయతి॥

చ॥ చెలువలు బాల్యనిష్కపట చిత్తతఁ బుత్తడి బొమ్మపెండ్లిళుల్
సలుపుచు నట్టి యాలొమ్మగల సంఘటనన్ ఘటియింపు మంచుఁ ద
న్బలు, మఱువేడ సిగ్గునను వక్త్రము వంచికుమారి చెక్కులన్
బులక లెసంగఁగా నిలుచు; పూనదు మానదటుల్ ఘటింపఁగాన్॥

(6) శ్లో॥ మనోవిశంక మానాభి
ర్బాలాభి రుపజీవ్యతే
అషడక్షీణ షాడ్గుణ్య
మంత్రీ మకరకేతనః॥

ఆ॥ వె॥ మానసంబులందు నైనఁదలంపఁగా
సాహసింప లేక జంకుచుండు
నట్టి బాలిక లషడక్షీణ షాడ్గుణ్య
మంత్రియైన మరుని మనుచుచుండు॥

(7) శ్లో॥ తదాత్వప్రోన్మీల న్మ్రదిమరమణీయాత్కరినతాం
నిచిత్య ప్రత్యంగా దివ తరుణభావేన ఘటితా
స్తనా సంబిభ్రాణాః క్షణవినయ వైయాత్యమ సృణ
స్మరోన్మేషాః కేషామురపరి న రసానాంయువతయః॥

చ. అతిమృదులంబు లయ్యె సకలాంగము లిష్టన జవ్వనంబు త
ద్గతకఠినత్వము న్దిగిచి కల్గఁగఁజేసినటా నురో గుహా
ద్వితయముతోఁ దృటిన్ వినయధృష్టతలూన్చు స్మరోదయంబుతో
జత గాని యే రసంబుల నెసంగరు కన్నియ లున్నతస్థితిన్॥

చతుర్థాంకము.

3. శ్లో॥ ఇతః పౌరస్త్యాయాం కకుభి వివృణోతి క్రమదళ
త్త్విషాం స్రామర్మాణం కిరణకలికా మంబరమణిః
ఇతో నిష్క్రామంతీ నవరసగురోః ప్రోంఛతి వధూ
స్స్వకస్తూరీపత్రాంకుర మకరికాముద్రిత మురః॥

చ॥ తొలిదెసఁ బ్రొద్దువెల్గు గమిదోఁపఁ దమంబు శమించి మర్మముల్
దెలియఁగరా నవేష్టు వసతి న్విడి వేగ మురోరుహాద్వయా
కలిత సముల్లసన్మకరికారచనల్ దొలఁగించి కొంచు బల్
పొలుపుగ నేఁగుచుండె నదె పొల్తుకయొత్తు స్వకీయసద్మమున్॥

4. శ్లో॥ అయం మృదుమృణాళినీ వనవిలాసవైహాసిక
స్త్విషాం విపతతే పతి స్సుఖది దృశ్యమానా నిజాః
స్తనా పులకయన్తి చోత్పలదృశాం ప్రియోరః స్థలే
విపర్యసితవృత్తయో ఘుసృణపంకపత్రాంకురాః॥

చ. లలిత మృణాళినీ వనవిలాస విదూషకుఁ డౌచుఁ బ్రొద్దు శో
భిల నెలఁతల్ నిశాంబతుల పేరెదల న్విపరీతరీతి ము
ద్రిలువడి కానవచ్చు తమ రమ్యపుఁ గుంకుమపత్రభంగ చి
హ్నాలెకని వేడ్కమైఁ బులక లంగఁగఁ జేతు రురోజపాళులన్.

5. శ్లో॥ ప్రియవసతే రాయాంతో

మిధః కరంభితకరాంబు జన్మానః

కరజవ్రణ పదవిరళ

స్తనపులక మనూః కిమపి వివదంతే॥

తే॥ గీ॥ చెలువ లొండొండ్లబుజములఁ జేతులొప్ప

నుపపతులయిండ్లు విడిచి చన్నాడి రెవియో

నుడివికొనుచు నఖాంకముల్ వడయకుండు

చోట్లఁ గుచములఁ బులకలు సొంపుపింప॥

6. శ్లో॥ ప్రిభాతే పృచ్ఛంతీ రనురహసి వృత్తం సహచరీ

ర్నవోఢా న వ్రీడాముకుళితముఖీయం సుఖయతి

లిఖంతీనాం పత్రాంకురమతుల మస్యాస్తు కుచయో

శ్చనుతాకారో గూఢం కరజపద మాసాం కథయతి॥

చ॥ చెలులు నిశారహస్యపు విశేషము లేమని యొంతవేశినన్

బలుకక సిగ్గుచేతఁ దలవంచు నవోఢ; యురోపహార్యయిన్

జెలువుగఁ బత్రిముల్ రచనసేయు నెడన్ దమ కామెచన్నునా

ర్పులు దెలుపున్ నిగూఢతను బొంది నఖాంకములున్న చోటులన్॥



# తప్పొప్పుల పట్టిక.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. | పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 3 | ఙ | ఞ | 29 | 4 | విశ్వ | దశ. |
| 2 | 4 | ఫ | ప | ,, | 7 | మఖిం | మఖం |
| 4 | 7 | కదైక | పదైక | 33 | 10 | త్రిశకు | త్రిశంకు |
| ,, | 12 | వవాళీ | వనాళీ | 36 | 2 | మేన్ | మేఞ |
| ,, | ,, | శ్యస | శస్య | 37 | 10 | లిప | లింప |
| 5 | 17 | కెడన్ | కెదన్ | ,, | 11 | మైవ | మైన |
| 7 | 16 | దెశసు | దేశస్థు | 39 | 10 | భృశాశ్య | భృశాశ్వ |
| ,, | ,, | తుర్రిడఁ | తుర్రిఁడ | 40 | 1 | వయ | వయం |
| 8 | 3 | విస్య | ప్రవిశ్య | 41 | 3 | పీపట | పీవట |
| 9 | 5 | శుశక్తి | శుక్తి | ,, | 8 | నయ్మోడు | నయ్యోడు |
| ,, | 11 | రుత | గురుత | ,, | 9 | పరఖ | పరిఖి |
| ,, | 18 | సదర్రిరస | సదర్రిస | ,, | 18 | నెల | నెం |
| 11 | 18 | వుచు | పుదు | 42 | 15 | భాసు | భాను |
| 12 | 21 | ప్రిగ్భ | ప్రిగల్భ | 45 | 6 | మునిన్ | మునిఞ |
| 13 | 5 | బేరొక్కాన | పేరొక్కాన | ,, | 9 | సుంత | సుంత్రత |
| ,, | 10 | నిక | నిఁక | ,, | ,, | ఁదోప | దోఁప |
| 14 | 1 | సటః | నటః | 47 | 6 | నగే | నగ్రే |
| ,, | 3 | వాంఛార్త్ర | వాఞ్ఛార్త్ర | 52 | 2 | ద్భుణం | ద్రుణం |
| ,, | 12 | కగః | కరః | 56 | ,, | తనః | తవః |
| 15 | 9 | రూప | కూప | ,, | 14 | లక్య | లోక్య |
| ,, | 10 | లముహాః | ములహాః | 57 | 4 | నలెను | నల్లెను |
| 19 | 1 | అపగ | అనగ | ,, | 15 | బాచి | బ్రాచి |
| ,, | 3 | వనిష్ఠ | వసిష్ఠ | ,, | ,, | డుత | డురత |
| ,, | 5 | కిన్ | కీన్ | 58 | 19 | బిబ | బింబ |
| 21 | 10 | తీరిన | తీజిన | 59 | 7 | కాతుల్ | కాంతుల్ |
| ,, | ,, | తేరు | తేఱు | 60 | 16 | దర్మ | ధర్మ |
| ,, | 16 | మహిష్టు | మహిష్ఠు | 63 | 7 | కాపున | కావున |
| 23 | 17 | యుపె | యుఁబె | 64 | 7 | రజ్య | రజనీ |
| 24 | 9 | గుర | గుణైర | ,, | 8 | కసీమ | కనీమ |
| 25 | 23 | పరచు | పఱచు | | | మవళాక | మవలోక్య |
| 26 | 4 | భమ | భ్రిమ | ,, | 10 | అసు | అను |
| 27 | 19 | మీఅలు | మీరలు | ,, | 13 | ఆ | అ |
| ,, | 22 | నడచు | నడుచు | ,, | 15 | శక | శంక |
| 29 | 3, 4 | -- | సపరివారము | 65 | 5 | కుకా | కుఁగా |
| | | | గనీకు మేలగు | ,, | 21 | విరచు | విడుచు |
| | | | గాక | 69 | 10 | స్త్ర | స్త్రీ |
| (అందరుఁదగినట్లు కూర్చుందురు.) | | | | ,, | 20 | నుఁడె | నుండె |

| | | | |
|---|---|---|---|
| 70 | 14 | పల్యవ | పర్యవ |
| 72 | 3 | తదలీ | తదపి |
| 73 | 13 | కరఁ | ఁగరం |
| ,, | ,, | వరలు | వఱలు |
| 77 | 5 | నతుౢ | వత్తుౢ |
| 79 | 11 | వరలు | వఱలు |
| 84 | 10 | గుణో | గణో |
| 86 | 7 | వన్యా | వన్యాశ్శరీర స్థితిః |
| 89 | 6 | పుటల | పుట్టల |
| ,, | 11 | శాతిం | శాంతిం |
| ,, | 17 | మాసమై | మానమై |
| 97 | 16 | ముృద | నృ్మద |
| 101 | 2 | దివము | దివమ్మ్మ |
| 102 | 3 | దిఙ్మా | దిఙ్మాత్ర |
| 108 | 4 | న్యాభ్యార్ణాః | న్మాత్రార్ణాః |
| 112 | 1 | లక్షు | లక్ష్మ్మ |
| 114 | 12 | మైదవ | మైందవ |
| 117 | 11 | యన్ | యఁన్ |
| 125 | 11 | తీరిన | తీఱిన |
| 125 | 14 | సంబు | సనఁబు |
| 127 | 9 | గ్రమ్మర | గ్రమ్మఱ |
| 129 | 14 | ప్రినూతు | ప్రసూతు |
| 138 | 12 | గుఱవే | గురవే |
| 141 | 13 | సుఖంబ | సుఖం |
| 143 | 1 | కారార | కారార్థ |
| ,, | 2 | ప్రతిష్ట | ప్రతిష్ఠ |
| 144 | 4 | పజ్జ్యా | పజ్జ్ఞా |
| ,, | 9 | బధూ | బభూ |
| ,, | 13 | నిర్గళ్య | నిర్ద్రళ్య |
| 148 | 5 | పయో | వయో |
| 153 | 12 | వింౢ | వింధ్ల |
| ,, | 21 | రెవ | రేవ |
| 157 | 22 | సుతాంగ | సుతోగ్ర |
| 161 | 4 | ప్ర...దా | ప్రతిమతదా |
| ,, | 8 | భువ | భువ |
| 165 | 7 | ణుడా | ణుఁడా ! |
| 176 | 7 | రో స్తం | ద్రో స్తం |
| 177 | 16 | పుజ | పుంజ |
| 180 | 11 | పతగ | పతంగ |
| 181 | 7 | సయూధ్య | స్వయూథ |
| ,, | 12 | గాచుం | గాచం |
| | | జూచితె | జూచెడు |
| 185 | | కార | కార్య |
| ,, | 19 | నేక్ర | నేనిక్ర |
| ,, | 22 | నిదు | నిద్దుర |
| ,, | ,, | నసి | నలుసి |
| 186 | 9 | కుమాణాం | కుమారాణాం |
| 187 | 21 | ధరక్షిత | రథక్షితి |
| 189 | 2 | నిఁకే | నిఁకీ |
| ,, | 12 | ధృష్టకె | ధృష్టతకె |
| ,, | 17 | ఁగగు | దగు |
| ,, | 20 | త్ర్కర | తాౢర |
| ,, | 22 | ో | లోఁబుట్టి |
| 195 | 22 | — | (ఇట్టిరువురును వెళ్ళుచుఁరు |
| 197 | 10 | గ్రిశగుం | గ్రిసరుం |
| 201 | 7 | ఇద్దరు | ఇద్దఱు |
| 219 | 14 | హేరాౢడి | హేరాౢడి |
| 221 | 19 | బల్ కాచి | కాచిబల్ |
| 225 | 20 | జ్యేష్టు | జ్యేష్ఠు |
| ,, | 21 | మయూఖ | మహోగ్ర |
| 228 | 13 | బిపరేవ | భిరేవ |
| 231 | 1 | సప్వదీప | సప్తద్వీప |
| 233 | 6 | సుత | సుంత |
| ,, | 19 | సార | సార |
| ,, | 21 | భీష | భీషణ |
| 237 | 10 | జడ | ఝుండ |
| ,, | ,, | స్వర | స్స్వర |
| 239 | 16 | సుయెుం | సునోం |
| ,, | 19 | హాసకుల్ | హాసికుల్ |
| 243 | 8 | యుండిరి | యుంటిరి |
| ,, | ,, | మతి | మతితో |

ఇవిగాక ఇంకనిట్టివి పెక్కు లుండవచ్చును. పాఠకులు సవరించుకొనఁబ్రార్థితులు.